Aparichita Lekha and other stories by Stefan Zweig
adapted by Abburi Chaya Devi.

ప్రథమ ముద్రణ 1956
ద్వితీయ ముద్రణ 1998
(మార్పులూ, చేర్పులతో)

వెల : రూ. 30/-

ముఖ చిత్రం : శీలా వీర్రాజు.

ప్రతులకు :
విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు
నవోదయా బుక్ హౌస్, హైదరాబాదు

కంపోజింగ్ : మోనికా గ్రాఫిక్స్, మెహదీపట్నం.

ప్రింటింగ్ :
శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు.

ఇందులో -

# ప్రస్తావన

స్టెఫాన్ త్స్వైక్ ఆస్ట్రియా దేశానికి చెందిన 'యూదు', జర్మన్ రచయిత. ప్రప్రథమంగా మనోవిశ్లేషణాత్మక పద్ధతిని సాహిత్యంలో ప్రయోగించిన ప్రముఖ పాశ్చాత్య రచయితల్లో ఒకడు. అతను ఆస్ట్రియాకి చెందిన 'యూదు' కాబట్టి, 'నాజీ' ప్రభుత్వం అవలంబించిన నిరంకుశత్వానికీ, అణచివేతకీ గురి అయ్యాడు. నాజీ పోలీసులు అతని ఇల్లంతా వెతికి, అతని పుస్తకాల్ని దగ్ధం చేశారు. అప్పుడతను అక్కడ నుంచి తప్పించుకుని, ఇంగ్లండులో కొంతకాలం తలదాచుకున్నాడు. ఆ తరవాత బ్రెజిల్‌కి వెళ్ళిపోయాడు భార్యతో సహా. నాజీ ప్రభుత్వం చేస్తున్న ఘోర కృత్యాలనూ, ఆనాటి ప్రపంచ పరిస్థితినీ చూసి, విపరీతమైన మానసిక క్షోభని అనుభవించి, చివరికి భరించలేక, 1942లో తన 61వ ఏట భార్యతోబాటు ఆత్మహత్య చేసుకున్నాడు.

స్టెఫాన్ త్స్వైక్ కథలు 'కెలిడో స్కోప్' పేరుతో రెండు సంపుటాలుగా (1949, 1951) ఆంగ్లంలో వెలువడ్డాయి. వీటిలో స్త్రీ పురుష సంబంధాలనూ, వివిధ మానవ మనస్తత్వాలనూ ప్రతిభావంతంగా చిత్రించిన కథలెన్నో ఉన్నాయి. ఇతని కథలు సాధారణంగా చాలా పెద్దవిగా ఉంటాయి. కానీ చకచకా చదివిస్తాయి. పాత్రల స్వభావాలు

పాఠకుల మనసుల్ని ఆకట్టుకుని, ఆలోచింపజేస్తాయి. పరిస్థితులు వేరైనా, ఏకాలికంగా మానవ మనస్తత్వాలు ప్రపంచమంతటా ఒకేలాగ ఉంటాయి. మనోవిశ్లేషణతో కూడుకున్న కథలు కాబట్టి త్స్వైక్ కథల్లో విశ్వజనీనత గోచరిస్తుంది. వీటిని తెలుగులోకి అనుసరణ చేసి ప్రచురించడానికి కారణం అదే. ఆస్ట్రియన్ సంస్కృతీ, ఆంధ్రుల సంస్కృతీ ఎంతో భిన్నమైనవైనా, మనుషులు ఎక్కడి వారైనా, వారి ఆలోచనా విధానంలో ఏకత్వం ప్రదర్శిత మవుతుంది. ఎప్పటివో జర్మన్ కథలు నేటికీ ఎంతో మంది పాఠకుల్ని ఆకట్టుకోగలగడంలోని రహస్యం అదే.

త్స్వైక్ కథలు మూడింటిని తెలుగులోకి అనుసరణ చేసి, 'అపరిచిత లేఖ' పేరుతో ఒక సంపుటి 1956లో ప్రచురించడం జరిగింది. ఇప్పుడీ ద్వితీయ ముద్రణలో 'అశ్విని' అనే మరొక కథని - 'వనిత' (ఆంధ్ర యువతీ మండలి, హైదరాబాదు) పత్రికలో 1956లో ప్రచురింపబడిన దాన్ని కూడా చేర్చడం జరిగింది. ఈ సంపుటి కూడా తెలుగు పాఠకుల అభిమానాన్ని మళ్లీ పొందుతుందని ఆశ.

**అబ్బూరి ఛాయాదేవి**

# భయం

ఇందిర మేడమెట్లు దిగి క్రిందికొచ్చింది. ఇంతకుముందెన్నో సార్లయినట్టే ఇప్పుడు కూడా అనివార్యమయిన భయంతో ఆమె గుండె దడదడ లాడింది. కళ్లు రెపరెప లాడాయి. మోకాళ్లు గజగజ వణికాయి. దగ్గరే ఉన్న స్తంభాన్ని అనుకోవలసి వచ్చింది ఒరిగిపోకుండా. ఆ బాధ ఆమె కెంత బాగా తెలుసు! ఆమెకిది నిత్యానుభవం. ఆమె తన ప్రియుని కలుసుకున్నప్పుడల్లా, తిరిగివెళ్లే సమయానికి సరిగ్గా ఇలాగే నిష్కారణంగా భయపడి పోతుంది. అయితే ఆమె అవరోధించాల్సిన ఆటంకాలూ ఆపాయాలూ అనేకం. కానీ, అంతా అయిపోయాక అంత బాధపడటంలో అర్థం లేదు. పోనీ వెళ్లేముందు వణుకు పుట్టిందంటే విచిత్రం కాదు. రావలసిన స్థలానికి అద్దెకారులో వచ్చింది. కారుని వీధిచివరే నిలబెట్టించి, తను మాత్రం తడబడుతూ, త్వరత్వరగా ప్రియుడింటి వైపునడిచి మెల్లగా మేడమీదకు చేరుకుంది. ఆ సమయంలో పొందిన ఆదుర్దా అంతా ప్రియుని వక్షస్థలం మీద వ్రాలిన మరుక్షణంలోనే మరిచిపోయింది. కొన్ని ఘడియలు హాయిగా గడిచిపోయాయి... కాని... తిరిగి తన గృహానికి వెళ్ళవలసిన క్షణం ఆసన్న మయేసరికి ఒక వింత ఆందోళన... ఏదో పాప భీతి... ఓ విధమయిన వెర్రి భయం ఆవహించిందావిణ్ణి. వీధిలో వచ్చేపోయే జనమంత వెయ్యికళ్లతో తన్ను వీక్షిస్తున్నట్లు, తనకొచ్చిన కష్టమేమిటని అడుగుతూన్నట్లు అనిపించింది. ఆమె మనస్సులోని ఆందోళన అతడితో గడిపిన ఆఖరు ఘడియల్ని విషపూరితం చేసింది. వెళ్లిపోవాలనే కంగారులో వెళ్లొస్తానని చెప్పాలని తోచనేలేదు... అతని ఆఖరు సందేశం ఆమె చెవులకు చేరనేలేదు... ఎప్పుడక్కడినుంచి బయటపడతానా, ఎప్పుడు తన మామూలు సంసారంలోని ప్రశాంత వాతావరణంలో అడుగుపెడతానా అనే తహతహలో అతని అనునయ వాక్యాలను వినిపించుకోకుండానే చరచరా మెట్లుదిగిపోయింది. మెట్ల క్రింద చీకట్లో ఒక్కక్షణం ఆగింది ఆయాసంతో.

ఎవరో తలుపు తట్టినట్టుంది. అనాలోచితంగా నెత్తిమీద ముసుగువేసుకుని ముందుకిలాక్కుంది. తలవంచుకుని గుమ్మంవైపు వెడుతూ నగం తెరుచుకున్న తలుపు తోసుకుని గుమ్మందాటబోయింది. సరిగ్గా అదే సమయానికి గుమ్మంలోకి రాబోతున్న ఒక ఆడమనిషి పాదం మీద పడింది ఆమె వేసిన అడుగు. ఆ వచ్చిన మనిషి ముఖం చూడకుండానే "క్షమించండి" అంటూ చల్లగా బయటికి జారుకోబోయింది. కాని, ఆ వచ్చినావిడ మట్టుకు తన భారీచేతులు రెండింటినీ అడ్డంగా చాచి, కర్ణకఠోరమయిన కంఠంతో:

"ఇవ్వాళ్టికి పట్టుబడ్డావా నా చిట్టి తల్లీ! నేననుకున్నట్లే అయింది... కట్టుకున్న మొగుడు, పెట్టుకున్న సొమ్ములూ ఉన్నవన్నీ చాలక పరాయి మొగాడికోసం... ఓ నిర్భాగ్యురాలికి అన్యాయం చేసి..."

"మీరు పొరపాటుపడుతున్నారండి" మెల్లిగా గొణిగింది ఇందిర, తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూ. అమాంతంగా గుమ్మానికడ్డంగా పెట్టిందావిడ తన స్థూలకాయాన్ని-సీసా మూతికి బిరడాబిగించినట్టు. ఇక సాగించింది సాధింపు :

"ఏమిటీ?" అంది గొంతుచించుకొని. "నేనా పొరపడుతున్నది? నీ నంగతి నాకు తెలియదూ? భూషణ్ గదిలోంచి ఇప్పుడు నువ్వు రావడం నాకళ్లతో నేను చూశాను. అతడు నావాడు... నా ప్రాణం-తెలుసా? ఇప్పుడు దొరికావు నువ్వు... నంగతి తెలిసీ పోయింది. అతనీ మధ్య నన్ను నిర్లక్ష్యం చెయ్యటానికి కారణం... ఇదంతా నువ్వుచేసిందే... నువ్వేనే... దుర్మార్గురాలా..."

"మీకు పుణ్యం ఉంటుంది..." అంటూ ఆవిడ మాటలకడ్డం వచ్చింది ఇందిర. హీనస్వరంలో, "అలా అరవకండి" అంటూ రెండడుగులు వెనక్కి వేసింది. ఆ లావు పాటిఆవిడ చూపులు శూలాలకు మల్లే ఉన్నాయి. ఇందిర కళ్లల్లోకి సూటిగా తినేసేలా చూస్తోంది. ఇందిర దైన్య స్థితి, నిస్సహాయత ఆ దౌర్జన్యవాదికి మరింత ప్రోద్బలం కలుగజేశాయి. ఆవిడ ఇందిరని ఒకమాటు ఆపాదమస్తకం పరిశీలించింది. నంగతి అర్థమయిందన్నట్లు తలపంకించింది. ఒక విషపు నవ్వును విసిరిందావిడ వెడల్పాటి నోరు. గొంతుక నవరించుకుంటూ గొణుక్కుంటున్నట్లు అంది.

"కనివిన్నూనే ఉంది వాలకం... ఈ మహాసాధ్వి... పరాయి మొగుళ్ళ కోసం ప్రాకులాడే ఈ పతివ్రత... ఒంటినిండా బట్ట కట్టుకుని... ముఖంనిండా ముసుగు

కప్పుకోక ఏంచేస్తుంది! ఎవరూ గుర్తించకుండా ఉండాలి తన వేషాలు... మళ్ళీ మామూలుగా మహిళా సమాజంలో గౌరవ సభ్యురాలిగా చలామణీ కావాలి..."

"ఇంతకీ నీక్కావల్సిందేమిటి?... నువ్వెవరో నాకు తెలీదు... నేను వెళ్ళాలి" అంది ఇందిర.

"వెళ్ళాలా? నిజమేమరి... తప్పకుండా వెళ్ళాలి... నీ భర్తదగ్గరికి. అవునా? మళ్ళీ నీ ఇంటికి వెళ్ళాలి.. వేణ్ణీళ్ళ స్నానంచేసి... చక్కగా అలంకరించుకుని నీ భర్తకీ అతిధులకూ స్వాగతమియ్యాలి... అంతేగాని, నాలా ఆకలితో అలమటించి పోయే మనిషిని కన్నెత్తైనా చూడవు... పైగా నాకున్న ఒక్క ఐశ్వర్యాన్నీ అపహరించుకు పోతున్నావు..."

ఇందిర సంచీలోకి చేతిని పోనిచ్చి అందిన నోట్లన్నిటినీ పైకిలాగింది. వాటిని ఆవిడ చేతిలో కుక్కుతూ, తడి ఆరిపోయిన గొంతుతో...

"తీసుకో... ఇవిగో... నన్ను... దయచేసి వెళ్ళ...నియ్యి...ఇంకెప్పుడూ రాను... ఒట్టు..."

డబ్బు తీసుకుని మూతి విరిచిందావిడ. ఇందిర వెళ్ళటానికి దారిచ్చి, వెడుతూంటే 'పిచ్చికుక్క'! అంది.

ఇందిర ఆ మాటల్ని విన్నా, వినిపించుకోనట్టే గబగబా వీధిలోకి వచ్చేసింది. మిన్నువిరిగి మీద పడుతుందన్నంత భయంతో కన్నుమూసి తెరిచేటంతలో వీధి చివరదాకా వెళ్ళి టక్కీమని టాక్సీలో కూర్చుంది. ఆవిడ హడావిడి చూసి డ్రైవరు విస్తుబోయాడు. ఆమె బుర్ర పనిచెయ్యటం లేదు. పెదవులు గట్టిగా బిగుసుకున్నాయి. ఏం చెబుతుందోనని కాసేపు ఆగాడు డ్రైవరు. ఎంతకీ నోరు విప్పకపోయేసరికి తల వెనక్కితిప్పి అడిగాడు 'ఎక్కడికి తీసికెళ్ళమన్నారు?' అని. ఒక్కక్షణం ఇందిర అతనివైపు అయోమయంగా చూసింది. అతిప్రయత్నం మీద చివరికి "స్టేషనుదగ్గరికి" అని మాత్రం అనగలిగింది.

ఉన్నట్టుండి, ఆ పిశాచి తనవెంట పడుతుందేమోనన్న ఆలోచన మెదడులో మెరిసింది... "తొందరగా... త్వరగా... వీలైనంత త్వరగా తీసుకుపో" అంది డ్రైవరుతో. కారులో కూర్చుని కొంచెం స్తిమితపడ్డాక, జరిగిన ఘట్టాన్ని తలుచుకుంటే, ఆ అధమురాలి మాటలతో తననెంత తీవ్రంగా హింసించిందో తెలుస్తోంది. అరచేతులు చల్లబడి

వేళ్లు బిగుసుకు పోయాయి. చేతులు నిర్జీవంగా వ్రేలాడుతున్నాయి... వెన్నులో వణుకు పుట్టింది... ఒళ్లంతా జలదరించింది... గొంతు పూడిపోయినట్లుగా ఉంది... నోరు చేదుగా ఉన్నట్టుంది... నుదుటినిండా చెమట పోసింది... మనిషి నీరసించిపోయింది... ఆ భీకర దృశ్యాన్ని మరిచిపోయేందుకు గట్టిగా కేకలు పెట్టాలనీ, కణతలు పగిలేటట్టు కొట్టుకోవాలనీ అనిపించిందామెకు. కానీ అది ఆమె మెదడుకి గాలంలా పట్టుకుంది. ఆ వికృతస్వరూపం, వికారచేష్టలూ, వెకిలితనం, సాధారణంగా కొందరు నోరువిప్పితే గుప్పునవచ్చే వెల్లుల్లిపాయవాసన, ఆ వంకరమూతి, మోటుమాటలు, బెదిరించే ఆ నల్లటి మొద్దు చేతులు - వెగటుపుట్టించాయామెకు. మనస్సులో వ్యాకులం, దానికితోడు కారువేగం-నానావస్థ పడుతోంది. "కాస్త నెమ్మదిగా తీసికెళ్లు" అందామనుకుంది డ్రైవరుతో. అంతలోకే గుర్తుకొచ్చింది - తన దగ్గరున్న సొమ్మంతా ఆ పిశాచి చేతిలో పోసిన సంగతి. ఇప్పుడితనికి చెల్లించవలసినంత సొమ్మైనా ఉందా?...ఆ...ఉంటుంది. భగవంతుడి దయవల్ల... కాని స్టేషనుదాకా వెళ్లేందుకు చాలదు.

'ఆపు' అంది డ్రైవరుతో. క్షణంలో డబ్బు అతని ముందు పడేసి కారు దిగిపోయింది. ఇక ఇంటికి నడిచి వెళ్ళాలి. ఆ చుట్టుప్రక్కల తనకి తెలిసిన వాళ్లెవరూ లేరు. అయినా, ఆ దుకాణాల్లోనూ రోడ్డుమీద మనుషులూ, మాట్లాడే మాటలూ అసహ్యంవేసింది. ఏమయినా, తను ఇంటికి వెళ్ళాలి. ఆ వీధులమ్మట మెల్లిగా నడక సాగించింది. ఇందాక జరిగినదాని ఫలితంగా ఆమె మోకాళ్ళింకా వణుకుతూ కొట్టుకుంటున్నాయి, అడుగులు తడబడుతున్నాయి. అలాగే భారంగా నడిచి ఎలాగో ఇల్లు చేరుకుంది. గబగబా మెట్లెక్కబోయింది. మళ్లీ... తన కంగారుచూసి ఇంట్లోవాళ్లు అనుమానపడతారేమోనని భయపడింది.

సావిట్లో జోళ్లు విప్పుతూంటే మేడమీంచి పిల్లల కేరింతలు వినిపించాయి. చుట్టూ కలయచూసింది. అన్నీ తనవే. అవన్నీ "నీకేం వరవాలేదు" అంటున్నట్టున్నాయి. ఆ సమయంలో ఆమె కత్యవసరమయిన ఆత్మబలాన్ని అందించాయి. ముఖాన్ని చేతిరుమాలుతో తుడుచుకుంది. ముఖంలో అదుర్దా వ్యక్తపరచకుండా అమాయకంగా కనిపించటానికి ప్రయత్నించింది. భోజనాల గదిలోకి మెల్లిగా వెళ్ళింది. రాత్రిభోజనం బల్లమీద సిద్ధంగా వుంది. భర్త కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్నాడు.

"ఆలస్యంగా వచ్చావు ఇందూ... మరీ ఆలస్యమైంది" అన్నాడాయన మృదువుగానే. అంటూ కుర్చీలోంచి లేచి ఆమె తల ఆప్యాయంగా నిమిరాడు.

ఇది ఆమె మనస్సులోని పాపభీతిని. మళ్ళీ రగుల్కొల్పింది. దాన్ని అణచుకోవటం ఆమెకి కష్టమనిపించింది. ఇద్దరూ కూర్చున్నారు. పేపరు వెనకనున్న వ్యక్తి "ఇంత ఆలస్యమైందేమే?" అని మామూలుగా అడిగాడు.

"నేను... కబుర్లుచెబుతూ కూర్చుండిపోయాను... ఆ పద్మతో... బజారుకి వెళ్ళాలంది... కూడా వెళ్ళాను..."

ఛీ, గాడిదలాగ! ఏంచెప్పాలో ముందే ఆలోచించుకో వద్దూ? వెధవ తెలివి తక్కువతనం! తనమీద తనకే కోపం వచ్చింది ఇందిరకి, అంత అసందర్భమయిన అబద్ధం ఆడినందుకు. సాధారణంగా చెప్పవలసిన కథ ముందే ఊహించుకుంటూండేది. కానీ, ఈ రోజున భయంవల్ల ఆ సంగతే మరిచిపోయింది... కొంపతీసి ఇప్పుడాయన...

'ఏమిటే ఇందూ?'... ఆమెముఖాన్ని పరిశీలిస్తున్న భర్త అడిగాడు... "ఎందుకలా గాభరాపడుతున్నావ్? ఏమిటివాళ బట్టలు మార్చుకోకుండానే భోజనానికి కూర్చున్నావ్"?

తన దుస్తులకేసి చూసుకుంది ఇందిర... తెలిసిపోయింది... ఇంకేముంది... అనుకుంది. లేచి, తనగదిలోకి వెడుతూ, బట్టలు మార్చుకుంటూ అద్దంలో చూసుకుంది... ముఖం ఎంతగా పాలిపోయిందో... కళ్లలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది. తొందరగా ముఖం కడుక్కుని భోజనాలగదిలో కొచ్చి కూర్చుంది. వంటమనిషి అన్నీ వడ్డించింది. అంతా సవ్యంగానే గడిచిపోయింది. అయితే, భార్యాభర్తల మధ్య సంభాషణ మాత్రం కుంటుపడింది. రోజుకన్న ముభావంగా ఉన్నారిద్దరూ. ఇందిర ఆలోచనలు దారీతెన్నూ లేకుండా పోతున్నాయి. కాస్త తిన్నగా ఆలోచించాలని ప్రయత్నిస్తే మళ్ళీ మళ్ళీ ఆ భీకర సమస్యే ఎదుర్కొంటోంది. అటువంటప్పుడు తన ఇంట్లో నాలుగుమూలలా చిరపరిచితమయిన వస్తువులను చూస్తూ ధైర్యం తెచ్చుకుంటోంది. వాటివైపు చూస్తుంటే తన సంసారంలోని సంతోషకరమయిన విషయాలు జ్ఞాప్తికొచ్చి ఆత్మకి శాంతి లభిస్తోంది. తడబాటు లేకుండా గంటలుకొట్టే గడియారంకూడా ఆమెకు గుండెనిబ్బరం కలుగజేస్తోంది.

మర్నాడు ప్రొద్దున్న, భర్త ఆఫీసుకి వెళ్ళిపోయాక పిల్లలిద్దరూ బడికి వెళ్ళాక ఇందిరకి ప్రశాంతంగా ఆలోచించుకునేందుకు కాస్త తీరిక దొరికింది. జరిగిన ఘట్టంలోని

ప్రతిఅంశాన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంది. భయం చాలావరకు తగ్గింది. తను కట్టుకున్న చీర అంత పలుచనిది కాదు. మునుగులోంచి తన ముఖాన్ని ఆ 'మనిషి' గుర్తించగల గటం అసాధ్యం. అంచేత అంత పరవాలేదు. ఇంక ముందేమీ అపాయం రాకుండా జాగ్రత్త పడొచ్చు. ఇక ముందెప్పుడూ తన ప్రియుణ్ణి అతని ఇంట్లో కలుసుకోకూడదని నిశ్చయించుకుంది. అలా అయితే ఇంకెప్పుడూ నిన్నటికిమల్లే జరగటానికి వీలుండదు... అయితే ఆ మనిషి తన కూడా వచ్చి తన ఉనికి తెలుసు కుందనుకోటానికీ వీల్లేదు. తను కారులో వచ్చిందికదా... అంచేత ఏమీ భయపడాల్సిన ఆగత్యం లేదు. ఒకవేళ కనుక్కున్నప్పటికీ ఆ అపాయాన్ని తప్పించుకునేందుకు ఇతర మార్గాలుండనే ఉంటాయి. ఇప్పుడంత తొందరపడి గాభరాపడవలసిన అవసరం లేదుకనుక తను చెయ్యాల్సిన దేమిటో సావధానంగా యోచించుకోవచ్చు. అయినా ఆలోచించేందుకేముంది! అది చెప్పిందంతా వట్టి అబద్ధమని నిలువుగా బుకాయిస్తేసరి... అంతగా పరిస్థితి విషమిస్తే ఆ మనిషి దొంగ, మోసకత్తె అని చెబితేసరి.

ఇందిర భర్త మంచి తెలివైన లాయరు. ఆయనతో కాపురం చేస్తూ ఇందిర కూడా కొద్దోగొప్పో న్యాయశాస్త్రం నేర్చుకుంది. ఆయన ఇదివరకు పార్టీలతో చాలాసార్లు మాట్లాడుతుండగా విన్నదాన్ని బట్టి ఇందిరకి తెలిసిన విషయం ఏమిటంటే, బెదిరించి డబ్బు గుంజుకునే లంచగొండి వ్యాపారం ఏకారణంవల్లనైనప్పటికీ దోషంక్రిందే జమవుతుందనీ, దానికి తీవ్రమైన శిక్ష కూడా ఉందనీ.

మొట్టమొదట తను చెయ్యాల్సిన పని ఇకముందు కొన్నాళ్లదాకా కలుసు కోవటానికి వీలుండదని తన స్నేహితుడికో ఉత్తరం రాయాలి వీలైనంత క్లుప్తంగా. కాంతిభూషణ్ అటువంట్టి అలగాజనంతో ప్రేమ వ్యవహారాలు నడిపేరకం అని తెలియగానే ఆమె అభిమానం దెబ్బతింది. ఆమె ఇప్పుడతనికి రాస్తున్న ఉత్తరంలో సున్నిత హృదయాన్ని గాయపరిచే ధోరణిలో, ఉద్దేశపూర్వకంగానే తనకసలు అతనిమీద ఏమీ ప్రత్యేకమయిన మోజా లేదనీ, ఏదో మనశ్శాంచల్యంవల్ల తమ స్నేహం కుదిరిందనీ రాసింది. అయితే, అది నిజం కూడా.

ఆనాడు సాయంకాలం విందుల్లో కలుసుకుంది ఒక కళాకారుని... అంతే... అనుకోకుండానే అతని ప్రేయసి అయిపోయింది. ఆమెను ఆకర్షించగలిగిన ప్రత్యేక

లక్షణాలు కూడా అతనిలో ఏమీ లేవు. ఇద్దరి ఆశయాలూ ఆదర్శాలూ కూడా అనుగుణమైనవి కావు. మోహాతిరేకంవల్ల అతనికి వశమైపోయిందనీ కాదు... కానీ, అతని అభిలాషని కాదనగల ఆత్మస్థైర్యం ఆమెలో లోపించటంవల్లనే. పైగా, యువకుల ప్రేమతత్వాన్ని తెలుసుకోవాలనే కుతూహలం ఆమెలో ఎక్కడో దాగి ఉంది. ఆమె వివాహం కూడా సుఖప్రదమయినదే. ఆమె ఆధ్యాత్మిక, నైతిక, శారీరక వాంఛల్ని తీర్చేందుకు ఒక ప్రియుడి అవసరంలేదు. భర్త ఆమెకు అన్నివిధాలా సంతృప్తి కలుగజేశాడు. దానికితోడు ముచ్చటైన పిల్లలిద్దరున్నారు. జీవితం లక్షణంగా హాయిగా గడిచిపోతోంది. ఒక్కొక్కప్పుడు సాఫీగా సాగిపోయే జీవనం కూడా దుర్భరంగా ఉంటుంది. మనిషికి నీరసంవల్ల కూడా అంతేబాధ. ఒడుదుడుకులు లేని తన నిత్యజీవితంలో నూతనత్వంకోసం తపించింది ఇందిర.

అటువంటి సమయంలో, ఆ యువకళాకారుడు ఆమె సహజసౌందర్యాన్ని ఆమె కళ్లముందు చిత్రించి చూపేసరికి ఆమెలో ఉద్రేకం జనించి, ఉత్సాహం రేకెత్తింది అనునిత్యం తన భర్త తనపై చూపే ఆదరణ, గౌరవం వేరు. ఈ యువకుడు చూపే అనురక్తి వేరు. యౌవనారంభదశలో కూడా తను ఇంత ఉత్సాహాన్ని పొందలేదెప్పుడూ అతని వ్యక్తిత్వంలో ఆమెకు విశిష్టంగా గోచరించిన దొక్కటే- విషాదం! స్వతహాగా ఆమెకు కళలో అంతప్రవేశం లేకపోయినప్పటికీ ఆ కళాకారుని కృషిలో కొంత ఆసక్తి చూపకుండా ఉండలేకపోయింది. ఆమె ప్రశంసావాక్యాల్లోని ఉద్రేకం అతనిలో ఉత్సాహాన్ని ఉదయింపజేసింది. నలుగురిలోనూ అతను తలెత్తి ఆమె కళ్లల్లోకి ప్రత్యేకంగా చూశాడు. ఆ ప్రథమవీక్షణమే ఇందిర హృదయాన్ని గాలంలాగున పట్టుకుంది. కంగారుపడింది... ఆ భయంలోనే పులకించింది. అర్థంలేని పదాలు వారి మధ్య దొర్లాయి... అయినా వాటి అంతరార్థం వారికి తెలియకపోలేదు. ఆమె ఆసక్తి ఎంతవరకు హెచ్చిందంటే... అతని పునర్దర్శనంకోసం ఎదురు తెన్నులు చూసింది. ఆ తరువాత వాళ్లిద్దరూ తరచు కలుసుకునేవారు - అప్రయత్నంగా మాత్రం కాదు. కొన్నాళ్లు పోయాక, ఓసారి అతను తన నూతన స్వయంకృషిని ప్రత్యేకంగా చూపించడానికి ఆమెను ఆహ్వానించేసరికి, మన్నితంగా మీటిన తీగెలా ఆమెహృదయం స్పందించింది. అంతటి కళాకారుని కృషిని సందర్శించే భాగ్యం లభ్యమయినందు కామె పరమానందాన్ని పొందింది. అతని గదికి వెళ్లటానికి అంగీకరించింది. ఇరుపక్షాలవారూ సదుద్దేశంతోనే ఉన్నప్పటికీ ఆ సమాగమం మాత్రం వారిని శారీరకంగా

సన్నిహితుల్ని చేసింది. స్పృహవచ్చాక ఇందిర ఆశ్చర్యపోయింది, అనాలోచిత, ఆకస్మిక పరిణామానికి. పవిత్ర వైవాహిక సూత్రాలను అతిక్రమించాలని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. తప్పుచేసినట్లు తెలుసుకుంది... అయినా, తన చుట్టూ గూడు కట్టుకున్న పరువు ప్రతిష్ఠల నధిగమించగలిగినందుకు గర్వించిందికూడా. ఆమెలో పాపభీతి ప్రవేశించింది, అయినప్పటికీ తన సాహస కృత్యానికి సంతోషించింది. అయితే, ఈ వింత ఉత్సాహమయినా కొంతసేపే. స్వతహాగా ఆమెకు అతని సహజ తత్వం విరుద్ధంగా తోచింది - అదే అతనిలోని ఆకర్షణకు ఆధారమయినప్పటికీ. అతని కళాఖండాల్లో ఉద్రేకం ఉట్టిపడుతూ ఉంటుంది. అతని ప్రణయజీవితంలోకూడా ఆవేశానికి లోటులేదు. ఈ ఉద్వేగ ప్రవర్తనకి ఆమె ఆందోళన పడింది. అప్రయత్నంగానే అతని హద్దులేని ఆవేశాన్ని తన భర్త చేష్టల్లోని సాత్వికతతో పోల్చుకుంది. తన భర్త అన్నేళ్ళు కాపురంచేసినా, ఇప్పటికీ మొహమాట పడతాడు.

ఏదెలా ఉన్నా, ఒకసారి అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న వ్యక్తిని మోసం చేశాక, ఇక తరవాత తన స్నేహితుని సరసాలకు వశం కావటం క్రమంగా సులభమయి పోయింది. ఈ సమాగమాలు ఆమె సౌఖ్యాన్ని అధికం చెయ్యనూలేదు, అసహ్యం కలగజెయ్యనూలేదు. అంతకన్న అధికంగా ఆమె కోరిందేమీ లేదు. ప్రియుడిపట్ల తనకున్న బాధ్యతను నిర్వర్తిస్తున్నదంతే. ఆమెలో ప్రవేశించిన వ్యభిచారవాంఛ క్రమంగా అలవాటుగా పరిణమించింది. ఓనెల రోజుల సాన్నిహిత్యంతో ఆమె ప్రియుడు ఆమె నిత్య జీవిత కార్యక్రమంలో కలిసిపోయాడు. ఏదో వారానికోసారి బంధువులింటి కెళ్ళినట్లో, స్నేహితులను కలుసుకున్నట్లో ఉందామెకు. ఈ నూతన ప్రణయంకోసం ఆమె సక్రమమయిన తన నిత్యజీవితంలో దేన్నీ వదులుకోలేదు. మామూలు కార్యక్రమానికి మరో అంశం కలిసిందంతే. ఇద్దరు పిల్లలున్నవాళ్లకి మరో పిల్లాడు పుట్టినట్లో, లేకపోతే ఓ కారు కొనుక్కున్నట్లో ఉన్నదంతే భూషణ్‌తో స్నేహం. కొన్నాళ్లకి ఈ అనుభవంవల్ల మామూలు దాంపత్యజీవితంలో కలిగే ఆనందాన్ని మించినదేమీ పొందలేదు.

ప్రథమంగా ప్రమాదం సూచించగానే, ఈ సంబంధంలోని స్వల్పమయిన విలువను ఇందిర గుర్తించగలిగింది. చిన్నప్పటినుంచీ ఇందిరని గారాబంగా, ముద్దుగా పెంచి పాడుచేశారు తల్లిదండ్రులు. ఒక్కర్తే పిల్లకదా అని కోరినవన్నీ కలుగజేసేవారు.

గారాబంగా పెరగటం మూలాన్ని సున్నితంగా తయారైంది. ఏమాత్రం కష్టంకలిగినా ఆమె మనస్సు చెల్లాచెదరైపోతుంది. ప్రియుడి కోసమని తన సౌఖ్యాన్ని ఎంతమాత్రం త్యాగం చెయ్యాలనిపించలేదామెకి.

ఆ మధ్యాహ్నమే భూషణ్ దగ్గరనుంచి జవాబు వచ్చింది. ఆవేశంతో ఆక్రోశిస్తూ రాసిన ప్రణయలేఖ అది. ఆమె మనస్సు మళ్ళీ కొట్టుకుంది. ఈ రాయబారాలను అంతటితో ముగించగలదనే నమ్మకం పోయింది. అతడు స్పష్టంగా వ్యక్తం చేసిన మోహం, విరహవ్యథ ఆమెను సమ్మోహపరిచాయి. ఒక్కసారైనా ఆఖరుసారిగా తన్ను కలుసుకోవలసిందనీ, తనకు తెలియకుండా తనేమైనా ఆమెకు కష్టం కలిగించి ఉన్నట్లయితే, తన-తప్పు తెలుసుకునేందుకు అవకాశం కలిగించవలసిందనీ భూషణ్ బ్రతిమాలాడు. ఇందిరకి మళ్ళీ సరదా పుట్టింది. తన భావాలను అతనికి తెలియనీయకుండా అతన్నిలా ఏడిపిస్తే అతని దృష్టిలో తను మరింత అపురూపంగా అవుతాననుకుంది. ఆ అభిప్రాయాన్ని మనస్సులో పెట్టుకుని ఫలానా హోటలులో కలుసుకోమని భూషణ్‌కి రాసింది. వివాహమై అన్ని సంవత్సరాలైనా, ఆమెలో యౌవనోద్రేకం ఉప్పొంగిపోయింది. "ప్రణయం మళ్ళీ నా జీవితంలో ప్రవేశిస్తే ఎంత తమాషాగా ఉంది!" అని మురిసిపోయింది. ఇందిర ఖులాసాగా ఉంది. ఆ 'ఆడమనిషి'కి విఘ్నం కలిగించ గలిగింది. ఎన్నోయుగాల అనంతరం ఆమెలో అంత గాఢమైన ఉద్రేకం కలిగింది. ఆమె నరాల్లో ఉష్ణరక్తం ప్రసరించింది... తలంటి పోసుకున్నట్లుందామెకు.

ఈ సమావేశానికి దుస్తుల విషయంలో ప్రత్యేకంగా జాగ్రత్తవహించింది. ముదురు రంగు చీర కట్టుకుంది. జడమానేసి సిగ చుట్టుకుంది. ఈ మార్పు మూలాన్ని ఆ మనిషి తన్ను గుర్తించకుండా ఉంటుందని... ఒకవేళ దారిలో ఎదురైతే, నెత్తిమీద ముసుగువేసుకోబోయి మళ్ళీ ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది. ఎందుకు వేసుకోవాలి? పరువు ప్రతిష్ఠలున్న గృహిణి బాహాటంగా వీధిలోకి వెళ్ళేందుకే వీల్లేదా? నిజానికి ఆమె అంతరంగంలో భయం లేనేలేదు.

అయినప్పటికీ, సురక్షితమయిన స్వగృహాన్ని విడిచి బయటికి వచ్చేసరికి భయం పట్టుకుంది. స్నానం చేసేముందు చన్నీళ్ళలో వేలుపెట్టి చూసి గజగజలాడినట్లు వణికిపోయిందామె. ఆ అనుభూతి అనంతరం మళ్ళీ ఆనందం... ఈ సాహసం

సంతోషప్రదంగా ఉందామెకు. నడక సాఫీగా ఉంది, దర్జాగా ఉంది. ఇందిర విచారం ఒకందుకే- ఆ చిన్న హోటలు తన ఇంటికి సమీపంలోనే ఉందని. తాపీగా హంసనడకలు నడుస్తూ వెళ్లేదేకాని, ఆలస్యంచేస్తే సమయం మించిపోతుంది... నిర్ణయించిన గడువు సమీపించినప్పుడే తన ప్రియుడు తనకోసం వేచి ఉంటాడని ఆమెకు తెలుసును. అనుకున్నట్లుగానే అతను ఓ మూలగా కుర్చీలో కూర్చుని ద్వారంకేసి ఆతురతగా చూస్తున్నాడు. ఆమెను గుమ్మంలో చూసీచూడగానే ఒక్కఉదుటున లేచి నిలబడ్డాడు. అతని ఆవేశం ఇందిరకి ఆనందదాయకమూ, పరమ అసహ్యమూ కూడా. ఉద్రేకపూరితమైన అతని వాక్ప్రవాహాన్ని అరికట్టాలని గొంతు కాస్త తగ్గించుకోమంది. తను ఎందువల్ల అతన్నికముందు కలుసుకో దలచుకోలేదో... అసలు కారణం చెప్పకుండా... ఇదీ... అదీ అంటూ డొంకతిరుగుడుగా చెప్పటంవల్ల అతని ఆసక్తిని మరింత అధికం చెయ్యగలిగిందంతే. అంత అకస్మాత్తుగా, అకారణంగా తెగతెంపులు చేసుకోటంవల్ల అతని వాంఛల్ని మరింత ఉత్తేజపరచటం జరిగిందని ఆమె గ్రహించి అతని కోరికలపట్ల కాఠిన్యం వహించింది. అరగంటసేపు అతనితో తీవ్రంగా వాదించి, అతని లాలనకు అవగింజంత అవకాశం ఇవ్వకుండా, మళ్లీకలుసుకునే విషయమై ప్రస్తావించకుండా అతన్ని వదిలిపెట్టి వచ్చేసింది. ఓ వినూత్న ఉత్సాహంతో ఇంటికి బయలుదేరింది. ఆమెలో రగులుతున్న నిప్పురవ్వను ఏమాత్రం ఊదినా అగ్నిజ్వాలలు రేగేటట్లున్నది ఆమె పరిస్థితి. ఇంటికి వెళ్లేదారిలో తనవైపు ప్రసరించిన చూపులను భద్రంగా దాచుకుంది హృదయంలో: అదివరకెప్పుడూ పురుషుల ప్రశంసలు అంతగా చవిచూడలేదామె. నడుస్తూ నడుస్తూ దారిలో పువ్వుల దుకాణంలో ఉన్న నిలువుటద్దంవైపు తిరిగి ఒక్కక్షణం తన ముఖబింబాన్ని చూసుకుంది. రంగు రంగుల పువ్వుల మధ్య తన ప్రతిబింబం సౌందర్య శోభితమై ఉండటం గమనించి సంతృప్తి చెందింది. చమ్మచక్కల రోజులు గడిచాక ఆమె ఎప్పుడూ ఇంత చలాకీగా, హాయిగా లేదు. పెళ్లయిన కొత్తరోజుల్లోనూ లేదు. తన ప్రియుడి బాహుబంధనలో కూడా లేదు. సంభ్రమంతో, సంతోషంతో ఆమె శరీరం చలించింది. ఈ మధురానుభూతిని వ్యర్థం చేసుకుని మళ్ళీ తన మామూలు సంసారం గొడవలో పడిపోవటం దుర్భరం అనిపించింది. అప్పటికే బాగా అలిసిపోయి ఉండటం మూలాన్ని త్వరత్వరగా నడిచి ఇంటికి చేరుకుంది. వీధి గుమ్మంముందు ఓ క్షణం సేపు నిశ్చలంగా నిల్చుని తను చేసిన సాహసకృత్యాన్ని తలపుకి తెచ్చుకుని దీర్ఘంగా

నిట్టూర్చింది.

వెనకనుంచి చీరకొంగు లాగినట్లయి, ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది ఇందిర.

"ఏమిటీ?... ఏంకావాలి? ఇలా చంపుకు తింటున్నావెందుకు?" అహంకారంతో అడిగేసింది. ఆ వికృతాకారాన్ని చూడగానే ఒళ్ళు జలదరించింది. తీరా అడిగేసిన వెంటనే నాలిక కొరుక్కుంది. చేసిన తప్పును దిద్దుకోవటానికి కూడా వీల్లేకుండా తన్నుతాను బయట పెట్టుకుంది. ఈసారి కనిపిస్తే ఏమీ ఎరగనట్లు ప్రవర్తించాలని ఇంతకుముందేగా తను నిశ్చయించుకున్నది! ఇకిప్పుడు లాభం లేదు. తను పూర్తిగా బయటపడిపోయింది. ఇక ఆ మనిషి ఇష్టం వచ్చినట్లు చెలరేగుతుంది.

"గంటసేపటినుంచి నీకోసం కాచుకుని కూర్చున్నాను... ఇందిరా..."

అయితే దానికీ తన పేరూ ఊరూ తెలిసి పోయాయన్నమాట! ఎలా తెలిసింది? ఇంకేముంది, అంతా చెయ్యిజారిపోయింది.

"అవును ఇందిరా, సరిగ్గా గంటవుతుంది," రెట్టించిందామనిషి కఠోరమయిన కంఠంతో.

"ఏమిటీ నీక్కావల్సింది?"

"నీకు తెలునుగా ఇందిరా! నాకెంతబాగా తెలునునో, నీకూ అంత స్పష్టంగా తెలునును నేనెందుకొచ్చానో..."

"అప్పటినుంచీ నేనతన్ని చూడందే... నీకు చెప్పానుగా... అతన్ని కలునుకోవటానికి వెళ్లటంలేదు నేను... ఎప్పుడూ..."

"నాదగ్గర అబద్ధాలాడి లాభంలేదు... ఆ హోటలుకి నీకూడా నేనూ వచ్చాను. చూశావు... నాకీమధ్య పనీపాటా లేదు. వ్యాపారం చెడింది. ఏదో కాస్త ఈమాత్రం తీరిక ఉండటంకూడా మంచిదేలే... షికారుకీ దానికీ పోవచ్చును గొప్పదానిలాగ!" ఆ మనిషి వెటకారం మాటలు బాణాల్లాగ గుచ్చుకున్నాయి ఇందిర హృదయానికి. ఆ మనిషిలోని కాఠిన్యం, మోటుతనం ఇందిరని సులభంగా లొంగదీశాయి. మళ్ళీ ఏదో అవ్యక్తమైన భయం ఆమెను ఆవహించింది. ఒకవేళ ఇది కనక అరిచిందంటే లోపల నౌకర్లందరికీ వినిపిస్తుందేమో? తన భర్త అటువైపు కనక వస్తే? కంగారుగా చేతిసంచీ లోంచి పర్సుతీసి అందులో గలగల్లాడుతున్న చిల్లరంతా ఆ మనిషి

చేతిలో గుమ్మరించింది. చిల్లర పెట్టుకుని గుప్పిట మూసేబదులు అరిచెయ్యి తెరిచే ఉంచింది దుష్టపక్షి రెక్కలాగ.

"ఆ పర్సుకూడా నాకిచ్చేద్దూ... చిల్లరంతా ఎక్కడన్నా జారిపోతుంది..." అంది నోరంతా తెరిచి వెకిలినవ్వు నవ్వుతూ.

తన్ను పీడిస్తున్న ఆ పిశాచివైపు ఇందిర తీక్షణంగా చూసింది. అసహ్యంతో ఛీదరించుకుంది. గతాన్ని వీలైనంత త్వరలో విస్మరించాలి. దాని వెక్కిరింపు చూపుల్ని తప్పించుకోవాలని ముఖం పక్కకి తిప్పుకుని, తన పర్సుని భయంకరంగా విస్తరించుకున్న దాని అరచేతిలో పారేసి, ఒక్క ఉదుటున లోపలికిపోయి తలుపు గడియ పెట్టుకుని మేడమీదికి పరుగెత్తింది.

మూర్తి ఇంకా యింటికి రాలేదు. ఆమెకు విశ్రాంతి తీసుకునేందుకు అవకాశం లభించింది. పక్కమీద వాలిపోయింది. మొదలు నరికేసిన చెట్టులా అచేతనంగా పడిఉంది. అయినా సావిట్లోంచి భర్త గొంతు నూటిగా వినిపించింది. వెంటనే లేచి యంత్రంలా నడిచి వెళ్ళింది - వంటింటివైపు. ఆమెలోని ఉత్సాహమంతా నశించింది.

దమయంతి రాకపోకలు తరచు జరుగుతున్నాయి. ఏరోజు కారోజు ఇందిరను పట్టుకుని వెంటాడుతోంది. జరిగిన ప్రతిసంఘటననీ తలుచుకుంటోంది ఇందిర తీరిక దొరికినప్పుడల్లా. తన ఊరూ పేరూ ఆ వివరాలన్నీ ఆమెకెలా తెలిశాయి? ఒకటి మాత్రం నిశ్చయం- దాని ప్రథమ ప్రయత్నమే సులభంగా ఫలించటంవల్ల దానికి మరింత ప్రోద్బలం కలిగింది. ఒకరోజా, రెండురోజులా - ఏళ్లతరబడి యీ దోపిడీ బాధను తను భరించవలసిందేనా? ఆమెకు దారీతెన్నూ తోచలేదు. భర్త ఎంత సంపాదనపరుడైతేమాత్రం, తనకి పుట్టింటివారిచ్చిన సొమ్ము ఉంటేమాత్రం, ఎన్నాళ్లు తీర్చగలదు దాని అంతులేని ధనదాహం? తన భర్తను అప్పుడిగా చేసుకుంటే తప్పు? తన భర్తకొచ్చే కేమంలేకం తెలుసు తనకు. ఇటువంటి దొంగల్ని వాళ్లడిగినంత ఇచ్చినప్పటికీ నమ్మడానికి వీల్లేదు. ఎప్పటికప్పుడు వాళ్లు బెదిరించి డబ్బు లాగుతూనే ఉంటారు. మహా అయితే, ఓ నెల్లాళ్లపాటు ఊరుకుంటారేమో; అంతే... మళ్ళీ మామూలు వ్యవహారం సాగిస్తారు. ఒకవేళ ఆ శకునపక్షుల్ని ఎదిరించాలని చూస్తే, అవమానం, తలవంపులూ తప్పవు. అటువంటి దొంగల్ని సంతృప్తిపరచటం ఎంత దుర్లభమో, వాళ్లనెదిరించినందువల్ల వచ్చే ఫలితాన్ని అనుభవించటం అంతకు

మూడింతలు దుర్భరం.

ఏం జరుగుతుందో? ఈ ప్రశ్నతో ఇందిర రోజురోజంతా సతమతమైంది. ఏనాడో ఒకనాడు తనభర్తకి ఉత్తరం వస్తుందనీ, అది చదువుకున్నాక ఆయన కనుబొమ్మలు ముడిపడి ముఖం పాలిపోతుందనీ... ఆ తరువాత తన చెయ్యి పట్టి లాగి నిలదీసి అడుగుతారనీ... ఊ... ఆ తరవాత? ఇంకా ఏంచేస్తారు? ఆమె అంతకన్న ఎక్కువగా ఊహించలేకపోయింది. ఆమెకేం తెలియదు. ఆమె ఊహలన్నీ నీటిబుడగలకు మల్లే క్షణంలో విచ్ఛిన్నమవుతున్నాయి. ఆలోచించి ఆలోచించి ఆఖరుకి అనుకుంది తన భర్త స్వభావం గురించి తనకున్న జ్ఞానం ఎంత స్వల్పమో... పరిస్థితులాయనమీద ఎట్టి ప్రభవాన్ని కలిగించగలవో తను ఊహించలేకపోతున్నది. ఆమెకు తల్లిదండ్రులే సంబంధం కుదిర్చారు. ఆమె కాదనలేదు. ఎనిమిదేళ్ల సంసారం చేశాక ఇప్పుడు జరిగిన దానికి విచారించవలసిన ఆగత్యం కనిపించలేదామెకు. ఇన్నాళ్లూ ఎట్టి ఒడుదుడుకులూ లేకుండా హాయిగా గడిచింది. ఇల్లూ వాకిలీ, ఇద్దరు పిల్లలూ అన్నివిధాలా అనుకూల దాంపత్యం... ఇంతాచేసి చివరికి కొన్ని సందర్భాల్లో తన భర్త ఏవిధంగా ప్రవర్తించేదీ తను గ్రహించుకోలేక, పరాజయాన్ని పొందినట్లు భావించింది. ప్రప్రథమంగా, ఆమె తన భర్త ప్రవర్తన, ఆయన స్వభావంలోని ముఖ్య లక్షణాలనూ పరిశీలించసాగింది. ఆయన స్వభావాన్ని గ్రహించేందుకు తమ సంసారంలో సంభవించిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకుంది. లోతుకి పోయినకొద్దీ భయం ఎక్కువవుతోంది...

ఆయన పేపరు చదువుతూ కూర్చున్నాడు. విద్యుద్దీపం వెలుగులో ఆయన ముఖం ప్రకాశిస్తున్నది. ఎవరో అపరిచిత వ్యక్తిని చూస్తున్నట్లు తోచిందామెకు. విశాలంగా వొత్తుగా వున్న ఆయన కనుబొమ్మలు ఆయన మనశ్శక్తిని సూచిస్తున్నాయి... నోరు మరీ బిగువుగా ఉన్నట్టుండి గాంభీర్యాన్నీ అధికారాన్నీ ప్రదర్శిస్తోంది. ఆ పురుషలక్షణాల్లోనూ, ఆ కండలు తిరిగిన అవయవాల్లోనూ అందాన్ని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. ఆయన కళ్లల్లోకి చూడాలనుకున్నది కాని, అవి క్రిందనున్న పుస్తకాన్ని చూస్తున్నాయి. మిగిలిన అవయవాలకన్న ఆయన కళ్లల్లోనే ఎక్కువ కనిపించి ఉండేదనుకుంది. అవి ఆయన నిజస్వభావాన్ని మరుగుపరిచి ఉంటాయి. ఆయన రూపాన్ని విస్మయంతో తదేకంగా చూసింది. తను చేసిన పొరపాటుకి తన్ను

క్షమిస్తారా?... శిక్షిస్తారా?... ఆయన అపరిచితుడు... ఆ నిండువిగ్రహం ఆమెను కలత పెట్టింది... అయినా అందమయిన మూర్తి... ఇన్నేళ్ళకి ఈనాడు గుర్తించగలిగినందుకు సంతోషంగా గర్వించింది... హఠాత్తుగా ఆయన తల పైకెత్తాడు... ఇందిర తల వంచు కుంది - తన వెర్రిచూపు తన్ను బయటపెట్టకుండా.

మూడు రోజులపాటు గుమ్మం కదల్లేదు. ఆమె ప్రవర్తనలోని మార్పును గుర్తించి నౌకర్లు విస్తుబోయారు... పిల్లలు కూడా... ముఖ్యంగా పెద్దది వెంటనే గుర్తించింది, తల్లి ఈ మధ్య అదోలాఉండటం... ఏమిటలా ఉన్నావని అడిగేసిందికూడా. వంట మనిషి అడిగినవాళ్లతోనూ అడగనివాళ్లతోనూ కూడా తనకు తోచినట్లు చెబుతోంది. విశేషమేమీ లేదు, అంతా మామూలుగానే ఉందన్నట్లు సహజంగానూ, సంతోషంగానూ ఉండటానికి ఇందిర శాయశక్తులా ప్రయత్నిస్తోంది. గృహకృత్యాల్లో మనస్సు లగ్నం చెయ్యటానికి యత్నించినా, నౌకర్లకు అంతరాయం కలిగించటం, వారి అనుమానానికి గురికావడం జరుగుతోంది. ఏదో ఓ గదిలో కూర్చుని కుట్టుకోవటమో, చదువుకోవటమో చెయ్యటానికి బదులు మనస్సులో ఆందోళనవల్ల అటూ ఇటూ తచ్చాడుతోంది. వీధి తలుపు చప్పుడైనా, టెలిఫోన్ గణగణమన్నా కంగారుపడి బెదిరిపోతోంది. ప్రశాంత మయిన ఆమె జీవనం అల్లకల్లోలమైంది. ఈ ఛండాలంనుంచి విముక్తి పొందే మార్గం తోచక, భవిష్యత్తు కంటకప్రాయంగా కనిపిస్తూందామెకు. ఈ మూడు రోజుల నిర్బంధమూ, గడచిన ఎనిమిది సంవత్సరాల వైవాహిక జీవితంకన్న భారంగా తోచింది.

ఆ మూడోనాటి సాయంకాలం ఎందుకో గుర్తుకొచ్చింది ఫలానా వాళ్ళింటికి వెళ్లాలన్న సంగతి. వెళ్లకపోతే మర్యాదగా వుండదు. మరీ మరీ చెప్పారుకూడా ఆ దంపతులు. అదీకాకుండా తను పూర్తిగా మునిగిపోకుండా ఉండాలంటే, తనచుట్టూ ఆవరిస్తున్న భయాన్ని ఛేదించేందుకు యత్నించాలి, తను మామూలుగా ఉండాలంటే మృత్యుభీతి కలిగించే ఏకాంతాన్ని వదిలి, కాస్సేపు తలుపురితో కలిసి ఖులాసాగా కాలక్షేపం చెయ్యటం అవసరం అనుకుంది. అదైనా, తన ఇంట్లోకన్న ఎవరైనా స్నేహితులిళ్లకు వెడితేనే బాగుంటుంది.

భయంతో గుండె ఝల్లుమంది వీధిగుమ్మం దాటుతూంటే, ఆ మనిషి పొంచి చూడటం లేదుకదా? భర్త చెయ్యిపట్టుకుని కళ్లు మూసుకుని ఎలాగో నాలుగడుగులు నడిచివెళ్ళి కారులో చతికిలబడింది. కారు వేగంగా పోతూంటే, ఆమెను పట్టుకున్న

భయాలను క్రమంగా వదిలించుకోగలిగింది. ఆ స్నేహితులింటికి వెళ్లగానే క్షేమంగా ఉన్నట్టూ, ఆమెకో విధమైన రక్షణ కలిగినట్టూ తోచింది. ఓ గంటసేపటివరకూ మామూలుగా ఖులాసాగా హాయిగా ఉండగలిగింది. అప్పుడే విడుదలైన ఖైదీలాగ స్వేచ్ఛతో కూడిన ఆనందాన్ని అనుభవించింది. తన్ను పీడించే వాళ్లెవరూ లేరిక్కడ. ఏ విషసర్పమూ తన్ను వెంటాడలేదు ఈ నాలుగు గోడలమధ్య. ఇక్కడున్న వాళ్లంతా తన్ను ప్రేమించి గౌరవించేవాళ్లే. అంతా అందమయిన దుస్తులు, ఆభరణాలూ ధరించిన గౌరవ కుటుంబీకులే... వాళ్లెప్పుడూ జీవితాన్ని సుఖప్రదంగా చేసుకుంటారు, సంతోషంగా ఉంటారు. ఇందిరకూడా వారి ఆనందంలో, ఆహ్లాదంలో భాగం పంచుకుంది. తన భర్త పక్కని తను కూర్చున్నప్పుడు అందరూ తనవైపే దిగ్భ్రమతో చూస్తున్నారు... తన సౌందర్యాన్ని ప్రశంసిస్తూ. ఈ భావన ఆమెలో మరింత ఉత్తేజాన్ని కలిగించింది.

రేడియోలోంచి హృదయరంజకంగా సంగీతం వినవస్తోంది... రగులుతున్న గుండెల్లో అమృతం చిలికిస్తోంది. ఆ సంగీతంలో ఆమె లీనమైపోయింది. తనకు తెలియకుండానే గానం చెయ్యటం ఆరంభించింది. పరవశత్వంతో పాడుతోంది సోఫాలో జార్లబడి కళ్లుమూసుకుని. అంతా ఆశ్చర్యంగా వింటున్నారు. ఆమె అంతకుముందెప్పుడూ అందరి ఎదుటా అంత ధైర్యంగా పాడి ఎరుగదు. ఎంతో బలవంతంమీద ఎప్పుడైనా పేరంటంలో పాడుతూ ఉంటుంది. అదైనా ఏదో మంగళ హారతి. భావగీతాన్ని బిగ్గరగా పాడటం ఇదే. పాట పూర్తికాగానే అంతా చప్పట్లుకొట్టారు. ఆమెకు హఠాత్తుగా మెలుకువొచ్చినట్లయింది. కారణం అర్థంకాక తను కూడా పకపక నవ్వుతూ చప్పట్లు కొట్టింది.

"ఏమిటిది ఇందిరా?"

అంతవరకూ ఆనందంతో ఉత్సాహంతో కాంతి భరితమయిన ఆమె కళ్లల్లో ఇప్పుడేదో భీతి!

"నాకూ తెలియదండీ..." అంది అయోమయంగా ఆయన వైపు చూస్తూ. ఆయన చూపులు వాడిగా ఉన్నాయి... తట్టుకోలేక పోయింది ఆబాధ... గట్టిగా ఏడవాలని అనిపించిందామెకు...

"నువ్వు చాలా మారిపోయావు" మెల్లిగా అన్నాడాయన కాస్సేపాగి. ఆయన

మాటల్లో ఆశ్చర్యం ధ్వనించింది. కాని, ఏభావంతో ఆ మాటలన్నారో అడిగేధైర్యం లేదామెకు. మళ్ళీ మాట్లాడకుండా ఆయన అక్కడినుంచి లేచాడు. ఆ విశాలమయిన భుజాలు, పొడుగాటి మెడ చూసి కంపించింది. "హంతకుడు" అనే భావన ఆమె మెదడులో మెదిలింది. తనమీద తనకే అధికారం లేదు... తన భర్త... ఎంత భయంకరంగా... బలిష్ఠంగా... ప్రమాదంగా...

సంగీతం వినిపిస్తూనే ఉంది... అంతా మళ్ళీ పాడమన్నారు... ఇందిర ఇంక పాడేస్థితిలో లేదు... ఆ సంగీతాన్ని విని ఆనందించే స్థితిలో కూడా లేదు... లేచింది... కాళ్లు వణుకుతున్నాయి... భర్త... అదిగో, ఆ కిటికీ దగ్గర నుంచుని తనవైపే తీక్షణంగా చూస్తున్నాడు... ఆయనకేం కావాలి? ఆయనకి తెలిసిపోయిందా? పమిట రెండవ భుజంమీంచి తీసి బాగా కప్పుకుంది తన వక్షస్థలాన్ని ఆయనచూపుల్నుంచి దాచుకునేందుకు. ఆయన మౌనాన్ని ఆమె భరించలేకపోయింది.

"వెడదామా?" ఆదుర్దాగా అడిగింది. "పద". ఆయనగొంతు కఠినంగా, అనురాగ రహితంగా ఉంది. ఆయన ముందు నడిచాడు... వెనకాలే పిల్లిలా బయలు దేరిందామె... మళ్ళీ ఆయన భీకరమయిన బాహువులు, కఠినమైన కంఠం గమనించి వణికిపోయింది. మౌనంగా కారులో కూర్చుని ఆయనతోపాటు ఇంటికి వెళ్ళింది హడలిపోతూ. అన్ని వైపులనుంచీ ప్రమాదం భయపెడుతోందామెను.

ఆ రాత్రి ఆమెకొక పీడకల వచ్చింది. విచిత్రమైన వాద్య సంగీతం వినిపిస్తోంది. విశాలమైన భవనంలో ఒక భాగం... దేదీవ్యమానంగా ప్రకాశిస్తున్న విద్యుద్దీపాలతో నిండినగది... ఆమె అటువైపు వెళ్ళింది... రకరకాలమంది... రంగురంగుల దుస్తులు... ఒక యువకుడు ఆమెను సమీపించాడు.. పరిచయమున్న ముఖంలాగానే కనిపించింది, అయినా ఆ పోలికలు పట్టలేకపోయింది... అతడామెను దగ్గరికి చేర్చుకున్నాడు... ఇద్దరూ కలిసి నాట్యం చేశారు... ఆమెకు హాయిగా ఉంది... ఆ సంగీతానికి ఆమె పాదాలు తేలిపోతున్నాయి... ఆ నున్నటి మెరిసే గచ్చుమీద ఎక్కల ఎగురుతోంది... ఇద్దరూ కలిసి నాట్యం చేస్తూనే బోలెడు గదులు దాటిపోయారు... పైనుంచి వ్రేలాడుతున్న దీపాలు ఆకాశంలో మెరిసే నక్షత్రాల్లా ఉన్నాయి... ఆమె చిరునవ్వు సొగసు వెయ్యి అద్దాల నుంచి ప్రతిబింబించటం ఆమె చూస్తోంది... నాట్యంలో క్రమక్రమంగా ఉద్వేగం హెచ్చుతోంది... సంగీతం మధురతరమవుతోంది... ఆ యువకుడామెను క్రమక్రమంగా

దగ్గరికి చేర్చుకోవటం, ఆమె నగ్న హస్తాలు స్పృశించటం ఆమెకు ఆనందదాయకంగా ఉంది. అతని కళ్లల్లో ఆమె గతాన్ని శోధించింది... అతడామెకు గుర్తుకొచ్చాడు... తను చిన్నతనంలో దూరంనుంచే ఆరాధించిన ఒక కళాకారుడు... అతని పేరుని ఉచ్చరించబోతూండగా ఆమె అధరాలను తన అధరాలతో అణచివేశాడు. వారి దేహాలు ఏకమై ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి... గోడలు ప్రవాహంలో తేలిపోతున్నాయి... వాటికి పైన కప్పువంటిదేమీ ఉన్నట్టు ఆమెకు గుర్తులేదు. కాలచక్రం ఆగిపోయినట్లుంది... ఆమె బాల్యావస్థలో ఉన్నట్లు కేరింతలు కొడుతోంది... ఆమె పాదాలు భూమిపైన ఆనటం లేదు... సరిగ్గా అప్పుడే ఎవరో వీపుమీద తట్టారు... ఆమె ఆగిపోయింది... సంగీతం ఆగిపోయింది... దీపాలు ఆరిపోయాయి... చీకటిగోడలు ఆమెను ఆవరించాయి... అందరూ అంతర్ధానమొందారు... "నావాణ్ణి నాకిచ్చెయ్యి... దొంగముండా" అంటూ అరచింది ఒక ఆడది... మంచులాంటి చేతులతో ఆమె నున్నితహస్తాలను పట్టుకుంది... ఆ మనిషితో పోరాడేందుకు ఆమె శక్తినంతా కూడగట్టుకుంటోంది... ఇద్దరూ యుద్ధం చేశారు... కాని ఆ మనిషి చాలా దృఢంగా ఉంది... ఇందిర కంఠహారాన్ని పట్టుకు లాగేసింది... ఆమె రవికను చింపేసింది... ఆమె వక్షస్థలం నగ్నంగా మిగిలిపోయింది... ఆ వెంటనే గదినిండా దీపాలు వెలిగాయి... మనుషులు అనేకమంది పోగై ఆమెను తదేకంగా చూస్తున్నారు... ఆ మనిషి గట్టిగా పొలికేకలు పెట్టింది... "ఇది దొంగముండ... పిశాచి... నా ప్రియుణ్ణి తన వశం చేసుకుంటోంది... మాయలమారి..." అంటూ. ఇందిరకి ఎక్కడ తలదాచుకోవాలో, ఎక్కడ వెతకాలో అర్థంకాలేదు... అంతా ఆమెచుట్టూ మూగుతున్నారు... ఆమె నగ్న శరీరాన్ని స్పృశించటానికి ప్రయత్నిస్తున్నారు... ఆశ్రయంకోసం ఆమె అన్నిదిక్కులా చూసింది... గుమ్మందగ్గర తలుపునీడలో తన భర్త నుంచుని ఉండటం చూసింది... ఆయన మౌనంగా స్థిరంగా ఉన్నాడు... కుడిచేతిని నడుమువెనక పెట్టుకున్నాడు... హడలిపోయి గావుకేకపెట్టి గదినుంచి గదికి పరుగుపెట్టడం ప్రారంభించింది... ఆమెను అక్కడున్న జనం వెంటతరుముతోంది... పరుగెడుతూంటే ఆమె ఒంటినున్న దుస్తులు జారి క్రింద పడిపోయాయి... ఒకటి రెండు పీలికలు మిగిలితే మానాన్ని కప్పుకునేందు కుపయోగించుకుంది... ధన్నుమని ఒక పెద్దతలుపు తెరుచుకుని ఎదురుగా కనిపించిన మెట్లు రివ్వున దిగిపోయింది. ఇక బ్రతికింది... అబ్బే... లేదు... లేదు... మెట్ల క్రింద ఆ రాక్షసి గోనెగుడ్డల్లాంటి దుస్తులు ధరించి మోటు చేతులు రెండూ చాచుకుని

నిలబడిఉంది. ఆమె ఒక ప్రక్కకి గబుక్కున గెంతి ఒక్క ఊపున పరుగులంకించుకుంది గుర్రంలా ఇందిర. ఆమె అడుగుజాడల ననుసరించే వస్తోందా మనిషికూడా... వీధులవెంట ఆ వేట సాగుతూనే వున్నది... ఆ మనిషి కిర్రుచెప్పుల చప్పుడు ఆమెకు వినిపిస్తూనే ఉంది... అడ్డదోవలంటపడి, క్రిందా మీదాపడుతూ, చివరికి ఎలాగో ఇల్లుచేరుకుంది... తీరా గుమ్మంలో అడుగుపెట్టేసరికి ఎదురుగా భర్త!... చేతిలో కత్తి... నిప్పులుచెరిగే చూపులు...

"ఎక్కడికెళ్లావ్?" ఆయన ప్రశ్నించాడు. "ఎక్కడికీ లేదు" అని తను నసగటం ఆమెకు వినిపించింది. ఆ సమాధానం విని ఆయన వికటాట్టహాసం చేశాడు. ఆ 'మనిషి' గొంతుకూడా వినిపించింది. "నేను చూశాను... నాకు తెలుసు" అంటూ మూర్తి కత్తి పైకెత్తాడు... "రక్షించండి... రక్షించండి"... అంటూ అరిచింది ఇందిర.

ఇందిర కళ్లు తెరిచింది... ఎదురుగా భర్త... ఆయోమయంగా చూస్తున్నాడు ఆమెవైపు. దీపం వెలిగించి ఉంది. తను ఇంట్లోనే ఉందన్న మాట... అయితే ఇదంతా కల... తనేదో జబ్బుమనిషి అయినట్టు తన పక్క మీద కాళ్లవైపు ఎందుకు కూర్చున్నారు? దీపం ఎవరు వెలిగించారు? ఎందుకాయన చలనం లేకుండా మౌనంగా కూర్చున్నారు? ఆమెకు భయమేసింది. ఆయన చేతివైపు చూసింది. అందులో కత్తిలేదు. మెల్లిగా ఆమె మెదడులోంచి మత్తు వదిలిపోసాగింది... కల... కలలో ఎందుకో భయపడి కేకలుపెట్టి ఉంటుందంతే... ఎందుకాయన తనవైపు అంత తీక్షణంగా చూస్తున్నారు?

ఆమె నవ్వేందుకు ప్రయత్నించింది.

"ఏమిటండీ అంత కంగారుపడిపోతారు? ఏదో పీడకల వచ్చింది... అంతే..."

"నిద్రలో బాగా కేకలు పెట్టావు... నా గదిలోకి కూడా వినిపించాయి..."

'నేనేమని కేకలుపెట్టి ఉంటాను? ఆయన కెంతవరకూ తెలిసి పోయిందో?' అని మనసులో అనుకుంది. ఆయన కళ్లల్లోకి సూటిగా చూడటానికి ఇందిరకి ధైర్యం చాల్లేదు. ఆయన మౌనంగానే కూర్చున్నాడు కొంతసేపు ఆమెవైపు తదేకంగా చూస్తూ చిరునవ్వైనా నవ్వకుండా.

"ఏమయింది ఇందిరా, ఏమిటిదంతా?... ఏదో ఉంది... నాకు బాగా తెలుసు... నాలుగైదు రోజులనుంచి నీ మనస్సు మనస్సులో లేదు... జ్వరం తగులుతోందేమో కూడా... నీలో ఉద్రేకం హెచ్చిపోయింది... స్థిరం లేదు... నిద్రలో రక్షించమని కేకలు..."

మళ్ళీ నవ్వుతూ ఆ విషయాన్ని తేలిగ్గా తేల్చిపారెయ్యాలని ప్రయత్నించింది.

"అంతా వట్టిది... నువ్వు నాదగ్గరేమీ దాచద్దు... నీ మనస్సులో ఏమయినా ఉందా?... ఏదైనా బాధకలిగించే విషయంగాని? ఇంట్లో అంతా గమనించారు. నీలో వచ్చినమార్పు... నన్ను నమ్ము ఇందూ..."

ఆయన ఆమె దగ్గరగా జరిగాడు. ఆయన హస్తం ఆమె శిరస్సును ఆప్యాయంగా నిమిరింది. ఆయన నేత్రాలు మాత్రం ఏదో విచిత్రమైన వెలుగుతో ప్రకాశిస్తున్నాయి. ఆయన విశాలవక్షాన్ని అనుకుని, మనస్సు విప్పి తన బాధలన్నీ చెప్పుకోవాలనిపించిందామెకు... ఇప్పుడే... తను బాధపడుతున్నదని ఆయన గ్రహించిన తక్షణమే...

కాని... ఆ విద్యుద్దీపం తన కాంతిని కర్కశంగా ప్రసరింపజేస్తూ ఆమె ముఖాన్ని ప్రస్ఫుటం చేసింది... అవమానంతో క్రుంగిపోయింది.

మళ్ళీ నవ్వు తెచ్చిపెట్టుకుంటూ "అబ్బే... ఏంలేదండీ" అంది. ఆమె శరీరమంతా జలదరించింది... "ఏదో వెర్రిభయం కలిగింది... అదేపోతుంది..."

ఆమెను కౌగలించటానికి సంసిద్ధమవుతున్న ఆయన హస్తాలు యథాస్థానంలో ఉండిపోయాయి. ఆయన ముఖం వివర్ణమైంది. కనుబొమ్మలు చిట్లించి... లేచి నుంచున్నాడు.

"ఎందువల్లనోగాని ఈ మధ్య నువ్వేదో బాధపడుతూన్నట్టూ, రెండు మూడు రోజులనుంచి నాకేదో చెబుదామనుకుంటున్నట్టూ తోచింది నాకు... అది నీకూ నాకూ సంబంధించిన సంగతి... కేవలం నీకు నాకూ... ఇప్పుడు మనం ఏకాంతంగా ఉన్నాం కదా... ఇందూ"...

ఆయన తీక్షణ వీక్షణానికి కట్టుబడిపోయినట్టు నిశ్చలంగా కూర్చుంది. "నన్ను క్షమించండి" ఆ రెండు చిన్నమాటలూ అనేస్తే యెంత హాయిగా ఉంటుందో! అంతా సర్దుకుపోతుంది... ఇంకేమీ ప్రశ్నించడాయన... కానీ... అదే... ఆ విద్యుద్దీపానికెంత

నిర్దయ! అంధకారంలో అయితే అంతా చెప్పుకోగల ననిపించింది... ఆ రాక్షసదీపం తన శక్తిని పీల్చేస్తోంది...

"అయితే నువ్వు చెప్పదలుచుకున్నదేమీ లేదన్నమాట... ఏమీలేదా?" మెల్లిగా, మృదువుగా అడిగాడాయన. ఆయనతో తన కష్టాలు చెప్పుకోవాలనే ఉంది... కానీ... అదే... ఆ... ఆత్మవిధ్వంసక కాంతి...

హేళనగా నవ్వుతూ "ఇంతకీ మీరనేదేమిటి?" అంది. ఆమె సాధించిన కృత్రిమ మందహాసం ఆమెకే వికృతంగా తోచింది. "ఏదో కలత నిద్రచెందినంత మాత్రాన నేనేవో రహస్యాలు దాచుకుంటున్నానంటారేమిటి? కొంపదీసి నాకో ప్రియుడున్నా డని కూడా అనుమానించటం లేదు కదా?"

అనుకోకుండా తన నోటమ్మట వచ్చిన ఈ డొంకతిరుగుడు మాటలకి తనే నిర్ఘాంతపోయింది... ముఖం పక్కకి తిప్పేసుకుంది.

"సరే... మంచిది, నిద్రపో" అన్నాడాయన ముక్తసరిగా. ఆయన కంఠంలో కాఠిన్యం తప్ప కరుణలేదు... బెదిరిస్తున్నట్లుగా ఉంది.

దీపం ఆరిపేశాడు. గుమ్మంలో ఆయన నీడను చూసింది ఇందిర... నిశ్శబ్దంగా నిష్క్రమించాడాయన. పెనుభూతంలా తలుపు మూసేశాడు... ఎవరో తన్ను శవపేటికలో బంధిస్తున్నట్లనిపించిందామెకు... ప్రపంచం గతించింది... ఆమె శరీరం చేష్టలుడిగింది- వడివడిగా కొట్టుకుంటున్న గుండె తప్ప... బాధ... బాధ... బాధ... బాధ... నాడిలో వినిపిస్తోంది.

మర్నాడు మధ్యాహ్నం భోజనానికి భర్తా, పిల్లలతో బాటు కూర్చుంది. పిల్లలిద్దరూ అప్పటివరకూ ఏదో తగువుపెట్టుకుని అప్పుడే శాంతించారు... పనిమనిషి ఒక ఉత్తరం పట్టుకొచ్చింది.

"మీ కోసమే అమ్మా... తెచ్చినవాడు వీధిలో నుంచున్నాడు" అంది లచ్చి.

ఇందిర కవరు చింపి ఉత్తరం చదువుతూంటే ఆమె ముఖం కందగడ్డలా అయిపోయింది. అందులో ఉన్న సందేశం సంగ్రహంగా ఉంది. "ఇది పట్టుకొచ్చిన వాడికి వందరూపాయలిియ్యి". దానిమీద తారీఖుగాని సంతకంగాని లేదు. దస్తూరీ వత్తివత్తి రాసినట్లు స్పష్టంగా తెలుస్తోంది.

ఇందిర గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది - డబ్బు తీసుకురావటానికి, బీరువాతాళాలెక్కడో పెట్టేసినట్టుంది. వాటికోసం, అలమార్లూ, కిటికీలూ, బల్లలూ, సొరుగులూ, అన్నీ ఆదరాబాదరాగా వెతికింది. చివరికెలాగో దొరికింది. వణికిపోతున్న చేతులతోనే కొత్త నోట్లకట్ట కవరులోపెట్టి, దాన్ని స్వయంగానే వెళ్ళి ఆ వచ్చినవాడికిచ్చేసింది. ఆ పనులన్నీ ఎక్కడా సంకోచమన్నది లేకుండా, గారడీ ప్రభావంవల్ల చేస్తున్నట్లుగా చకచకా చేసేసింది. మళ్ళీ వచ్చి భోజనముందు కూర్చోవటానికి రెండు నిముషాలు కూడా పట్టలేదు.

వచ్చి తన స్థానంలో కూర్చుంది. ఇంట్లో అందరూ దుర్భేద్యమయిన మౌనం వహించారు. ఆమెవైపు రెప్పవాల్చకుండా చూస్తున్నారు. ఆ వికార పరిస్థితిని తప్పించేందుకు ఏదైనా నవ్వొచ్చేవిషయం మాట్లాడాలనుకుంటూండగా చటుక్కున తన కంచం పక్కన తెరిచిపడివున్న ఉత్తరం కనిపించి కొయ్యబారిపోయింది. గబుక్కున చేతిలోకి తీసుకుని మెల్లిగా నలిపేసి గుప్పెట్లో పెట్టుకుంది. తల పైకెత్తి భర్తవైపు చేసింది. ఆయన ఆమెవైపు క్రోధంతో, అసహ్యంతో హింసాత్మకంగా చూస్తున్నాడు... ఆయన ముఖంలో అటువంటి వైఖరిని అంతకుముందెప్పుడూ ఆమె గమనించలేదు. బాకు గుండెల్లో పొడుచుకున్నట్లు బాధపడింది. ఆ పోటు తానెలా భరించగలదు? క్రితం రాత్రి ఆ స్నేహితులింట్లో కిటికీదగ్గర నుంచుని సరిగ్గా ఇలాగే బాకుచూపు... రాత్రి కలలో ఆయన పట్టుకున్న బాకులాంటి చూపు చూశాడు...

ప్రసక్తి మార్చాలని వ్యర్థప్రయత్నం చేసింది. ఎప్పటిదో ఓ సంగతి గుర్తుకొచ్చిందామెకు.

ఆయనే చెప్పాడొకసారి. ఒక కేసులో ముద్దాయితరఫున వాదిస్తున్నాడు. అక్కడున్న న్యాయాధికారి సాధారణంగా పెడసరంగా జవాబులు చెప్పే సాక్షుల విషయంలో ఒక ప్రత్యేక పద్ధతిని అవలంబిస్తాడు. దూరంగా వున్న వస్తువులపైన చూపు ఆనదన్నట్లుగా తన ముందున్న బల్లమీద కాగితాల్లోకి తలదూర్చి, అసలుప్రశ్న వెయ్యవలసిన క్షణంలో హఠాత్తుగా కళ్ళుపైకెత్తి నేరస్థుని కళ్లల్లోకి సూటిగా బాకుచూపు చూస్తాడు. దాంతో ఆ నేరస్థుడు కంగారు పడిపోతాడు. అతడు అంతవరకూ తక్కగా అల్లిపెట్టుకున్న అబద్ధాలన్నీ చల్లాచెదురైపోతాయి. ఇప్పుడదే సూత్రాన్ని తన భర్తకూడా తనపైన ప్రయోగించటం లేదుకదా!

ఆయన ఉద్యోగనిర్వహణలో మనస్తత్వాన్ని అసాధారణమయిన శ్రద్ధతో పరిశీలిస్తాడు- నేరాన్ని పరిశోధించటం, అందుకు తోడ్పడిన పరిస్థితులను పరిశీలించటం- నేరస్థుని పరీక్షించటం కోసం ఆయన జూదరులకన్న తెలివిగా పాచికలు వేస్తాడు. ఈ జాగిలంవేటలో ఉన్నప్పుడు ఆయన శరీరం యావత్తూ అగ్నిగుండంలా తేజోవంతమవుతుంది. ఆ సమయాన మానసికోద్రేకంవల్ల ఆయనకు నిద్రాహారాలపైన ధ్యాసపోతుంది. అంతవరకు పరిష్కారం కాని ప్రజలసమస్యలేవో అప్పుడప్పుడాయన్ని నిద్రనుంచి హఠాత్తుగా మేల్కొల్పుతాయి. విచారణకు ముందు విధీవిరామం లేకుండా పొగతాగుతాడు. తన వాక్శక్తిని మున్ముందు న్యాయస్థానంలో వినియోగించుకోవటాని కన్నట్టు మితంగా మాట్లాడతాడు. ఒకసారి నేరవిచారణ వినాలని ఆమె న్యాయస్థానానికి వెళ్ళింది. ఆరోజున ఆయన ఫిర్యాది తరపున వాదిస్తున్నాడు. ఆయన ఆవేశపూరిత పైశాచిక వాగ్ధోరణికీ, ఆయన కన్నులలో క్రౌర్యకాంతికీ ఆమె భయగ్రస్థురాలయి పోయింది. తిరిగీ న్యాయస్థానానికి ఆమెని తీసుకుపోవడం సాధ్యంకాని పని.

ఈ సంగతులన్నీ ఆమెకి ఒక్కక్షణంలో గుర్తుకొచ్చాయి. దాంతో, చెప్పదలుచుకున్న మాటలు జ్ఞాపకాల అడుగున అణగారిపోయాయి. మౌనంగా కూర్చుంది. మౌనం మరీ ప్రమాదకరమని గ్రహించి కంగారు పడిపోయింది. అదృష్ట వశాత్తూ భోజనాలు పూర్తిఅయాయి. పిల్లలు కంచాల్లోనే చేతులు కడుక్కుని కేక లేసుకుంటూ వీధిలోకి పరుగెత్తారు. మూర్తి కూడా లేచి తలవంచుకొని తనగదిలోకి వెళ్ళిపోయాడు.

ఆమె ఒంటరిగా మిగిలింది. గుప్పిట్లో పెట్టుకున్న కాగితం ఉండని విప్పి తిరిగి చదువుకుంది. "ఇది పట్టుకొచ్చినవాడికి వందరూపాయలిస్తా". ఉక్రోషం వచ్చేసింది. గట్టిగా నలిపి నేలమీద విసిరేసింది. ఏదో తట్టింది. దాన్ని తిరిగి తీసుకొని వంటింట్లో పొయ్యిదగ్గరికెళ్ళి మంటలో పడేసింది. అది నిముషంలో నుసి అయిపోయింది. ప్రస్తుతానికి పీడ వదిలిందికదా అని ఒక నిట్టూర్పు విడిచి అక్కణ్నించి కదిలింది తనగదికి పోవటానికి. ఆమె ఉద్దేశం నిష్ప్రయోజనమైంది... గుమ్మంలో ఎదురుగా భర్త! అసలే నిప్పువేడికి ఆమె ముఖం కందిపోయింది... ఇప్పుడు పట్టుబడేసరికి ముఖం మాడిపోయింది. చేసిన పని దాచడానికి కూడా వీల్లేకుండా కాయితం కాలినవాసన ఇంకా వేస్తూనే ఉంది. మూర్తి సిగరెట్టు నోట్లోపెట్టుకొని

అగ్గిపుల్ల వెలిగించాడు. ఆ స్వల్పకాంతిలో ఆయన నాసికాపుటాలు కంపించటం స్పష్టంగా చూసింది ఇందిర. అంటే, ఆయన చాలా కోపంగా ఉన్నాడని అర్థం చేసుకుంది. ఏమయినా, చూపులు మాత్రం సౌమ్యంగానే ఉన్నాయి.

"నేను మళ్ళీ వచ్చిందెందుకంటే, నీ సొంత ఉత్తరాలు నాచేతికివ్వనవసరం లేదు... కావాలంటే నాకు తెలియనీయకుండా నీరహస్యాలు నీదగ్గరే దాచుకోవచ్చు... ఇది చెప్పిపోదామనే" అన్నాడాయన.

ఇందిర నోరు మెదపలేదు. తలపైకెత్తే ధైర్యం లేదు. పీల్చిన సిగరెట్టు పొగ విసురుగా వదిలేసి మెల్లిగా అవతలికి వెళ్ళిపోయాడు.

ఇందిర ఇంకేమీ ఆలోచించదలుచుకోలేదు. కాస్సేపైనా ప్రశాంతంగా ఉండాలనుకుంది. ఇంట్లో ఈపనీ ఆపనీ చెయ్యటం మొదలుపెట్టింది. కానీ ఇల్లూ వాకిలీ దుర్భరంగా తోచింది. ఎక్కడికన్నా బయటికి పోవాలనీ, స్నేహితులతో కాలక్షేపం చెయ్యాలనీ అనిపిస్తోంది. లేకపోతే ఈ భయంతో పిచ్చెత్తిపోతుందని ఆమెకు తెలుసు. తను చెల్లించిన వందరూపాయలతోనూ దానినోరు కొద్దిరోజులదాకా మూసుకుంటుంది. కాస్త అలా షికారువెళ్లొస్తే ఇంట్లోవాళ్లకి అనుమానం కలక్కుండా ఉంటుంది... ఈ మధ్య తన అవకతవక ప్రవర్తన వాళ్లకి అర్థంకాక సతమతమవుతున్నారని ఆమె స్పష్టంగా గుర్తించింది. ఇల్లు విడిచి వీధిలోకి రావటం చాలా విచిత్రంగా జరిగింది. వీధి అరుగుమీద నుంచునట్టే నుంచుని చటుక్కున కళ్లు మూసి తెరిచేటంతలో మెట్లుదిగి జనసమూహంలో కలిసిపోయింది. మధ్య మధ్య కాళ్లలో రాళ్లు గుచ్చుకున్నప్పుడు మాత్రం కాస్త నర్దుకుని తిరిగి త్వరత్వరగా నడక సాగిస్తోంది-హడావిడిగా పనిమీద పోతున్నట్టు. ఈ రోజున ఆమె తలవంచుకొని నడుస్తోంది ఆ భయంకరమయిన చూపులెక్కడ కలుస్తాయోనని. ఒకవేళ ఆమెను వెన్నంటుతున్నా, ఆ విషయాన్ని తెలుసుకోవటం ఆమెకిష్టం లేదు. అయినా ఆ భావం ఆమెను వెంటాడుతూనే ఉంది. ఎవరైనా కాస్త ఢీకొంటే చాలు కొయ్యబారిపోతోంది. ప్రతిచిన్న శబ్దం దుర్భరంగా ఉంది. వెనకనుంచి వినిపించే అడుగుల చప్పుడు బాధాకరంగా ఉంది. నేలమీద పడుతున్న ప్రతినీడా దుష్టశకునంలా తోస్తోంది. ఏ స్నేహితులింట్లోనో, ఏకారులోనో తప్ప ఆమెకింకెక్కడా క్షేమంగా ఉన్నట్టు లేదు.

"నమస్కారం" అన్నాడొకాయన నవ్వుతూ. తలెత్తిచూశాక ఆమె గుండె

కుదుటబడింది. ఆ ముసలాయన చాలా మంచివాడే. తమ కుటుంబానికి చిరపరిచితుడు. సాధారణంగా ఆయన్ని తప్పించుకు తిరుగుతుంది ఇందిర... మరేం లేదు.. ఆయన ఏదైనా విషయంమీద మాట్లాడటం ప్రారంభిస్తే ఓపట్టున వదలడు. ఈ సమయంలో ఆయన కబుర్లు వింటానికి ఇందిర ఇష్టపడేదేగాని, దురదృష్టవశాత్తూ ఆయన పలుకరించి వెళ్ళిపోతూంటే పరాకుగా చూస్తూ ఊరుకుంది. తీరావెళ్ళిన వెంటనే అనుకుంది ఆయన వెంట వెడితే, ఆ మొనకత్తె ఎదురైనా దాని ఆటలు సాగకుండా ఉండేవని. ఆయన్ని పిలుద్దామని వెనక్కి తిరగబోతూంటే, దూరంనుంచి ఒకవ్యక్తి ఆమె వైపుకే వడివడిగా నడిచింది. ఆమనిషి తన వెనకాలే వస్తున్నట్టు గ్రహించింది. ఆమె భుజంమీద ఆ మనిషి చెయ్యిపడుతుందేమోనని వణికి పోతోంది. వెనకనుంచి అడుగులు దగ్గరపడుతున్నాయి... ఎలా తప్పించుకోవడం? ఆమె కాళ్లు తడబడుతున్నాయి... నడక సాగటం లేదు... ఇంక ఆమెకూ, ఆ మనిషికీ మధ్యదూరం అట్టేలేదు. అదుగో, ఆగొంతు ధైర్యంగా సరళంగా పిలిచింది : "ఇందిరా!" అరె! ఇది తన్ను భయపెట్టే కంఠం కాదు. ఆమె హఠాత్తుగా వెనక్కి తిరగటంతో భూషణ్ ఇంచుమించు ఆమెను ఢీకొనబోయాడు. ఉద్రేకంతో అతని ముఖం తెల్లబడింది. ఆమె తీక్షణంగా చూసేసరికి సిగ్గుతో ఎర్రబడిపోయింది. ఆమె భుజంమీద చనువుగా చెయ్యి వెయ్యబోయాడు. కాని ఆమె రెండడుగులు వెనక్కివేసి తప్పించుకుంది. అతని చెయ్యి అలాగే జారిపోయింది క్రిందికి. ఇన్నాళ్లూ భయసంపర్కంవల్ల ఆమె ప్రియుని గురించి ఆలోచించనేలేదు. ఇప్పుడు అకస్మాత్తుగా అతని వాలిపోయిన ముఖాన్నీ, సందేహాస్పదమయిన చూపుల్నీ చూసేసరికి పట్టలేనంత కోపం పొంగుకొచ్చింది. క్రోధంతో ఆమె అధరాలు కంపించిపోతున్నాయి. నోటమ్మట ఒక్కముక్క రాలేకపోయింది. ఆమెలో కలిగిన తీవ్రమైన ఉద్రేకం ఆమె ముఖంమీద ప్రస్ఫుటంగా తాండవిస్తూ అతన్ని తికమక పెడుతోంది.

"ఇందిరా, ఏమిటలా ఉన్నావ్?" తడబడుతూ అడిగాడు. ఆమె చిరాకు వ్యక్తపరిచింది. అతను మరింత వినయంగా అడిగాడు:

"నేనేమన్నా తప్పుచేశానా, ఇందూ?"

అణచుకోలేనంత కోపంతో చూసిందతనివైపు.

"ఏమన్నా చేశావా!" వెక్కిరిస్తూ అరిచింది... "అబ్బే... ల్ధు... ల్దు... నువ్వేం

చేస్తావు పాపం... చక్కటి పనులు తప్ప."

భూషణ్ ఆశ్చర్యంతో నోరుతెరుచుకొని నిలబడ్డాడు.

"కాని... ఇందూ... ఇందూ..."

"అట్టే గొడవచెయ్యకు... నడిరోడ్డు..." అందామె అధికారయుత కంఠస్వరంతో. "నీ నటనలన్నీ కట్టిపెట్టు... ఇప్పుడు మన సంభాషణంతా చాటుగా నిలబడి నీ ప్రేయసి విన్నదంటే, మనం ఇక్కణ్ణుంచి కదిలాక నా ప్రాణాల వెంట పడుతుంది మళ్ళీ..."

"ఎవరి గురించి నువ్వు మాట్లాడుతున్నది?"

ఆ వెధవ మొద్దుమొహం మీద పేడనీళ్ళు చల్లాలనిపించిందామెకి. ఆ చుంచు ముఖాన్ని చూస్తుంటే పరమనహ్యం వేసింది.

"ఇందూ... నామాట..." అంటూ గొణిగాడు మరింత అయోమయ స్థితిలోపడి. "నేనేం చేశానని? హఠాత్తుగా నన్ను కలుసుకోవడం మానేశావు... రాత్రీపగలూ నీకోసం కాచుకొని కూర్చుంటున్నాను... ఇవాళ ప్రొద్దుటినుంచి మీ ఇంటికవతల కాచుక్కూర్చున్నాను... ఒక రెండు నిముషాలైనా నీతో..."

"కాచుక్కూర్చున్నావా? నువ్వూనా?"

కోపంతో ఆమెకు యుక్తాయుక్తాలు తోచటం లేదు. అతని ముఖంమీద ఒక్క చెంపపెట్టు పెడితేగాని ఆమె వెర్రికోపం చల్లారదు. కాని అలాగే బిగపెట్టుకొని తన కోపాన్నంతా చూపుల్లోనే వ్యక్తపరుస్తూ తన మనస్సులోనిదంతా చెప్పాలా వద్దా అని ఆలోచిస్తోంది. ఏమనుకుందో, గబుక్కున వెనక్కి తిరిగి ఇటూ అటూ చూడకుండా ఒక్కక్షణంలో బాటసారుల్లో కలిసిపోయింది. భూషణ్ అలాగే చేతులు చాచుకుని నిలబడ్డాడు ఏం చెయ్యాలో తోచక... కొంతసేపటికి తనకు తెలియకుండానే జనప్రవాహంలో కొట్టుకుపోయాడు.

ప్రశాంతతకోసం పరితపించిపోతున్న ఇందిర మనస్సు మళ్ళీ కలవరపడింది. మర్నాడు డబ్బుకోసం మరో అధికారపత్రం హాజరైంది. ఆమె భయం తిరిగి తలెత్తింది. ఈసారి రెండువందల రూపాయలు... అభ్యంతరం చెప్తుండగానే ఇచ్చేసింది. అంత క్షణక్షణం అధికమవుతున్న ఈ ధనదాహాన్ని ఎంతవరకని తీర్చగలదామె తన సొంత

సామ్మెంత ఉంటేమాత్రం, ఈ వరసని ఎవరికీ తెలియకుండా ఎన్నాళ్లు సాగుతుంది? రేపొద్దున్నేవచ్చి నాలుగువందలనవచ్చు. ఇలా వెయ్యి రూపాయలదాకా వెడితే ఇక తనేం చెయ్యగలదు? ఇంకప్పటినుంచి సంతకం లేని ఉత్తరాలు వస్తుంటాయి. ఆపైన రానున్న ప్రళయం రాకమానదు. ఆమెకిప్పుడు కావల్సినది కాస్త వ్యవధి... ఊపిరి పీల్చుకునేందుక్కూడా వీల్లేకుండా ఉంది... భయం... బాధ... చదువుకోలేక పోతోంది... కుట్టుపని చేసుకోలేక పోతోంది. ఒక్కొక్కసారి ఒంట్లో సరిగ్గా లేనట్లుండేది... నిల్చోలేక... కూర్చోలేక... నానాబాధపడేది... అన్నిటికన్నా ముఖ్యం... ఈ చిరాకంతటికీ సాయం, నిద్రపట్టక పోవటం... ఇదంతా ఇలా ఉండగా ఆమె సంతోషంగా ఉన్నట్లూ, ఆ సంతోషం సహజంగా ఉండేట్లు ప్రవర్తించాలి. అటువంటి పరిస్థితిలో మనిషి మామూలుగా ఉండాలంటే ఎంత కష్టం!

ఇందిర హృదయంలో చెలరేగుతున్న పెనుప్రళయాన్ని గుర్తించినది ఆ ఇంట్లో ఒక్క వ్యక్తే... ఆమెను నిత్యం పరిశీలిస్తూండటంవల్ల ఆ రహస్యాన్ని ఆయన గ్రహించ గలిగాడు. ఈ సత్యాన్ని ఆమె గుర్తించి తన ప్రవర్తనలో మరింత జాగ్రత్త వహిస్తూ, భర్తని ఓకంట కనిపెడుతూనే ఉంది. రాత్రీపగలూ క్షణం విరామంలేకుండా ఒకరినొకరు కనిపెడుతూనే ఉన్నారు. ఈ సమరం ఆరంభమయినాక మూర్తి చాలా మారిపోయాడు. మొదట్లో తను చూపిన అసక్తిని అణుచుకొని సౌమ్యంగా ప్రవర్తించటం ప్రారంభించాడు. తన పెళ్లయిన కొత్తరోజుల్లోలాగ ఆమెను అబలగా భావించి, ఆమె తన హృదయదౌర్బల్యాన్ని పోగొట్టుకొని నైర్మల్యాన్ని పొందే అవకాశాలను కల్పిస్తున్నాడు. ఆమె తన భర్త చూపే సానుభూతిని అర్థం చేసుకోలేకపోలేదు. సిగ్గు, అవమానం మూలాన్ని తన కష్టాలను పైకి చెప్పుకునేందుకామె మనస్సు అంగీకరించటం లేదు.

ఒకసారి మూర్తి ఆమెతో స్పష్టంగానే చెప్పాడు. ఆమె సాయంకాలం గుడికివెళ్ళి తిరిగి వచ్చేసరికి ఇంట్లోంచి కేకలూ, బొబ్బలూ వినవస్తున్నాయి. భర్త గంభీరమయిన కంఠంతో బలంగా అరుస్తున్నాడు. వంటమనిషి కీచురాయిలా కేకలు పెడుతోంది. పిల్లలు ఎక్కెక్కి ఏడుస్తున్నారు. ఇందిర గాభరాపడిపోయింది. తనకోసం ఏదైనా ఉత్తరం వచ్చిందేమో, దానిమీద రభస జరుగుతోందేమోనని హడలిపోయింది... వెంటనే పరుగునని మేడమీదికి వెళ్ళిపోయింది.

ఇంతాచేసి పిల్లలిద్దరూ కత్తిగుత్తిరం గురించి పోట్లాడుకొని అంత రభస చేశారు.

సుజాత అత్తయ్య మొన్న వచ్చినప్పుడు తెచ్చిందిట. అసలు దాన్ని బాబికిచ్చిందిట చిన్నకుర్రాడు కదాఅని. అంత మంచి గుర్రాన్ని తమ్ముడికిచ్చేశారని రాధకి ఉడుకు మొత్తనం వచ్చింది. దానికితోడు బాబి ఒక్కసారి కూడా గుర్రాన్ని ముట్టుకోనివ్వలేదు. దాంతో ఇక కోపం పట్టలేక రాధ ఆ కర్ర గుర్రాన్ని పగలగొట్టేసి ముక్కల్ని ఎవరికీ తెలియకుండా వంటింట్లో అలమారులో దాచేసింది. ఎన్నివిధాల అడిగినా తను తప్పుచేసినట్లు ఒప్పుకోలేదు. చివరికి వంటమనిషి తగువు తీర్చమని యజమానిని పిలిచింది.

విచారణ జరగటానికి సిద్ధంగా ఉంది ఇందిర వెళ్లేసరికి. రాధ తనేం చెయ్యలేదంటుంది. పనిమనిషి సాక్షినంటుంది. బాబి ఫిర్యాది. అంతాకలిసి దండెత్తే సరికి రాధ ఆఖరికి వాదించలేక ఏడుపు లంకించుకుంది.

ఇందిర దృష్టిని భర్తవైపు కేంద్రీకరించింది. ఆయన విచారణ చేస్తున్నది కూతుర్ని కాదు తననే ననిపించింది. రేప్పొద్దున తనుకూడా ఆ పసిపిల్లలకుమల్లే వణికిపోతూ ముద్దాయిగా ఆయన ఎదుట నిలవాలేమో? రాధ అబద్ధం చెబుతూన్నంతసేపూ ఆయన కాఠిన్యం వహించి, నిష్కర్షగా మాట్లాడాడు. తప్పుచేసినట్టు ఒప్పుకున్న వెంటనే ఆయన మెత్తబడ్డాడు. ఎంతో సరళమయిన మాటల్లో ఆ చిన్నపిల్లకి నచ్చజెప్పారు-అది చేసినపని ఎంత చెడ్డదో. తమ్ముడు ఆడుకునే అందమయిన ఆటవస్తువుని పాడుచెయ్యటం ఎంత క్రూరమో. రాధకి అర్థంకాగానే దుఃఖం పొంగిపోయింది... ఇక ఉన్నదున్నట్లు చెప్పేసింది.

ఇందిర తన కూతుర్ని వెనకేసుకురావటానికి వెళ్ళింది. కాని, తల్లిని పక్కకి తోసేసింది రాధ. మూర్తి కూడా ఆమెను వారించాడు అసందర్భంగా సానుభూతిని ప్రకటించవద్దని: ముద్దాయిని శిక్షించకుండా వదిలిపెట్టాలని కాదు ఆయన ఉద్దేశం. "సర్కసు చూట్టానికి బాబి నొక్కణ్నే పంపిస్తాను... నువ్వింట్లో ఉండిపోరాధా" అన్నాడాయన. అది రాధకి చెంపపెట్టు. తనకు విధించిన శిక్ష విని యేడుపు ముఖం పెట్టింది రాధ. బాబి ఆనందంతో, విజయోత్సాహంతో గెంతులువేశాడు... అదైనా కొంతసేపే... వెంటనే తండ్రి వాణ్ణి పిలిచి "ఒకళ్లు ఏడుస్తూంటే చూసి సంతోషించటం మంచి లక్షణం కాదు" అన్నాడు. వాడికి నీతినేర్పాలని వాణ్ణికూడా వెళ్ళొద్దన్నాడు. పిల్లలిద్దర్నీ విచారంగా ఒకరిమొహాలొకరు చూసుకుంటున్నారు... ఇప్పుడు

ఒకరిపై ఒకరికి జాలి.

భార్యాభర్తలిద్దరూ ఏకాంతంగా ఉన్నారు. ఇందిరకో ఆలోచన తట్టింది. ఎప్పటికైనా తన కష్టాలను భర్తతో చెప్పుకోగలిగితే అందుకు తగిన తరుణం ఇదే. తన కూతురి ప్రవర్తన ఆధారంగా చేసుకొని విషయాన్ని కదపొచ్చు. చిన్న పిల్లలను క్షమించమని ముందు అడిగి, తన సలహాను ఆయన దయతో పాటిస్తే తన గొడవలు చెప్పుకోవచ్చునో లేదో అప్పుడు తెలుస్తుంది.

"ఏమండీ, మీరు మనస్పూర్తిగానే వాళ్లని వెళ్లొద్దన్నారా? పాపం వాళ్లకేం తోచటంలేదు. ముఖ్యంగా రాధకి. ఇంతకీ అదేమంత పెద్దతప్పు చెయ్యందని, దాన్నెందుకంత కఠినంగా శిక్షిస్తారు? మీరు మరీ క్రూరంగా ప్రవర్తిస్తున్నారేమో? దానిగురించి మీరు బాధపడటం లేదూ?"

ఆమెకేసి నిశ్చలంగా చూస్తూ, "దానికోసం బాధా? నిజమే, బాధగానే ఉంది. కాని దానికిప్పుడెవరి సానుభూతీ అవసరంలేదు. సర్కసుకి వెళ్లనివ్వటంలేదని బాధపడొచ్చును గాని, శిక్షపడిన తర్వాత మాత్రం దాని హృదయం తేలిక పడిఉంటుంది. నిన్న రోజంతా దాని గురించి జాలిపడవలసిన మాట. ఇంట్లో అందరం ఆ కర్రగుర్రపు ముక్కలకోసం వెతుకుతున్నాం ఆ పాడుపని చేసిందెవరో అనుకుంటూ. అంతసేపూ అది భయపడుతూనే ఉంది-ఏమవుతుందోనని. ఆఖరికి అంతా బయటపడక మానదని దానికి తెలుసు. శిక్షకన్న భయం మరింత దుర్భరం. శిక్ష అయితే ప్రత్యక్షంగా తెలుస్తుంది. అదుర్దాను మించిన బాధ లేదు. మన చంటిదాన్ని చూడు, దానికాశిక్ష విధించిన తక్షణం దానికేదో బరువుదించినట్లయింది. చంటిపిల్లల కన్నీళ్లకు మోసపోకు. మొదటనుంచీ అవి లోపల ఉండనే ఉంటాయి. భయంవల్ల బయటికి రాకుండా బాధపెడతాయి. ఇప్పుడుచూడు! అది హృదయవారా ఏడవగలదు. ఇంక దాచుకునేందుకేమీ లేదు. అవుకున్న కొద్దీ దుఃఖం బాధిస్తుంది.

ఆయన మాట్లాడుతున్నది భార్యవిషయమా? కూతురు విషయమా? ఆయన కళ్లల్లోకి చూసింది ఇందిర ఆయన ఉద్దేశాన్ని గ్రహించాలని. అదేమీ గమనించనట్లు ఆయన సంభాషణ సాగించాడు.

"నామాటనమ్ము... పరిస్థితి చివరికి అవిధంగానే పరిణమిస్తుంది. న్యాయవాదిగా నాకున్న అనుభవాన్ని బట్టి నేను తెలుసుకున్న విషయం చెబుతున్నాను. విచారణకు

సిద్ధమైన ఖైదీ మనస్సులో ఏదైనా దాచుకున్నంతసేపూ తడబాటుపడతాడు. బయటపడిపోతాననే భయం, ఆడిన అబద్ధాన్ని నిలబెట్టుకోవలసిన అవసరం అతన్ని పీడిస్తున్నప్పుడు ఎంత దిట్టమయిన నేరస్తుడైనాసరే అధైర్యపడక మానడు. పరంపరగా ఎదుర్కొంటున్న ప్రశ్నలకు సమాధానాలిస్తూ చివరికి నేరాన్ని ఒప్పుకోవలసి వచ్చినప్పుడు వాళ్ల నోట్లోని పళ్లనెవరో బలవంతంగా పీకినట్లు గిలగిలలాడిపోయిన వాళ్లని చూశాను. ఒక్కొక్కప్పుడు చెప్పవలసిన మాటలు గొంతుక్కి అడ్డుపడతాయి. ఆ అవకాశం చూసి ఆంతరంగిక దుష్టశక్తి - అందులో పట్టుదల కొంత, భయం కొంత కలిసి ఆ మాటల్ని వెనక్కిలాగుతాయి. వైరుధ్యం పునఃప్రారంభమవుతుంది. ఆ సమరం కొనసాగుతున్నంతసేపూ సాధారణంగా నేరస్థునికన్న న్యాయాధికారి ఎక్కువ బాధపడతాడు. అయినా, నేరస్థుడు అతన్నొక శత్రువులా చూస్తాడు - నిజానికి తనకు శాయశక్తులా సాయం చెయ్యటానికే ప్రయత్నిస్తున్నప్పటికీ.

ఇక నా విషయం అంటావా, సాధారణంగా నేను నేరస్థులతరఫున వాదించవలసి వస్తుంది. అందుచేత వాళ్లాడిన అబద్ధాలను ఆఖరి వరకూ నిలబెట్టుకోమనే వాళ్లను ప్రోత్సహించవలసి ఉంటుంది. అయితే నేను మాత్రం తు చ తప్పకుండా నా కర్తవ్యాన్ని నెరవేర్చలేను. శిక్షవిధించిన తర్వాత, దాచుకునే రహస్యాలింక లేనప్పుడే వాళ్ల బాధ అంతమొందుతుందని నాకు తెలుసు.

తప్పు ఒప్పుకోవటానికి ధైర్యం లేనివాళ్లు అపాయకరమనుకునే అపరాధాలనెలా చెయ్యగలుగుతారో నాకిప్పటికీ అర్థంకాదు. ఒక్కమాట చాలు - తమ దోషాన్ని ఒప్పుకుంటూ... భయమంతా పోతుంది. వారి పరిస్థితి వాళ్లు చేసిన దోషంకన్న ఎక్కువ జాలిగొల్పుతుంది..."

"ఏమండీ, ఇది మీ అభిప్రాయమేనా? ఈ దావరికానికి మూల కారణం భయమేనని? ఏం, అవమానం ఎందుకు కాకూడదు? నలుగురిలోనూ విపులంగా చెప్పటానికి నలుగురి కళ్లకూ తన పాపాన్ని నగ్నంగా..."

ఆయన ఆశ్చర్యంతో అయోమయంగా చూశాడు. అంతతీవ్రంగా ఆయనతో వాదించటం ఇంతకుముందెప్పుడూ ఆమెకలవాటులేదు. ఆమె ఎంచిన పదం ఆయన్ని సమ్మోహపరిచింది.

"అవమానమా?... అది మరో రకమయిన భయం... అంతే... కాని అంతకన్న

గొప్పదని ఒప్పుకొంటాను. ఎంచేతనంటే ఆ భయానికి కారణం శిక్ష ఎటువంటిది పడుతుందోననే ఆదుర్దా కాదు... కాని... అది... అవునవును... నాకర్థమయింది.

ఆయన లేచి నిల్చున్నాడు... ఏదో అసాధారణమైన ఉద్రేకంతో ఇటూ అటూ అర్థంలేకుండా పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. ఆయన మనస్సుని ఏదో బాగా పట్టుకుంది. హఠాత్తుగా ఆమెఎదుట ఆగి, ఉద్రేకం లేకుండా ఉత్సాహంగా మాట్లాడాడు.

"ఒప్పుకున్నాను! తప్పు వొప్పుకోవటానికి అవమానం అడ్డొస్తుందని ఒప్పుకున్నాను. అది అపరిచితుల ఎదుట అయితే కావచ్చు... కాస్త ఉంటే గంపంతచేసి అపరాధిని రచ్చకెక్కించే పామరులఎదుట కావచ్చు... కాని... తన్ను ప్రేమించే వ్యక్తి ఎదుటే తన నేరాన్ని ఒప్పుకోవటంలో సిగ్గుపడవలసిన అగత్యం నాకు కనిపించడం లేదు".

"అయితే ఒకవేళ..." అంటూ ఇందిర మాట్లాడుతూ తలదించుకుంది. ఆయన కళ్లల్లోని కాంతిని భరించలేక. తనగొంతు వణుకుతోందని ఆమె గ్రహించింది.

"ఒకవేళ... తన్ను ప్రేమించేవాళ్ల ఎదుట చెప్పకోవటానికే మరింత సిగ్గుగా ఉంటుందేమో".

ఆయన మంత్రముగ్ధుడిలా నిశ్చలంగా నిలబడ్డాడు. "ఇంతకీ నువ్వు... అయితే నీ ఉద్దేశం..." ఆయన మాటలకోసం తడుముకుంటూ, కంఠస్వరం తగ్గించి, ఎంతో అనునయంగా.

"నీ ఉద్దేశం, రాధకి తన తప్పును పనిమినిషిముందరే ఒప్పుకోవటం సులభమన్నమాట"

"అవుననే నా నమ్మకం. అదంత మొండిగా పెడసరంగా ఉండటానికి కారణం మీ ఒక్కరి అభిప్రాయంమీదా విలువ ఉండటంవల్లనే... మిగిలిన వాళ్లకన్న మిమ్మల్నే ఎక్కువగా ప్రేమిస్తూండటంవల్లనే... పైగా".

ఇందిర తడబడింది. భర్త పచార్లు చెయ్యడంమాని ఆమె ముందు నిల్చాడు. "బహుశః నువ్వు చెప్పింది నిజమే కావచ్చు... నిజమనే నమ్ముతున్నాను.., ఆ విధంగా నేనెప్పుడూ ఆలోచించకపోవడం ఆశ్చర్యకరమైన విషయమే. నువ్వన్నది నిజమేకానీ, నేను అపరాధిని క్షమించలేనని మాత్రం నువ్వనుకోవద్దు. సమయం

వచ్చినప్పుడు కూడా నేను ఔదార్యం చూపలేనని నువ్వనుకుంటే నేను భరించలేను ఇందిరా."

ఆయన చూపులికి ఆమె ముఖం కందిపోయింది. ఆయన మాటవరసకి అన్నాడా లేక ఆయన ఉద్దేశం... ఇందిర నిశ్చలంగా నిల్చుంది.

"కేసు కొట్టేశాను..." అన్నాడాయన సంతోషంగా "రాధని విడిచి పెట్టేశాను... దాన్నిప్పుడే పిలిచి చెబుతాను ఈ శుభవార్త... నీకిష్టమేనా ఇందూ?... ఇంకా ఏమయినా కోరికలున్నాయా? నేను సంతోషంగా ఉన్నప్పుడే ఆ సదవకాశాన్ని వినియోగించుకో... అన్యాయానికి పాల్పడకుండా నన్ను కాపాడినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. ఎవరికైనా బరువుదించినట్టుగా ఉంటుంది ఇందిరా... ఎంతో తేలిగ్గా ఉంటుంది... ఎప్పుడైతే..."

ఆయన ఏమని సూచించదలుచుకున్నాడో ఆమె గ్రహించింది. అనాలోచితంగా ఆయన దగ్గరికి చేరింది. ఆయన చెప్పబోయిన మాట ఆమె పెదవులపైన వణికింది. ఆయన కూడా ఆమె చేరువకు చేరాడు ఆమెను క్రుంగతీస్తున్న బరువు దింపటాని కన్నట్లుగా. ఆయన కన్నుల్లోకి చూసింది... అందులో ఏదో తీవ్రమైన వాంఛ ఆమెను... అంతే... ఆమె గుండెలు దిగజారిపోయాయి... చేతులు నీరసంగా వేలాడుతున్నాయి... అటువైపుకి తిరిగి పోయింది... "అసాధ్యం" అనుకుంది. "నాకు సాధ్యంకాదు... తప్పుచేశానని చెప్పటం నావల్లకాదు... నా ఆత్మకి శాంతిచేకూర్చే పదాలను ఉచ్చరించటానికి నా అధరాలు అంగీకరించటం లేదు." ఆమె లోలోపల వాంఛిస్తూనే ఉంది ఈ పీడవ్యవహారాన్ని వీలైనంత త్వరలో ముగించాలని.

ఆమె ఆశించినదానికన్న ముందుగానే ఆమెకోరిక ఈడేరే సూచన కనిపిస్తోంది. పదిహేనురోజులపాటు ఆ గొడవ జరుగుతూనే ఉంది... ఈ నిర్బంధం సమాప్తి చెందే సమయం ఆసన్నమైందని ఆమెకు తోచింది. 'ఆ మనిషి' కనిపించి నాలుగురోజులైంది. ఇప్పుడు భయం ఆమె నరనరాల్లోనూ వ్యాపించింది. చిన్న చప్పుడైనా ఉలిక్కిపడి పోతోంది. ఆ మోసకత్తె దగ్గరనుంచి ఎప్పుడు కబురు వస్తుందోనని క్షణక్షణం బెదురుతోంది. ఆ రాకకోసం పరితపించిపోతోంది కూడా... పైకం చెల్లించి ఒక్కపూటైనా శాంతి సంపాదించవచ్చునని ఆమె ఉద్దేశం.

మళ్ళీ తలుపుతట్టిన శబ్దం ఇల్లంతా వ్యాపించింది. ఇందిర స్వయంగా

తలుపు తీయడానికి మేడమెట్లు గబగబా దిగింది. తలుపు తెరవగానే ఎవరో అపరిచిత స్త్రీ ఆమె ఎదుట నిల్చింది. అందమయిన వస్త్రువులు ధరించి రకరకాల ఆభరణాలతో అలంకరించుకుంది... కాదు... కాదు... అపరిచిత కాదు... ఆ అలంకారాల వెనక దాగిన వికృతాకారం ఇందిరకు సుపరిచితమే.

"నువ్వు ఇంట్లోనే ఉన్నందుకు చాలా సంతోషం... నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి"- అంటూ ఎటువంటి సందేహాలకూ అవకాశం ఇవ్వకుండానే లోపలకి తోసుకొని చరచరావెళ్ళి చేతిలో ఉన్న పువ్వుల గొడుగుని గదిలో మూలపెట్టింది.

ఆ ఇల్లు తనదేనన్నంత స్వతంత్రంగా, స్వేచ్ఛగా అంతపెద్ద భవనంలోకి ప్రవేశించగలిగినందుకు లోలోపల ఆనందిస్తూ, అడక్కుండానే పక్కనే ఉన్న అతిథుల గదిలోకి వెడుతూ "ఇక్కడేకదూ..." అంది ఇందిరవైపు హేళనగా చూస్తూ.

ఇందిర భయంతో మూగబోయింది. ఈ పిలవని పేరంటాన్ని ఇంకా విజృంభించకుండా చేసేదేగాని, ఆ మనిషి చేతులూపుతూ, ఓదారుస్తున్నట్టుగా.

"అబ్బే... ఎంతసేపు... వచ్చినపని చిన్నదే... నీకు ఇబ్బందిగా ఉంటే త్వరగానే ముగించుకోవచ్చు" అంది.

మారు మాట్లాడకుండా ఇందిర కూడా ఆ గదిలోకి వెళ్ళి వెంటనే తలుపు లోపల గడియపెట్టేసింది. "కొరకంచుమొహం ఇదీను... నా ఇంట్లోకి అడుగుపెట్ట టానికెన్ని గుండెలుండాలి... దీనికింత మొండి ధైర్యం ఉందనుకోలేదు..." ఇందిరకేదో పీడకల వచ్చినట్టుంది.

"చాలా బావుందే... నేను మొదటే అనుకున్నాను..." అందామనిషి చుట్టూ కలియచూస్తూ. "అరె! భలేతమాషాగా ఉందే ఈ పడక్కుర్చీ! ఆహాహ! ఏమిబొమ్మలు గోడలమీద, హా! మాఇల్లూ ఉంది! నక్కఎక్కడ, దేవలోకం ఎక్కడ! నిజం చెబుతున్నాను ఇందిరమ్మా, నీయిల్లు ఇంద్రభవనంలా ఉందంటేనమ్ము."

దానిమొండితనం... పరాయిగృహంలో అంత చొరవ తీసుకొని ప్రవర్తించటం... అందులోనూ అటువంటి నీచురాలు... ఇందిర ప్రాణం విసిగిపోయింది. అంతవరకూ బలవంతాన అణచుకున్న క్రోధం గట్టు తెంచుకుంది.

"నువ్వు వచ్చిదొంగవి... ఇంకా ఏంకావాలి నీకు? నా గడపల్లో కాల్లుపెట్టటానికి నువ్వెవత్తివి? ఇంక నీ వెధవ్వేషాలు నాదగ్గర సాగవు... నేనింక నిశ్చయించుకున్నాను...

నిన్ను..."

"ఆ... ఆ... గొంతు కాస్త తగ్గించు... నీ నౌకర్లు వినగలరు... నాకేం పరవాలేదు... నువ్వు చెప్పిందంతా అబద్ధమని వాదించను... నిజం కావచ్చు... కానీ ఎంతచెడ్డా, జైలుకి వెళ్ళినా, నా ప్రస్తుత జీవనంకన్న నయమే... ఇందిరా, నీమంచికే చెబుతున్నాను... నువ్వు కాస్త జాగ్రత్తగా ఉండాలి... ఏమన్నా గొడవ చెయ్యదలుచుకుంటే తలుపులు సరిగ్గా మూసి ఉన్నాయో లేదో చూసుకో... నువ్వు నన్ను తిట్టు... తూలనాడు... నీ ఇష్టం వచ్చిన మాటలను... నాకు కించిత్తు నష్టం కలగదు."

కోపంవల్ల కొంత ఉద్రేకం కలిగినమాట వాస్తవమేకాని, ఆ మనిషి పొగరు చూసేసరికి ఇందిరవేడి కాస్తా చల్లారిపోయింది. తర్వాత పాఠం ఏంచెబుతారోనని శ్రద్ధగా వినే విద్యార్థినిలా, తన స్వగృహంలో, తన అతిథులగదిలోనే ఎంతో వినయ విధేయతలతో నుంచుంది ఇందిర.

"సరే అయితే, ఇందిరా, అసలువిషయానికొస్తాను. చూశావూ... ఈ మధ్య నా పరిస్థితేం బాగాలేదు... ఇంటిఅద్దె చాలా బాకీ ఉన్నాను... ఇంటి యజమాని హడావిడి చేస్తున్నాడు... ఇంకా బోలెడు అప్పులు నానెత్తిన ఉన్నాయి. ఈపాటికైనా నేనావ్యవహారాలు పైసలు చేసుకుంటే మంచిదనుకుంటాను... మరిక సాయం చెయ్యవలసింది నువ్వే... ఎంతో అక్కర్లేదు... ఓ నాలుగొందలు చాలు."

"ఏమిటీ? అంతసొమ్మే! నేనెలా తేగలను? నిజానికి నాదగ్గర అంత సొమ్ము ఎలాఉంటుంది? ఇప్పటికే ఎలాగో తంటాలుపడి మూడువందలు నీకు ధారపోశాను. నేనెక్కణ్నించి పట్టుకొచ్చివ్వను?"

"ఆ, భయపడకమ్మా, ఎలాగో తెచ్చివ్వలేకపోతావా! నీవంటి శ్రీమంతురాలికి డబ్బుకిలోటా - అనుకోవాలేగాని... ఏదీ... కొంచెం ఆలోచించి చూడు... బోలెడు ఉపాయాలుంటాయి."

"చెబుతున్నానుకదా, అంత సొమ్ము నాదగ్గరుండదని. నామాట నమ్ము... అంతసొమ్ము నాదగ్గర్లేదు. ఉంటే ఇచ్చేదాన్ని కాదూ? ఎలాగో చచ్చి చెడి వందరూపాయలదాకా ఇవ్వగలనేమో?..."

"నా వ్యవహారాలన్నీ పరిష్కరించుకోవాలి... నాలుగు వందలైనా కావాలని ముందే స్పష్టంగా చెప్పాను" అని నిమ్మకర్షగా మాట్లాడిందా మనిషి - ఇందిర

ఇస్తానంటున్న సొమ్ముని మష్టిక్రింద జమకడుతూ.

"నాదగ్గర్లేదు-" కళ్ల నీళ్ల పర్యంతమైంది. భర్త వస్తాడేమోనని బిక్కుబిక్కు మంటూ బిక్కమొహం వేసుకుని -

"నిజం చెబుతున్నానమ్మా, నాదగ్గర లేదు... అంత..."

"ఊ, అట్టే ఆలస్యం చెయ్యక త్వరగా చూడు."

"ఎలాగా?"

ఆ మనిషి ఇందిరని నిలువునా చూసింది విలువకట్టేదానికి మల్లే.

"ఆ ఉంగరం మాకేమిటంటావ్?... తాకట్టుపెట్టినా చాలనుకుంటాను. కావలసినంత సొమ్ము వస్తుంది... అయితే, అటువంటి ఆభరణాల సంగతి నాకంతబాగా తెలియదనుకో... నాకటువంటివి సొంతంగా ఉంటేకదా, విలువ తెలియడానికి! కాని నాకు మాత్రం బాగా నమ్మకంగా ఉంది... అధమం నాలుగువందలైనా రాకపోవని."

"నా ఉంగరమా? ఆశ్చర్యంగా అడిగింది ఇందిర. "ఆ సలహా విని నిలువునా కంపించిపోయింది. అది ఆమె ప్రధానపుటుంగరం. అందుకే దాన్నెప్పుడూ వేలి నుంచి తియ్యదు. అందులో ఉన్న రాయి అసలైన వజ్రం.

"ఏమిటి సందేహం? నీకు రసీదు పట్టుకొచ్చిస్తాను... నువ్వెప్పుడు కావాలనుకుంటే అప్పుడు డబ్బు చెల్లించి తీసుకోవచ్చు. నేనేం దాచుకోనులే... హామీ ఇస్తున్నాను. నావంటి పేదరాలు అంత ఖరీదైన ఆభరణాన్ని ఎలా పెట్టుకుంటుంది?"

"నన్నెందుకిలా పీడించి పీక్కుతింటావ్? నేనింక భరించలేను... నిజం చెబుతున్నాను... అర్థం చేసుకునేందుకు ప్రయత్నించు... నాదగ్గరేమీ లేదు... నన్ను కనికరించవూ?"

"నన్నెవ్వరూ ఎప్పుడూ కనికరించలేదు. ఆకలితో అల్లాడిపోతున్నా ఎవరూ ఏం చెయ్యలేదు. డబ్బులో మునిగితేలుతున్న నీవంటిదాన్ని చూసి ఎందుకు జాలిపడాలి?"

ఇందిర ఏదో సమాధానం చెప్పబోతూండగా వీధితలుపు తట్టిన శబ్దమైంది. ఆమె భర్త ఆఫీసునుంచి వచ్చాడు. ఆమె ఏంచేస్తోందో ఆమెకే తెలియకుండా వేలినున్న ఉంగరం తీసి అవ్వచేతిలో పడేసింది.

"భయపడకులే, నే పోతున్నాను" అందామనిషి ఇందిర కన్నుల్లో కనిపిస్తున్న భయాన్ని గమనించి. ఆ తలుపు తట్టినది ఇంటి యజమానేనని గ్రహించింది.

తలుపు తెరిచి, నిమిత్తమాత్రుడిలా నుంచున్న ఇంటి యజమానికేసి చూసి, తలవంచుకుని ఏమీ ఎరగనట్టు బయటికి వెళ్ళిపోయింది.

అది గుమ్మందాటగానే ఇందిర వీధితలుపు మూసేసి, ధైర్యాన్ని కూడగట్టుకుంటూ భర్తతో చచ్చుగా చెప్పింది- ఏదో విషయం గురించి అడగటానికొచ్చిందని. ప్రస్తుతానికి ప్రమాదం తప్పింది. మూర్తి ఆమెమాటల్ని పట్టించుకున్నట్టేలేదు. మామూలుగా భోజనాలగదిలోకి వెళ్ళి బల్లముందు కూర్చున్నాడు.

ఇంతకు ముందు ఉంగరం ఉన్నచోట వేలిమీద మంటలేచినట్టుగా ఉంది ఇందిరకి. ధగధగలాడే వజ్రం అక్కడే లేకపోవడం వల్ల అందరి దృష్టీ అక్కడే ఉందన్న సంగతి తనకి తెలును. ఆ విషయం బయటపడకుండా ఉండాలని, భర్తని ఏవేవో ప్రశ్నించటం, పిల్లల్ని పదేపదే నవ్వించడానికి ప్రయత్నించటం, అంతా అసందర్భంగా ఉండి చివరికి అపసవ్యంగా ముగిసిందామె ప్రస్తావన. అనుకోకుండా నిశ్శబ్దత ఏర్పడింది. అది బాధాకరంగా కూడా ఉంది. ఇందిర మళ్ళీ మాట్లాడ్డం మొదలెట్టింది ఆ స్తబ్ధతను పోగొట్టాలని. కాని పిల్లల్ని ఏంచేసినా, ఏం చెప్పినా వాళ్లు నవ్వలేదు. వాళ్ల మధ్య ఏదైనా చిలిపికజ్జా తేవాలని చూసింది. కాని వాళ్లు హఠాత్తుగా బుద్ధిమంతులైపోయారు. తన సంభాషణ అసహజంగా ఉండి ఉండాలి... తన ఉత్సాహం తెచ్చిపెట్టుకున్నట్లుగానే తోచి ఉండవచ్చును-లేకపోతే ఈ వైరుధ్యానికర్థం ఏమిటి? ఆమె పిల్లల్ని పట్టుదలగా నవ్వించడానికి ప్రయత్నించినకొద్దీ వాళ్లు మరింత గంభీరంగా ఉన్నారు. చివరికి విసుగు పుట్టి ఇందిర నోరుమూసుకొని ఊరుకుంది. అందరూ మౌనంగానే ఉన్నారు. ఎవరిమట్టుకు వాళ్లు తలవంచుకొని భోంచేస్తున్నారు.

"నీ ఉంగరం ఏమయింది?" హఠాత్తుగా అడిగాడు మూర్తి.

రావలసిన ప్రశ్న వచ్చింది. ఆఖరిప్రయత్నం చెయ్యాలి. ఆఖరి అబద్ధం ఆడాలి. "ఇలా చెప్పాలి" అని మనస్సులో అనుకొని పైకి, "కొంచెం నీరు దిగినట్టుండి కాంతి తగ్గితే, మెరుగు పెట్టించడానికిచ్చాను"- అంది. ఆడిన అబద్ధానికి మెరుగులు దిద్దుతూ, "ఒకటి రెండురోజుల్లో సిద్ధంగా ఉంటుంది... నేవెళ్ళి తెచ్చుకుంటాను" అంది అడక్కుండానే.

అలాచెప్పి అనవసరంగా రెండురోజుల్లో ఉంగరాన్ని తెచ్చే బాధ్యత నెత్తిమీద పెట్టుకుంది. ఏదో ఉపాయం ఆలోచించి ఆ ఉంగరాన్ని విడిపించుకోవాలి. ఆమె మనస్సు, శరీరం కూడా తేలికపడ్డాయి. మనస్సు ప్రశాంతంగా ఉంది... ఇప్పుడు ఆమెకి బాగా తెలుసును తమె కర్తవ్యం. దాన్ని నిర్వహించాల్సిన సమయాన్ని కూడా నిర్ణయించుకుంది. కొంత ఆత్మ బలం చేకూరిందామెకి బ్రతకడానికిగాని, చచ్చిపోవడానికి గాని.

ఆమె ఆశయం సిద్ధించే సమయం సమీపిస్తున్న కొద్దీ ఆమెకు విచక్షణ జ్ఞానం పెంపొందుతోంది. ఆమెను కలతచెందించిన ఉద్రిక్తత నశించి మనోధైర్యం చేకూరింది. భయంపోయి ప్రశాంతంగా ఉంది మనస్సు. ఈ అంతశ్శక్తి, మనశ్శాంతి ప్రభావంతో ఆమె తన జీవితాన్ని వేదాంతదృష్ట్యా అవలోకించి, దానికున్న యోగ్యతను అంచనావేయగలిగింది. తన పరిస్థితిని అవగాహన చేసుకుంది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నిజాన్ని వెల్లడించి తన జీవితాన్ని సుఖప్రదం చేసుకోవచ్చును. లేకుంటే, విడాకులిచ్చి, విడిగా ఉంటూ, లోకులువేసే అపవాదులను భరిస్తూ... అటువంటి పరిస్థితి దుర్భరంగా తోచిందామెకి. ఆమె ఇప్పటికే చాలా అలసిపోయింది. ఈ మధ్య జరుగుతున్న గడబిడతో ఆమెప్రాణం విసిగిపోయింది. ఇంక భరించేశక్తి నశించిందామెలో. భర్తా, పిల్లలూ, నౌకర్లూ అంతా అనుమానంతో, ఏంచెయ్యాలో తోచక బాధపడుతున్నారు. తన ప్రవర్తన తనకే అనుమానాస్పదంగా ఉంది. పారిపోవటం అన్నది అసంభవం - తనెక్కడ దాగినా, ఆ పిశాచి తనజాడ కనుక్కోక మానదు. తను చేసిన తప్పు ఒప్పుకున్నట్లయితే చిక్కు తీరేదేమోగాని- అదిప్పుడిక అసాధ్యం. ఇక మిగిలింది ఒక్కటే మార్గం- ఆ మార్గాన్ని అనుసరించిన ఏ ప్రయాణీకుడూ తిరిగిరాడు.

ఆ మరునాడు. ఇందిర ఈ వ్యవహారానికి సంబంధించిన ప్రతి ఉత్తరాన్నీ దగ్ధం చేసింది. ఇవీ అవీ సర్దింది. పిల్లల్ని దగ్గరికి చేరదీయలేదు. ఆమెకు ప్రేమాస్పదమైన ప్రతిదాన్నీ తప్పించుకు తిరిగింది. తన కిష్టమైన వాటన్నిటినీ దూరం చేసుకోవాలనుకుంది- మళ్ళీ వాటి ఆకర్షణకు లోనైతే తన ప్రయత్నం విఫలమవు తుందని ఇంట్లో అన్నీ సర్దేసి, వీధిలోకి బయలుదేరింది. ఆ పిశాచి కనిపిస్తుందేమో, పట్టుకుందామని వీధులన్నీ గాలించింది. అవధితెలియకుండా, అర్థంలేకుండా

తిరిగింది. ఆమెకి విసుగుపుట్టింది. పట్టుదల సడలింది. రెండుగంటలసేపు నడిచింది... విధిగా... ఉత్సాహరహితంగా. ఆమె కలుసుకుందామనుకున్న మనిషి ఎక్కడా కనిపించలేదు. అయినా ఈ భంగపాటు ఆమెను బాధించలేదు. ఆ మనిషి తన్ను మోసంచేసి ఊరువిడిచి వెళ్ళిపోయి ఉంటుందనుకుంది. ఆమెకి దారిలో ఎదురవుతున్న ముఖాలు నిర్జీవంగా దూరంనుంచి నీడల్లా కనిపిస్తున్నాయి. వాటితో ఆమెకు సంబంధం లేదు.

ఒక్కక్షణంపాటు భయం ఆవహించిందామెను- దారిలో దూరంగా భర్తముఖం లీలగా కనిపించినట్లు ఊహించుకునేసరికి. ఆమెకు అనుమానం కలిగించిన ఆకారం మరుక్షణంలోనే బండివెనక మరుగుపడిపోయింది. వెంటనే తన్ను తాను సమాధాన పరుచుకుంది- ఆ ఆకారం భర్తదై ఉండదని, ఆయన కోర్టులో హడావిడిగా ఉండే సమయం అది. ఈ అనంతయాత్రలో ఆమె కాలగతిని విస్మరించింది. ఇంటికి చేరే సరికి భోజనంవేళ దాటిపోయింది. భర్త కూడా ఆలస్యంగానే వచ్చాడు. ఆమెవచ్చిన కొద్దిసేపట్లోనే ఆయన వచ్చాడు చిరాకుగా.

చీకటిపడేవరకూ గంటలు లెక్కపెట్టుకుంటూ ఆత్రుతపడసాగింది. ఆఖరికి ఇక కొద్ది క్షణాలు మాత్రమే వ్యవధి మిగిలేసరికి ఆమెకి ఆశ్చర్యం కలిగింది. సెలవు తీసుకొని బయలుదేరే సమయం ఆసన్నమైంది... అనంతర యాత్రలో తనకూడా తీసుకుపోయేందుకు వీల్లేదని తెలియగానే ఎవరికైనా సరే భౌతికపదార్థాలపైన మోజునశిస్తుంది... నిద్రమత్తుగా ఉందామెకు... యాంత్రికంగా బయలుదేరింది... నడిచింది... బుర్రలో ఆలోచనలు లేవు... చుట్టుపక్కల ఏముందోననే ధ్యాసలేదు... ఓ వీధిమలుపు తిరుగుతూంటే అంగుళంవాసిలో ప్రమాదం తప్పిపోయింది. ఆ డ్రైవరు కారునెంతో బలంగా ఆపుచేశాడు కాబట్టి బ్రతికింది. ఆవిధంగా అప్రయత్నంగా ఆమె సమస్య పరిష్కరింపబడేదే. ఇంక ఆ విషయమై ఆలోచించకుండా ఉంటేనే హాయి... ఆసన్నమవుతున్న అంతాన్ని మనస్సులో పెట్టుకోకుండా ప్రవాహంతోబాటు కొట్టుకుపోవడం నయం.

ఇందిర వెడుతూ వెడుతూ ఒక్కమాఱు చుట్టూ కలియచూసి, హడలిపోయింది... అగమ్యంగా తిరిగి తిరిగి ఆఖరికి ఆమె ప్రియుడుంటున్న ఇంటి సమీపానికి చేరుకుంది. ఇదీ తన మంచికేనేమో! ఒకవేళ అతడు తనకి సాయం చేస్తాడేమో? అధమం, ఆ

మొనకత్తె ఎక్కడఉండేదీ చెబుతాడేమో? ఆశతో, ఆనందంతో ఆమె మనస్సు ఉరకలువేసింది. ఈ ఆలోచన తనకు ముందే ఎందుకుతోచలేదు? ఆమె మనోభావాల ననుగుణంగా శరీరంలో మార్పు కలిగింది... అవయవాల భారం తగ్గింది... నడకలో చురుకు ప్రవేశించింది... ఆలోచనలు సాఫీగా సాగుతున్నాయి... ఆ మనిషి ఇల్లు అతన్ని స్వయంగా చూపించమని అడగాలి... అప్పుడు వ్యవహారాన్నంతా పూర్తి చేసుకోవాలి... భూషణ్ దానితో చెబుతాడు డబ్బు తీసుకోవద్దని... ఒక్కసారిగా కొంచెం పెద్దమొత్తం చెల్లిస్తేసరి- అదింక ఊరు విడిచిపెట్టి పోవచ్చు. ఆరోజున రోడ్డుమీద అతనితో కఠినంగా మాట్లాడినందుకు నొచ్చుకుంది... అయినా అతడు తనకు తప్పక సాయం చేస్తాడు... అందుకు సందేహం లేదు... నిజంగా ఆశ్చర్యంగా ఉంది... ఈ అంతిమ క్షణంలో ఇంత సులభమయిన పరిష్కార మార్గం తోచడం... ఇదే ముక్తిమార్గం... గబగబా మేడమెట్లెక్కి తలుపు తట్టింది. తలుపు తెరిచేందుకెవరూ రాలేదు. లోపల మనుషుల అలికిడి ఆమెకు తెలుస్తూనే ఉంది. మళ్ళీ తలుపు తట్టింది... తిరిగి నిశ్శబ్దం... లోపల నుంచిమాత్రం అడుగుల సవ్వడి వినిపిస్తూనేఉంది... ఆమె ఇంక ఆగలేకపోయింది. ఆమెను జీవన్మరణ సమస్య వెన్నంటుతూంది. తలుపుబాదింది... బాదింది... బాదింది... చివరికి తలుపు లోపలగడియ ఊడింది. తలుపు ఓరగా తెరుచుకుంది. ఆత్రుతతో రహస్యంగా అంది.

"నేను... నేనే..."

భూషణ్ తలుపు బార్లా తెరిచాడు.

"నువ్వా... నువ్వా... ఇందిరా... నేనసలు... నువ్వొస్తావని నేననుకోలేదే... అరె... క్షమించు, నా వాలకానికి" అన్నాడతను సిగ్గుపడి. బనీనైనా వేసుకోకుండా లుంగీకట్టుకొని ఉన్నాడు.

"నీతో ఓమాట చెప్పాలి ఇప్పుడే... చాలా ముఖ్యం... నువ్వు నాకు సాయం చెయ్యాలి" అంది గుక్కతిప్పుకోకుండా. "దయచేసి నన్ను లోపలికి రానిద్దూ... ఒక్క నిముషంకన్న నిన్ను ఎక్కువసేపు నిలబెట్టను".

"కాని... కానీ... పదిమందరలో ఉన్నాను... నేనసలు..."

"తలుపు కట్టిపెట్టు... ముందు నామాట వినాలి. ఇంతకీ అది నీ అపరాధమే. నాకు సహాయపడటం నీ కర్తవ్యం. నువ్వు చేసితీరాలి. నా ఉంగరాన్ని తీసుకొచ్చి

నాకిచ్చేసెయ్యి... అధమం ఆ మనిషి చిరునామా అయినా చెప్పు... నేనెక్కడికెడితే అక్కడికి వెంటాడుతోంది... ఇప్పుడది కావాలన్నా దొరకటంలేదు... నువ్వాపని చేసితీరాలి. విన్నావా? నువ్వు నాకు సాయం చేసితీరాలి."

ఆశ్చర్యంతో మూగవోయి అయోమయంగా చూశాడతను. "ఓహో, అదా!" అంటూ ఇందిర సాగదీస్తూ, "నేనెవరినుద్దేశించి మాట్లాడుతున్నానో నీకేం తెలియనట్టు చూస్తావేం? అదే... నేనురంగంమీదికి రాకపూర్వం నీతో తిరిగిన నీ ప్రేయసి. నేను వెళ్ళిపోతూంటే పట్టుకుంది. ఆరోజు మొదలుకొని నన్ను నానాబాధా పెట్టి నన్ను బెదిరించి డబ్బు గుంజుకుంటోంది. ఇక నీ వ్యవహారాలన్నిటికీ స్వస్తిచెప్ప దలచుకున్నాను... బ్రతుకుపైన రోత పుట్టింది... 'ఏమయినా, ముందు నా ఉంగరం నాక్కావాలి... ఈ రాత్రికైనా సరే... నాకు సాయం చెయ్యవూ?... నాకామనిషి చిరునామా చెప్పు..."

"కానీ..."

"నేను చెప్పినట్టు చేస్తావా, లేదా?"

"ప్రమాణపూర్తిగా నాకేం తెలియదు... నువ్వెవరి గురించి మాట్లాడుతున్నావో నాకేం తెలియటం లేదు... అటువంటిరకం మనిషితో నాకెప్పుడూ ఎటువంటి సంబంధం లేదు."

"అదెవరో నీకు తెలియదూ? అయితే అంతా అదే కల్పించిందా? అంతేనా? అయినా, దానికి మాత్రం నా పేరూ ఊరూ అంతా తెలును. బహుశః నేను పొరపడ్డానేమో... అది అటువంటి దొంగమనిషి అనుకొని?... అంతా ఓకల కదూ?"

ఆమె వ్యంగ్యంగా నవ్వింది. భూషణ్‌కి చిరాకుపుట్టింది. అయినా, ఇందిర కన్నుల్లోని కాంతి ఓ‌ణంకాలం అతన్ని భయపెట్టింది. ఆమెవైపు ఆత్రంగా చూశాడు.

"కాస్త శాంతించు ఇందిరా. నువ్వు పొరపాటు పడుతున్నావు... పరిస్థితి అర్థం కావటం కష్టంగావుంది... నిజంగానే నాకేం తెలియదు ఆ మనిషెవరో... ఆ గొడవేమిటో... నమ్ము నమ్ము ఇందిరా... ఏదో పొరపాటు..."

"ఇంతకీ నువ్వు నాకేం సహాయం చెయ్యదలుచుకోలేదన్నమాట?"

"అబ్బే... అదికాదు... నేను చెయ్యగలిగిన సహాయం తప్పక చేస్తాను."

"అయితే సరే, పద... ముందు దానింటికి వెడదాం."

"ఎవరింటికి?" అని అడిగి, అతను భయపడ్డాడు ఆమెకి పిచ్చిపట్టిందేమోనని.

"దానింటికే,.. నువ్వొస్తావా, లేదా?"

"వస్తాను... వస్తాను... నీకోసం ఏమయినా చేస్తాను."

"అది సరే... అయితే, నాకు సంబంధించినంత వరకు ఇదొక జీవన్మరణ సమస్య అని తెలుసుకున్నావనుకుంటాను."

భూషణ్‌కి నవ్వాపుకోవడం కష్టమైంది. అప్పటికీ ఎంతో మర్యాదగా "ఇందిరా, నిజంగా నాకెంతో విచారంగా ఉంది... కాని... ఇప్పటిమట్టుకు నాకు వేరేపనుంది... ముఖ్యమైన పారం వొకటి... చాలాకష్టం..."

"అదా అసలుసంగతి... ఇప్పుడర్థమయింది... దగాకోరా!"

ఇందిరకి హఠాత్తుగా ఏదో తట్టింది. అతన్ని పక్కకి తోసేసి, ఆమె లోపలికి ప్రవేశించింది.

"అది కూడా ఇక్కడే ఉంటోందనుకుంటాను. మీరిద్దరూ కలిసే నాటకం ఆడుతున్నారు... అది అన్యాయంగా ఆర్జిస్తున్న సంపాదనలో నీక్కూడా కొంత భాగం ఉందేమో... ఏమయినా, దీని అంతు తేల్చడానికే నిశ్చయించుకున్నాను... నాకేం భయంలేదిప్పుడు..."

ఆమెని ఆపడానికి ప్రయత్నించాడు భూషణ్. కాని పట్టు విడిపించుకొని అతని పడకగదిలోకి వెళ్ళిపోయింది. అంతలోనే ఒక ఆకారం అక్కణ్నుంచి కంగారుగా తప్పించుకోబోయింది. తలుపు వెనకాలనుంచి తమ సంభాషణ పొంచి వినివుండవచ్చు ననుకొని ఇందిర ఆమెను పరికించి చూసింది. అపసవ్యంగా ఉన్నాయామె దుస్తులు. కాని ఈమె తమ అనుకున్న స్త్రీకాదు.

"క్షమించాలి" అంది ఇందిర వెంటనే ఆ స్థలంనుంచి నిష్క్రమిస్తూ.

"క్షమించాలి.. అంతా నేను విడమరిచి చెబుతాను... రేపు... అసలు నేను... నాకర్థంకావడం లేదు... నాకు సాధ్యం కాదు-"

అపరిచితుడితో మాట్లాడినట్లు చెప్పింది. ఆమె ప్రవర్తన చూస్తే ఒకప్పుడు వాళ్ళిద్దరూ ప్రేమికులని ఎవ్వరూ అనుకోరు. ఆమె బుర్ర సుడిగాలిలో చిక్కుకుంది.

ఎవరో అబద్ధం ఆడుతున్నారు... ఆమె అలిసిపోయింది... ఆలోచించలేనంతగా అలిసిపోయింది... చుట్టుపక్కల చూసుకుందుకు కూడా ఓపిక లేకపోయింది... కళ్లుమూసుకుని మెట్లుదిగిపోయింది... అపరాధికిమల్లే.

వీధంతా చీకటిగా ఉంది. ఆ మనిషి దారిలో కాచుకొని కూర్చోలేదు కదా? ఏనాటికైనా తనకి విముక్తి లభిస్తుందా?... బూజుపట్టిన దేముడికి మనస్సులో నమస్సులు చెప్పుకుంది... అధమం ఒక రెండేళ్లపాటయినా తెరిపి దొరికితే, ఆ పాపిష్టిదాని బారినుండి తప్పించుకొని దేశంలో దూరంగా ఎక్కడికోపోయి... పచ్చిక బయళ్లలో... పచ్చని పొలాల్లో ప్రశాంతంగా ఉండొచ్చును... ఆలోచిస్తూ ఇటూ అటూ చూసింది ఇందిర... ఎదుటి గుమ్మంచాటున ఎవరో తారట్లాడుతున్నట్లు తోచిందామెకు... అంతలోనే ఆ ఆకారం మాయమైంది. ఆ క్షణంలో భర్త స్వరూపం గుర్తుకొచ్చిందామెకు. ఒకవేళ ఈ సమయంలో కనక తన భర్త ఎదురయితే?... ఎంత భయంకరమయిన ఆలోచన!... ఆగిపోయి, చుట్టుపక్కల జనాన్ని మరోసారి పరిశీలించింది. ఆ ఆకారం మనుషుల నీడలలో మరుగు పడిపోయింది. ఇందిర భయభ్రాంతులతో నడుస్తోంది... నడుస్తున్నంతసేపూ ఎవరో తన్ను వెంటాడుతున్నట్లు అనుమానిస్తూనే ఉంది... తీరా వెనక్కి తిరిగి చూస్తే అనుమానించదగ్గ ప్రాణి ఒక్కటీ కనిపించడంలేదు.

ఒక మందుల దుకాణంలోకి వెళ్ళింది ఇందిర. బల్లముందు కూర్చున్న నల్లటి మనిషికి తన సంచీలోంచి కాగితాన్ని తీసిచ్చింది. లోపల అద్దాలబీరువాల్లో అనేకరకాల సీసాలూ, వాటిపేర్లూ, తూకపుయంత్రం, మందుల కంపెనీల క్యాలండర్లూ, గోడమీద గడియారం... ఆ ప్రదేశమంతా సమస్తరోగ నివారణకై కంకణం కట్టుకున్నట్లు కనిపిస్తోంది. చిన్నప్పుడు ఆమె తల్లికిగాని, ఇంట్లో ఇంకెవరికైనా జ్వరం వచ్చిందంటే వెంటనే మందుల దుకాణానికి పరుగెత్తేది. ఆ దుకాణంలోని రంగురంగుల సీసాలు, రకరకాల వాసనలు ఆమెకెంతో ఇష్టం- ఈ సమయంలో అమ్మదగ్గరుంటే ఎంత దుఃఖించేది... కలతచెందించే ఆలోచన... మరో బక్క పలచటి మనిషి ఒక నీలిరంగు సీసాలో... నరనరాల్లోంచీ ప్రవహించే... మారకద్రవం... ఇందిర శరీరమంతా శైత్యల్యం ఆవరించింది... మృత్యువుని సీసాలో బంధించి మూతి బిగిస్తూంటే... విస్తుబోయి వెర్రిగా చూసింది... సీసాపైన "విషం" అని వ్రాసివున్న కాగితం ముక్కని అంటించటం... దానివెల పాతకాగితం మీద వ్రాయటం... ఆమె అవయవాలన్నీ కొయ్యబారిపోయాయి...

ఆలోచన రాగానే...

"బిల్లు... ఇదుగో" అన్నాడామనిషి.

ఆమె తృళ్ళిపడింది- అకస్మాత్తుగా మేలుకున్నట్లు. చుట్టూ కలయచూసింది... సంచీలోంచి రూపాయలు పైకితీసి యాంత్రికంగా లెక్కపెట్టింది.

ఎవరో వెనకనుంచి ఆమెచేతిని కుదిపినట్లయింది. చేతిలోని రూపాయలు బల్లమీదికి దొర్లిపోయాయి. ఒక బలిష్ఠమైన హస్తం ముందుకొచ్చి సీసాను అందుకుంది.

వెనక్కి తిరిగి, ఆ అడ్డొచ్చిన వ్యక్తి ముఖాన్ని కళ్ళప్పగించి చూసింది ఇందిర... పెదవులు బిగపెట్టి నిల్చున్నాడు భర్త... ఆయన నుదుటినిండా స్వేదబిందువులు...

మూర్ఛ వచ్చినట్లయిందామెకి... పక్కనున్న బల్లమీదికి ఒరిగిపోబోయి, మళ్ళీ సర్దుకుంది. చటుక్కున స్ఫురించిందామెకి- ఇందాక తనకు కనిపించి మాయమైన ఆకారం ఈయనదేనని. ఆమెను వెంటాడుతూనే ఉన్నాడాయన.

"రా" అన్నాడాయన ముక్తసరిగా. వెంటనే బుర్ర ఊపింది వస్తానన్నట్లు... ఆమెకే ఆశ్చర్యం వేసింది- అంతవినయం అమాంతంగా తనకెక్కడినుంచి వచ్చిందని. తనకి తెలియకుండానే ఆయన చెయ్యిపట్టుకొని వెంటనడిచింది. ఒకరిముఖం ఒకరు చూసుకోవడం లేదు... రెండవచేత్తో సీసా ఇంకా పట్టుకునేవున్నాడాయన... కాస్సేపాగి, నుదురు తుడుచుకున్నాడు. అనాలోచితంగా ఆమె కూడా ఆగిపోయింది. అయినా ఆయన ముఖంలోకి చూసేధైర్యం లేదామెకి. వాళ్ళు మాట్లాడుకోవడం లేదు... వీధిలో వచ్చే పోయేజనం చేసేహడావిడి మాత్రం వినిపిస్తోంది.

ఆయన పక్కకి తప్పుకున్నాడు ఇంటి గుమ్మం దగ్గర- ఆమెను ముందర లోపలికి పంపించాలని. కాని ఆమె వణికిపోతూ ఒరిగిపోబోయింది. తన చేతిని వెంటనే ఆమె భుజంమీద వేశాడు. ఆమె సర్దుకొని హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది. ఆయన కూడా వెళ్ళాడు. ఇద్దరినోటమ్మటా ఒక్కముక్కయినా బయటికి రాలేదు. సీసా మూతతీసి మందు పారబోసేశాడు. ఆ ఖాళీసీసాని గదిలో ఓమూలకి విసిరేశాడు. ఆ సీసా ముక్కలైన భీకరశబ్దానికి అదిరిపోయింది ఇందిర.

ఇంకా ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఆఖరికి ఆయన ఆమెదగ్గరకు వెళ్ళాడు- ఆయన దీర్ఘనిశ్వాసం ఆమెకు స్పష్టంగా తెలిసింది. రామన్న ప్రళయ్యంకోసం ఓగ్పు

వహించి ఊరుకుంది. ఆయన ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ఆమె గజగజలాడి పోయింది. అప్పటికీ ఆయన మౌనంగానే ఉన్నాడు. చటుక్కున ఆమెకు గుర్తొచ్చింది- తన భర్త రౌద్రమూర్తే కాదు... దయానిధి కూడా అని.

"ఇందూ, మనం ఎంతకాలం ఈవిధంగా ఒకళ్లనొకళ్లు హింసించుకోవడం?"

ఇన్నాళ్లనుంచీ గడ్డకట్టుకున్న దుఃఖమంతా ఆయన మాటలకి ఒక్కసారిగా - కరిగి కన్నీళ్లై ప్రవహించాయి. ఆమె దుఃఖభారంతో క్రుంగిపోతూంటే ఆయన లాలనగా ఆమెను దగ్గరకు చేర్చుకొని.

"ఇందూ... ఇందూ" అంటూ సాదరంగా సంబోధించాడు. పలుమార్లు పిలిచాడాయన. ఆమె వ్యథిత హృదయం ఆయన మనసులో ఆందోళన కలిగించింది. ఎవరినో హత్యచేసినట్టు బాధపడ్డాడు. ఆమె మానసిక వ్యధను అంతమొందించే ఆశతో అంతకంతకు ఆయన కంఠస్వరంలో ఆప్యాయత అధికమవుతోంది. ప్రత్యుత్తరంగా ఇందిర ఎక్కెక్కి ఏడుస్తోంది... పొంగిపొరలే దుఃఖతరంగాలలో కొట్టుకుపోతోంది... మూర్తి ఆమెను పడక గదిలోకి తీసుకుపోయి, మెత్తని పరుపుమీద ఒత్తిగిల పడుకోబెట్టి, వెచ్చగా ఉండేందుకు రగ్గు ఒత్తుగా కప్పాడు. దుఃఖం మాత్రం ఆగలేదు. ఆమె ఒళ్లంతా వణుకుతోంది. శరీరమంతటా శైత్యల్యం ప్రసరించింది.

ఆమె చేతుల్ని తన చేతుల్లో పెట్టుకొని, ఆమె పెదవుల్ని తన పెదవులతో స్పృశించాడు. ఆమె చెక్కిళ్లపై నుండి కన్నీరు ధారలైపారింది. మూర్తి ఆతురత ఎక్కువయింది. మంచంపక్కనే మోకాళ్లమీద కూర్చుని ఆమె ముఖానికి తన ముఖాన్ని చేర్చి చెవిలో చెప్పాడు."

"ఇందూ... చిట్టీ... ఇంకా ఎందుకే ఏడుస్తావు? అంతా అయిపోయింది... ఏ గొడవాలేదింక... నువ్వేమీ భయపడకు ఇకమీదట... ఆ మనిషి ఇంకెప్పుడూ నీదగ్గరికి రాదులే... రాదు చిట్టీ... ఇంకెప్పుడూ రాదు... ఒట్టేస్తున్నాను... అదింకెప్పుడూ మనదగ్గరికి రాదుగా... నువ్వంత భయపడిపోతావని నేనెలా ఊహించుకోగలను?... నేకోరిందల్లా ఒక్కటే... నువ్వు గృహిణివి, మాతృమూర్తివి - అన్న విషయం గుర్తుంచుకొని మళ్లీ నీవిధులను నువ్వు సక్రమంగా నిర్వర్తించాలనే...

ఆ వ్యవహారం నా చెవులదాకా వచ్చాక, ఇక నేను చెయ్యగలిగిందేముంటుంది? అటువంటి సంగతి గురించి ముఖాముఖీ నీతో నేనేమని మాట్లాడేది? నీ అంతట

నువ్వే తిరిగి సంసారాన్ని చక్కదిద్దుకుంటావనుకున్నాను... నువ్వలా చెయ్యలేదు... అంచేత నేనే ఆ మనిషిని నియమించాను- నిన్ను బెదిరించి అయినా సరే సవ్యమైన మార్గానికి చేర్చమని... అదొక దౌర్భాగ్యజీవి... చితికిపోయిన చిల్లర నటి... నాక్కావలసిన పని దానిచేత చేయించడానికి నేనెంతో శ్రమపడవలసి వచ్చింది. అయితే... అయితే... నీ దృష్టిని బలవంతంగా మరలించడం పొరపాటని యిప్పుడు గ్రహించాను... కాని, ఇందూ... నా చిట్టీ... నువ్వు తిరిగి నాదానివి కావాలనే వాంఛించాను నేను... ఇన్నాళ్లనుండీ ఎప్పటికప్పుడు పరోక్షంగా నీకు తగిన సూచనలిస్తూనే ఉన్నాను... జరిగినదాన్ని ఏమాత్రం లెక్కచెయ్యనని.... చివరికి నువ్వు నన్ను అర్థంచేసుకోలేక పోయావు... నన్ను నమ్ము ఇందూ... నీ మనస్సు కష్టపెట్టాలనే ఉద్దేశం నాకెన్నడూ లేదు... అడుగడుగునా నిన్ను కనిపెడుతూ... ఇంతాచేసినది మన పిల్లలకోసం... నిజానికి... నాకేకావాలి నువ్వు... ఇప్పుడిక అంతా మామూలుగా ఉందాం ఇందూ..."

ఆయన కంఠస్వరం అనంతదూరం నుంచి అలలు అలలుగా వినవస్తూం దామెకు. ఆయన ఏమంటున్నాడో ఆమెకర్థం కాలేదు. ఆమె మనస్సు అల్లకల్లోలంగా ఉంది. మనస్సులో ఏవిధమయిన అనుభూతీ లేదు. అయినా, ఆమె తన ముఖంమీద కురిసిన ముద్దులూ, ఎదలో అమృతం చిలికించిన అనునయ వాక్యాలూ, చెక్కిళ్లపై జారిన కన్నీరూ... అస్పష్టంగా గుర్తించింది. ఆమె మెల్లిగా కళ్లు తెరిచి చూసింది... భర్త దయార్ద్ర నేత్రాలతో ఆదుర్దాగా తన కన్నుల్లోనికి వీక్షించటం గమనించింది. ఆపైన ఏం జరిగిందో ఆమె ఎరుగదు... ఆమె చుట్టూ తిరిగి చీకటి గూడు కట్టుకుంది... కాని, ఈసారి అది నిశ్చలమయిన నిద్రావస్థ మాత్రమే.

బాగా ప్రొద్దెక్కిన తర్వాతగాని ఆమె మేలుకోలేదు. హృదయం తేలిక పడినట్టు ఒక వింత అనుభూతి కలిగిందామెలో. తుఫాను తీవ్రత తగ్గిన తర్వాత ఏర్పడే వాతావరణంలాగ ప్రశాంతంగా ఉందామె మనస్సు. జరిగినదంతా జ్ఞప్తికి తెచ్చుకోవడానికి ప్రయత్నించింది. కాని, మంచు తెరలు మనసును క్రమ్ముకున్నాయి. స్వాప్నిక చిత్తస్థితిలోంచి బయటపడేందుకు ఆమె తన దేహాన్నంతటినీ ఒక్కమారు స్పృశించి చూసుకుంది.

ఏమిటిది?... వేలికి ఉంగరం!... వెంటనే మైకం పూర్తిగా వదిలిపోయి మెలుకువ వచ్చింది. అస్పష్టంగా విన్న పలుకులు హఠాత్తుగా స్పష్టమై, సత్యమై, సంపూర్ణమై

సందర్భ సహితంగా అర్ధమైనవామెకు. ఒక్క క్షణంలో వ్యవహారమంతా మెరుపులా గుర్తుకొచ్చింది- తన భర్త సందేహం, ప్రియుడి సంభ్రమం... మబ్బుతెరలు విడిపోయాయి... తనకు తాను పరుచుకున్న వలను తన కళ్ల ఎదుటనే చూడగలిగింది. అవమానం, సిగ్గు ఆవహించాయామెను... కంపించి పోయింది... మళ్లీ మేలుకున్నందుకు చింతించింది... కలలులేని కలతలేని ఆ నిద్ర ఎంత నిర్మలమయినది!

క్రింది గదిలోంచి పిల్లల గొంతుకలు వినవస్తున్నాయి. ప్రభాతంలోని పక్షుల్లా పసిపిల్లలు పకపక నవ్వుతూ పరుగులు పెడుతున్నారు. అదుగో... అది బాబి కంఠం. వాడి కంఠం అచ్చు తండ్రిదేనని అంతకు ముందెప్పుడూ తను గ్రహించనేలేదు. ఆమె అధరాలపైన చిరునవ్వు సన్నగా మెరిసింది. తన భావి జీవితానికి యోగ్యత కల్పించి, ఆనందమయంగా మార్చిన తన సంసారాన్ని తలుచుకుంటూ సంతోషంగా కళ్లు మెల్లిగా మూసుకుంది. హృదయంలో ఎక్కడో మూల ఏదో బాధ సన్నగా మూలుగుతూనే ఉంది... కానీ అది మానుతున్న గాయానికి చెందిన నొప్పి... అంతే... అది కూడా త్వరలోనే మానిపోతుందని ఆమెకి తెలుసును.

# హస్తకళ

మన్మథనామ సంవత్సరంలో శ్రావణమాసపు సాంధ్యవేళ! సన్నని వానజల్లు కురిసి వెలిసింది. సూర్యరశ్మి హాయిగా, చల్లగా విరిసింది. వాతావరణం ఉత్సాహ జనకంగా ఉంది. చివరికి మద్రాసు నగరంలో కూడా మైదానాల్లోంచీ, సముద్ర మీంచీ సుగంధ వాయువులు వీస్తున్నాయి. ఈ విచిత్రానికి కారణం శ్రావణమేఘాల చలచిత్త స్వభావమే. ఓగంటక్రితం పట్టణానికి పశ్చిమ దిక్కునుంచి మా రైలు పయనిస్తూండగా హఠాత్తుగా ఆకాశమంతా ఆవరించిన కారుమేఘాల గుంపులో ఇరుక్కున్నది. స్టేషను ఇంకా దూరంలో ఉండగానే పట్నంలోని రంగు రంగుల దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. అప్పుడే, పెట్టెలో అవతల బెంచీమీద కూర్చున్న అరవావిడ లేచి పిల్లలు ఇటూ అటూ చిందరవందర చేసిన సామాన్లను సర్దుకుంటోంది. అంతలోకే, టపీ టపీమని వాన చినుకులు రైలుమీద పడటం ప్రారంభించాయి. జిగేల్మనే మెరుపొకటి సూచనగా మెరిసి మాయమైంది- వెంటనే బ్రహ్మాండం బద్దలయేటంత శబ్దం- మా రైలు దద్దరిల్లిపోయింది. ఆ వానవిసురికి కిటికీ తలుపులు గడగడలాడాయి. ఏమీ కనిపించడంలేదు, వినిపించడంలేదు - కిటికీ అద్దాలపైన పడుతున్న వడగళ్లవాన తప్ప. కొరడా దెబ్బలు తింటున్న క్రూరమృగంలా ముందుకి పరుగు లంకించుకుంది రైలు.

ప్రకృతి ప్రతాపమంతా సెంట్రల్ చేరుకునేసరికి చల్లారిపోయింది. ప్రయాణీకు లంతా కూలీలకు సామాన్లు అందిస్తున్నారు. విచ్ఛిన్నమవుతున్న వానమబ్బులక్రింద సూర్యరశ్మిలో నగరమంతా నిగనిగలాడుతోంది. ఇళ్లన్నీ శుభ్రంగా తోమిన కంచులా తళతళ లాడుతున్నాయి. ఆకాశంలో మేఘాల మధ్య బీటలు మెరుస్తున్నాయి. వర్ష వస్త్రాన్ని విప్పుకొని నగరం తన నగ్న సౌందర్యంలో వినూత్నంగా శోభిస్తోంది. ఇటూ అటూ కనిపించిన చోటల్లా తలదాచుకున్న జనం సంతోషంగా నవ్వుకుంటూ మళ్ళీ

వీధుల్లోకి చొరబడుతున్నారు. సూర్యరశ్మి తిరిగి తన స్థానాన్ని ఆక్రమించుకున్నందుకు ప్రతి వారికీ సంతోషంగానే ఉంది. సంస్కారం లేక రోగిష్టి రూపుతో కనిపించే వృక్షాలు కూడా ఈ ప్రక్షాళనంవల్ల పరిశుభ్రమై ఉత్సాహంతో ఆకాశం వైపు హస్తాలుచాచి తమ పరిమళాన్ని వెదజల్లేందుకు శాయశక్తులా యత్నిస్తున్నాయి. వర్షం వెలిసిన కొద్ది క్షణాల్లో అవి సాధించిన విజయం వర్ణనాతీతం. మద్రాసు నగరపు నడివీధులన్నీ సుమపరిమళంతో పరివ్యాప్తమయాయి.

ఇటువంటి శ్రావణమాసపు సంధ్యాసమయంలో నేను పొందిన ఆనందం చాలదన్నట్లు, నాకింకో అదృష్టం పట్టింది. రాత్రి పదిగంటలవరకూ నాకేమీ పనిలేదు. మద్రాసులో ఉంటున్న లక్షలజనాభాలో ఒక్క ద్విపాదపక్షికి కూడా నారాక తెలియదు. నాకోసం ఎదురుచూసే వారెవరూ లేరు. నాకిష్టం వచ్చిన రీతిని నేను పోవచ్చును. మద్రాసు వీధుల్లో విహరించవచ్చు... లేదా... వార్తాపత్రికలన్నీ చదువుకోవచ్చు... ఏదైనా హోటల్లో కూర్చోవచ్చు... దారిలో ఇటూ అటూ దుకాణాల్లో ముస్తాబులు చూడొచ్చు... పుస్తకాల కొట్టుకెళ్లొచ్చు... స్నేహితులకు టెలిఫోన్ చెయ్యొచ్చు... లేదా, శుభ్రంగా సముద్రపొడ్డుకు పోయి కూర్చోవచ్చు. ఏమీ బాదరాబందీ లేదుకాబట్టి ఏపనైనా చెయ్యొచ్చు... లక్ష విధాలుంటాయి. నా అదృష్టంవల్ల నైతేనేం, నా మనస్సు ప్రేరేపించటం వల్లనైతేనేం, అన్నిటికన్నా ఉత్తమమైన పద్ధతినే ఎంచుకున్నాను. అదేమిటంటే, ఫలానా అని ప్రత్యేకంగా ఏమీ చెయ్యక పోవటమే. నేనేమీ ప్రణాళికలను తయారు చేసుకోలేదు... ఒక అవధి ఏర్పరచుకోలేదు- అగమ్యంగా వీధుల్లో తిరిగాను- రోడ్డుపక్కల్ని నెమ్మదిగా నడుస్తూ, నాలుగు వీధులూ కలిసేచోట తొందరగా దాటుతూ- తిరిగి... తిరిగి... చివరికి మౌంట్ రోడ్డు చేరుకున్నాను. అప్పటికే బాగా అలిసిపోయాను. ఆ వీధిచివరనే ఉన్న హోటల్లో ప్రవేశించి, వరండాలో వేసివున్న కుర్చీలో చతికిలబడ్డాను.

ఆ పేము కుర్చీలో ఖులాసాగా జార్లబడుతూ, "హమ్మయ్య... మళ్లీ ఇక్కడికి వచ్చానన్నమాట" అనుకున్నాను. "ఏం, మద్రాసూ, ఏనాటి మద్రాసు! మనిద్దరం కలుసుకుని ఇప్పటికి రెండేళ్లుపైనైంది. ఇప్పుడు తిరిగి ఒకరినొకరం కళ్లారా చూసుకుందాం. ఏం మద్రాసూ! ఏమిటి విశేషాలు? నేనిక్కడినుంచి వెళ్లిపోయాక నువ్వునేర్చుకున్న కొత్త విద్యలేమిటి, చెప్పు!... ప్రారంభించు... నిన్ను ప్రసిద్ధికెక్కించిన గాన సభలు, భరతనాట్యాలు, వీధినాటకాలు... ఊ... త్వరగా చురుగ్గా చెప్పుమరి

నువ్వింకా యేమేం చేయగలవో... నీభుజబలాన్నంతా చూపు.. పాటగాళ్లు... నాట్యకత్తెలు... పేపర్లమ్మే కుర్రాళ్లు... సినిమాకాగితాలు అంటించేవాళ్లు... హడావిడిగా వచ్చేపోయేవాళ్లు... ఇదుగో, నేనిక్కడే కూర్చుంటాను... నాజీవితంలో యింతకు ముందెప్పుడూ లేనంత ఆసక్తితో, తీరిగ్గా... నాకళ్లు మండిపోయి, చెవులు చిల్లులుపడి, బుర్రపగిలి పోయేవరకూ, ఇక్కడే కూర్చుంటాను.. ఉత్సాహంతో, ఉద్రేకంతో... కొత్త కేకలు, కొత్త అరుపులు, కూతలు - విసుగులేకుండా వినటానికి సంసిద్ధంగా ఉన్నాను- నీ గంభీరదేహంలో ప్రవహించే రక్తాన్ని పీల్చేందుకు ఈ సజీవ స్వల్పజీవి సిద్ధంగా ఉంది. నా ఆసక్తినంతా నీకర్పిస్తున్నాను... నీ సర్వస్వాన్నీ నాకర్పించు... త్వరపడు... నీలో ఉద్భవిస్తున్న నిత్య నూతన విచిత్రాలను విని ఆనందిస్తాను."

నాలో కలుగుతున్న ఈ ఉద్రిక్తతనుబట్టి, ఈరోజు నాకెంతో ప్రీతికరంగా పరిణమిస్తుందని గ్రహించాను. ప్రయాణమన్నా, నిద్రలేని రాత్రులన్నా నాకు సరదా. అటువంటి సమయాల్లో నాశక్తి రెట్టింపు కావటంకాని, అంతకన్న అధికం కావడంకాని జరుగుతుంది. ఆ సమయంలో నా సంకుచిత జీవనం చాలదనిపిస్తుంది. నాలో కలిగే ఉద్రిక్తతవల్ల, బుడగను ఊది ఊది పెద్దదిగా చేసినట్టు నా శరీరాన్ని విస్తరించాలనిపిస్తుంది. నరాల్లో పటుత్వం ఏర్పడి, శరీరంలోని ప్రతిభాగం శక్తివంతమవుతుంది. కళ్లు తీక్షణంగా అవలోకిస్తాయి. చెవులు శ్రద్ధగా ఆలకిస్తాయి. మనస్సు చురుకుగా పనిచేస్తుంది. నా పరిసరాలకూ నాకూ మధ్య ఏదో సన్నిహిత సంపర్కం ఏర్పడుతుంది. ఎక్కడ వీలైతే అక్కడ ఈ సంపర్కాలను అత్యధికం చేసుకోవాలనే ఆకాంక్ష నాలో ఉత్తేజితమవుతుంది. నా దృష్టిని ఆకర్షించిన దేదైనాసరే విశిష్టమైపోతుంది. కార్ఖానాలో కూర్చుని వడ్రంగిపనిని గంటలకొద్దీ తదేకంగా పరికించగలను. వాళ్లు రంపంతో దూలాలను కోస్తూ, వాటిని సాపు చేస్తూంటే, వాళ్లు పడే కష్టానికి జాలికలుగుతుంది. వాళ్లు పని చేస్తున్నంతసేపూ నా భుజాలు పీక్కుపోతాయి... లేకుంటే, కిటికీ దగ్గర గంటలకొద్దీ నిల్చుని, వీధిలో వచ్చేపోయే ప్రతిమనిషి జీవితాన్నీ మనస్సులో చిత్రించుకోగలను... దారినిపోయే వాణ్నొకణ్నిచూసి, యథాలాపంగా అతడు వెళ్లినచోటికల్లా- కొన్ని మైళ్లైనాసరే- అతన్ని అనుసరించగలను... ఏదో బలీయమైన ఆకర్షణశక్తి, అర్థంలేని ఆసక్తి నన్ను అతనివెంట తీసుకుపోతుంది... అపని చేస్తున్నంతసేపూ, ఎవరైనా ఎరుగున్నవాళ్లు గమనిస్తే, నన్నొక మూర్ఖుడిక్రింద, పిచ్చివాడిక్రింద జమకడతారని

తెలుసును. రంగ స్థలంపైన రమణీయంగా ప్రదర్శింపబడిన నాటకంకాని, ఏదైనా గ్రంథాల్లో హృదయ రంజకంగా వర్ణింపబడిన సాహస కృత్యాలుకాని నన్ను సమ్మోహపరుస్తాయి. ఈ ఉద్ధృత మానసికోద్రేకం, ఈ మిథ్యా దివ్యదృష్టి, ఆకస్మిక స్థలవిభేదంవల్ల కాని, మరేకారణంవల్ల కాని సంప్రాప్తం కావచ్చును. కారణం ఏదైనప్పటికీ, నేనుచిత్రించిన మానసిక స్థితిలో ఉన్నప్పుడు నానిత్య జీవితం ఒక కలలాగ తోస్తుంది. సామాన్య విషయాల గురించిన జ్ఞాపకాలన్నీ నిస్సారంగా, నిరర్థకంగా తోస్తాయి. ఈ అసహజ పరిస్థితిలోనే నాకు పరిపూర్ణత సిద్ధిస్తుంది. జీవితంలోని వైరుధ్యం, దాని వైచిత్ర్యం అర్థమవుతుంది.

ఈ గ్రాహ్యశక్తితోనే, అవకాశం కోసం నిరీక్షిస్తూ, జన ప్రవాహపుటొడ్డుపైన కూర్చున్నాను. నిరీక్షణ దేనికొరకో తెలియదు... కాని, శూన్య దృష్టితో మాత్రం కాదు. నా ఆసక్తిని సంతృప్తి పరచగల సంఘటన ఏదో సంభవించక మానదనే విశ్వాసంపైనే ఆధారపడింది నా అన్వేషణ. కొంతసేపటివరకూ ఏమీ జరగలేదు. అరగంటసేపయే సరికి నా కళ్లు నొప్పులు పెట్టాయి. తదేక దృష్టితో వచ్చేపోయే జనాన్ని చూడటం మూలాన్ని, ఇంక స్పష్టంగా, పరికించి ఎవరినీ చూడలేకపోయాను. ఆ వీధిలో పడుస్తూన్న జనమంతా విలక్షణంగా కనిపిస్తున్నారు... పొడుగువాళ్లూ... పొట్టివాళ్లూ... సున్నితాకారాలూ... స్థూలదేహాలూ... పంచెలూ... పంట్లాములూ... టోపీలూ... తలపాగాలూ... చేతికర్రలూ... గొడుగులూ... మనుషులందరూ మురికినీరులా కొట్టుకు పోతున్నారు... క్రమక్రమంగా మసక మసగ్గా అయిపోతున్నారు. నా దృష్టి మాంద్యం హెచ్చుతున్న కొద్దీ. చెడిపోయిన చెత్త సినిమాచూస్తున్నట్లుతోచి, వినుగెత్తిపోయింది. ఇంక కుర్చీలోంచి లేవబోయాను, తిరిగి దేశాటనానికి ఉపక్రమించే ఉద్దేశంతో. ఆఖరుకి... ఎలాగైతేనేం, కనుక్కున్నాను అతన్ని!

ఆ అపరిచితుడి వైపు నాదృష్టి ఆకర్షింపబడటానికి మూలకారణం- అతను పదే పదే నాకంట పడటమే. ఈ గడచిన అరగంటలోనూ వేలకొద్దీ మనుషులు ఒకమ్మారు కనిపించిన వెంటనే అదృశ్యమైపోయారు- యేదో అవ్యక్త శక్తి వారిని బంధించి లాక్కుపోతున్నట్లుగా. ఒక మనిషి ఆకారం కనిపించిన వెంటనే వాని లోపాలను గుర్తించేలోపల్లే ఓ నీడ... ప్రవాహంతో కొట్టుకుపోయేది మళ్లీ కనిపించకుండా. ఈ మనిషిమాత్రం వచ్చిన చోటికే రావడం, తిరిగివెళ్లడం, రావడం- అందువల్లనే

అతన్ని గుర్తించగలిగాను. సముద్రపుటలలు మొండిగా పట్టుదలగా ఒడ్డుకొచ్చి, వెనుదిరిగిపోయి తిరిగివచ్చినట్లుగానే, ఈ మనిషికూడా జన సమూహంలోంచి రావడం, వెళ్లడం, తిరిగి అక్కడికే రావడం, ఎంతో వినయంగా, మర్యాదగా రాకపోకలు సాగిస్తున్నాడు.

ఇటూ అటూ తచ్చాడుతూండబట్టికాని, లేకపోతే, అతనిలో ఆకర్షణీయమైన లక్షణాలేమీ లేవు- మనిషి ఎండిపోయి నీరసంగా ఉన్నాడు. ఆ డొక్కు శరీరాన్ని వొదులొదులుగా ఉన్న కాకీచొక్కాలో దాచుకున్నాడు. తనకోసం కుట్టించుకున్న చొక్కాలా లేదది. చొక్కాచేతులు అతని చేతులకన్న చాలా పొడుగ్గా వున్నాయి. దానికి తోడు క్రీదం- నల్లని గళ్లలుంగీ. చూట్టానికి చుంచులా వున్నాడు. ఆ పల్చని పెదవులను మరింత అందవికారం చేస్తూ బొద్దింకలాంటి మీసం, కొబ్బరిపీచులా గడ్డం. అతని నడవడి కూడా అపసవ్యంగా ఉంది. సన్నని నడుమ్మీంచి జారిపోతోన్న లుంగీని మాటిమాటికీ బిగదీసుకుంటూ, కుందేలుపిల్లలా బిడియపడుతూ, చుట్టుపక్కల జాగ్రత్తగా చూసుకుంటూ తలవంచుకొని సమూహంలో కలిసిపోతున్నాడు.

ఈ బికారివేషంలో ఉన్న వాడిగురించి నాకు తట్టిన మరోవిషయం ఏమిటంటే, అతనికి దృష్టిదోషం బాగా ఉందేమోనని. ఎంచేతనంటే, ఇటూ అటూ పనితొందరలో పోయేమనుషులు ఆ మానవాకారాన్ని ఢీకొనబోయి వెంటనే సర్దుకుని వెళ్ళిపోతున్నారు. ఆ పొరపాట్లను అతను యేమాత్రం పట్టించుకోకుండానే తలవంచుకొని మర్యాదగ మాయమైపోయి, పునరుద్భవిస్తున్నాడు.

ఈవిధంగా జరగటం పదిపన్నెండుసార్లు గమనించి ఉంటాను- నేనా హోటల్లో కూర్చున్న అర్ధగంట సేపటిలోనూ.

ఇహ నాలో కుతూహలం రేగింది. అంతటితో ఆగక, నామీద నాకే చిరాక పుట్టింది- అంతసేపు పరిశీలించి ఆ మనిషి ఇంతకీ దేనికోసం తాపత్రయపడుతున్నా తెలుసుకోలేక పోయినందుకు. బుర్ర చించుకుంటున్నకొద్దీ నా ఆసక్తి మరిం ఉధృతమవుతోంది. "నీక్కావల్సిందేమిటిరా, బాబూ?" అనుకున్నాను. "దేనికోస చూస్తున్నావు? ఎందుకలా అక్కడే తచ్చాడుతున్నావు? నువ్వు, చూస్తే, ముష్టివాడి కనిపించడం లేదు." ఆ ముష్టివ్యాపారం చేసేవాడైతే అంతమంది జనం ఉండేచో చిల్లిదమ్మిడీ సంపాదించకుండా ఊరుకుంటాడా? పోనీ, కూలిపని చేసు

బ్రతికేవాడిలా లేవు... అటువంటివాడివే అయితే, యిలా ఊరికే కాలాన్ని వృథాపుచ్చుకునేందుకు తీరిక ఎక్కడుంటుంది! ఏ అమ్మాయికోసమయినా ఎదురు చూస్తున్నావా అంటే, నీవంటి కొండముచ్చు దగ్గరికి రావటానికి వయస్సు మళ్ళిన కురూపి కూడా ఒప్పుకోదు- ఏమిటీ నువ్వాడేనాటకం?- 'సిటీగైడ్' అని పెద్దపేరు పెట్టుకొని, ఏవో చెత్తఫోటోలు నాలుగు దగ్గర పెట్టుకొని, మద్రాసు నగరంలోని వింతలూ .విశేషాలూ చూపిస్తామని చెప్పి, నందులూ గొందులూ చూపించే వాళ్లల్లో నువ్వుకూడా జమకావుకదా? అబ్బే, అదీ నీకు వర్తించదు. నువ్వొక్క మానవమాత్రుణ్నికూడా పలకరించగా చూళ్లేదునేను. బహుశ్శా, నిన్నెవరూ గుర్తించకుండా, నిన్నెవరూ పలకరించకుండా ఉండాలనే నీ ఉద్దేశమనుకుంటాను- ఏమిటిరా, నా కన్నుగప్పి నువ్వు చేసేది?'' క్రమక్రమంగా నా పరిశీలన పరిశోధనగా పరిణమించింది. అయిదు నిముషాలయేసరికి, ఆ గళ్లలుంగీ- కాకీచొక్కా వెధవ నడివీధిలో చెయ్యదలుచుకున్నదేమిటో కనుక్కోవడం నా ముఖ్య కర్తవ్యమైపోయింది. చటుక్కున స్ఫురించింది- అతడొక సి.ఐ.డి. అని !

అవును, అతని కాకీచొక్కాయే చెబుతోంది అతను పోలీసుశాఖకి చెందినవాడని. మరింత దీక్షగా అతని చర్యలను పరిశీలించాక నా అభిప్రాయం బలపడింది. ఓరగా, చురుకుగా పరికిస్తున్నాడతను- వచ్చేపోయే ముఖాలను. పోలీసు ఉద్యోగి మొదటి సంవత్సరం తర్ఫీదులో- తననెవరూ గుర్తించకుండా తనుమాత్రం ఎదుటి మనిషిలోని ముఖ్యలక్షణాలను క్షణంలో గ్రహించే నేర్పును అలవరచుకోవాలి. అవిధంగా ఒక్కక్షణంలో కనిపించిన వ్యక్తి ధరించిన దుస్తులను, ముఖలక్షణాలనూ, నడవడినీ, తదితర ప్రత్యేక లక్షణాలనూ పరిశీలించి, ఆ వ్యక్తిని తన మనస్సులో ఉన్న అపరాధితో పోల్చుకోవడం-అదేమంత సులభం కాదు. అందులో ఒకటి మాత్రం ముఖ్యం- తను పరిశీలిస్తున్న వ్యక్తికి మాత్రం ఏవిధమైన అనుమానమూ కలగకుండా ఉండేట్లు వ్యవహరించాలి. ఆ మనిషిని, చాటుగా కూర్చుని పరిశీలిస్తున్న నాకే ఆవిద్య తెలిసిపోయింది. ఎంతో నిర్లక్ష్యంగా నడిచాడు సమూహంవైపు- దారిలో జనం ఇష్టం వచ్చినట్లు ఢీకొంటున్నా లెక్కచెయ్యకుండా. అయితే, అతను మాత్రం అర్ధనిమీలిత నేత్రాలతో ఎదురయిన ప్రతివ్యక్తి ప్రతిబింబాన్నీ గమనిస్తూనే ఉన్నాడు. అతని చూపులోని చాకచక్యాన్నెవరూ గుర్తించనేలేదు. నేనైనా, [illegible] పరిశీలించే

దృష్టితోనే కూర్చుండిఉండకపోతే, ఆ విషయాన్ని నామట్టుకు నేను గ్రహించగలిగేవాణ్ణి కాదు.

ఆ మామూలు దుస్తుల మనిషి తన విద్యలో నేర్పరి అయివుండాలి. తాను తలపెట్టిన భయంకర కృత్యాన్ని కప్పిపుచ్చుతూ, దేశదిమ్మరికి తగిన దుస్తులుధరించి, ఎంత సహజంగా అనుకరిస్తున్నాడు! సాధారణంగా, పోలీసు ఉద్యోగులు మామూలు దుస్తులు ధరించినప్పుడు కూడా వారిలో పోలీసు లక్షణాలు మరుగుపడవు. వారి నడవడిలో దర్జా, నడవడిలో హోదా కనిపిస్తూనే ఉంటాయి. వారి వెన్నువంగదు. ఏళ్ల తరబడి పేదరికాన్నీ, కష్టాలనూ జీర్ణించుకున్నవారి కుండే వినమ్రత వీరి కుండదు. ఇప్పుడీమనిషి మాత్రం బికారి వేషాన్ని వేసుకుని, ఆపాత్రను పోషించటంలో పరిపూర్ణుడైయాడు. అతను వస్త్రధారణలో ఎంతశ్రద్ధ వహించాడు! తన బికారివేషంలో సహజత్వం సిద్ధించేందుకు, చేతులచివర, కాలరుచివర పాతబడి, పోగులు ఊడిపోతున్న చొక్కావేసుకున్నాడు. లుంగీ ధుమ్ముకొట్టిపోయింది. అతనొక గొప్ప మనస్తత్వవేత్త అయివుండాలి. తిండిలేక ఎండిపోయిన ఎలుకలాగ, పేదరికం, బట్టలు చివర్లని కొరుక్కు తినటంతో ప్రారంభమవుతుంది. పేదరికాన్ని సూచించే ఈ పాతబట్టల కనుగుణంగా తన ముఖ లక్షణాలను మార్చుకోవటంలో కూడా అసాధారణమైన ప్రజ్ఞ చూపించాడు. మాసిపోయి బిరుసెక్కిన కొబ్బరిపీచులాంటి గడ్డం, బొద్దింకమీసం, (బహుశా తుమ్మజిగురుతో అంటించుకుని ఉంటాడు). సంస్కారంలేని శిరోజాలు- వీటన్నిటికీ తోడు ఖంగుమంటూ దగ్గు. తొడుక్కున్న వదులు చొక్కాను ఉండుండి దగ్గరికి లాక్కుంటున్నాడు- చలిగాలి భరించలేక పోతున్నట్లు విసిగిపోయి నీరసంగా నడుస్తున్నాడు. మొత్తంమీద గుండె జబ్బు మనిషిలా కనిపిస్తున్నాడు.

చెప్పొద్దూ, యీరహస్యాన్ని కనిపెట్ట గలిగినందుకు నన్ను నేనే అభినందించు కున్నాను. ఒక పరిశీలకుణ్ని పరిశీలించ గలిగినందుకూ ఒక పరిశోధకుణ్ని పరిశోధించ గలిగినందుకూ ఆనందించాను. అయితే, నా మనస్సులో మరోమూల కోపం లేకపోలేదు. అంత చక్కటి సాయంకాలం, సూర్య భగవానుడు శ్రావణ సౌందర్యాన్ని సుహృదయంతో ప్రపంచానికి ప్రసాదిస్తుంటే, ప్రభుత్వపు నౌకరొకడు మారువేషంలో ఓ నిర్భాగ్యజీవిని లాక్కుపోయి ఖైదు చెయ్యటానికి వేటాడుతూంటే నాలో జుగుప్స పుట్టింది.

ఏమైనా, నీతి నియమాలకన్న కుతూహలమే తన ఆధిక్యాన్ని నిరూపించుకుంది.

ఆ మనిషి చర్యలను సావధానంగా నిస్సంకోచంగా పరిశీలించడం కొనసాగించాను.

కొంతసేపటికి హరాత్తుగా, నా పరిశోధనవల్ల కలిగిన ఉత్సాహమంతా పటాపంచలైంది. అకస్మాత్తుగా కారుమేఘాలు సూర్యబింబాన్ని కప్పివేస్తే, అంతవరకూ ఉన్న వెచ్చదనం విచ్ఛేదమై శైతల్యం ఆవరించినట్టుగా, నా పరిశోధనలో ఏదో పొరపాటుందని గ్రహించాను. ఏదో వైరుధ్యం కనిపించింది- నా పరిశీలనలో. మళ్లీ సందేహం వచ్చింది- అతను నిజంగా సి.ఐ.డి. యేనా అని. ఆవిచిత్ర వ్యక్తిని తీక్షణంగా పరీక్షిస్తున్న కొద్దీ, అతనిలోని పేద లక్షణాలు అత్యంత సహజంగా కనిపిస్తూ, ఓ పోలీసు ఉద్యోగి ప్రచ్ఛన్న వేషంలో అంతసహజంగా ఉండటం అసంభవమనిపిస్తోంది. ముఖ్యంగా ఆ మురికి చొక్కాకాలరు! అంతకన్న మంచి దుస్తులున్న ఏ మనిషీ అటువంటిదాన్ని తన మెడకు తగిలించుకోలేడు. ఇంక, చెప్పులు- నిజంగా వాటిని ఆ పేరుతో పిలవాల్సివస్తే- ఆకారం లేకుండా ఉన్నాయి. అడుగు వేసినప్పుడల్లా అడుగునుంచి మట్టిలేచి పాదంపైన పడుతోంది. ఎంత ముఖ్యమైన కపటవేష ధారణకైనప్పటికీ అటువంటి చెప్పులెవరు వేసుకుంటారు! ఎంతచూసినా, అటువంటి దరిద్ర నారాయణుడు పోలీసు ఉద్యోగి అయివుంటాడనే అభిప్రాయాన్నింక బలపరచుకోలేకపోయాను. ఎందుకీ అంతులేని రాకపోకలు? వచ్చేపోయే నానా రకాల మనుషులకేసీ ఎందుకా దొంగచూపులు చూడటం? అతని సమస్యని పరిష్కరించలేకపోయినందుకు నాకు ఒళ్లు మండింది. వాణ్ని భుజం పట్టుకుని "ఏమిటిరా, ఏం చేస్తున్నావిక్కడ? నీకేంపనిక్కడ?" అని నిలదీసి అడుగుదామన్నంత ఉద్రేకం కలిగింది.

మళ్లీ మనస్సులో ఒక మెరుపు మెరిసింది. ఈసారి నా నిర్ణయానికి తిరుగులేదు. గురిచూసి కొట్టాను. వాడు అపరాధ పరిశోధకుడు కానేకాడు! అంత తెలివితక్కువగా ఎలా ఆలోచించానో! వాడు (ఆమాటలు సరియైనవవునో కాదో కాని)... పోలీసు ఉద్యోగికి సరిగ్గా వ్యతిరేకం... వాడు నేరస్థుడు... జేబుదొంగ... అదే వ్యాపారంగా పెట్టుకున్న, వాస్తవమైన, అనుభవజ్ఞుడైన జేబుదొంగ... నడివీధిలో వచ్చేపోయే వాళ్ల పర్సులూ, చేతిసంచులూ, గడియారాలూ, ఆ సమయానికి ఏత్సృణమో, ధనమో- దొరికినవల్లా కొట్టెయ్యటానికి అక్కడికిచేరి ఇటూ అటూ తచ్చాడుతున్నాడు. 'అదే అతని వ్యాపారం.

జనం మరీ గుంపుగా చేరినచోటికే చొరబడుతూండటం గమనించి, వాడు జేబుదొంగ అని గ్రహించాను. వాడి మోటుతనం, అస్తస్తమానూ వచ్చే పోయేవాళ్లను ఢీకొనటం, ఆ ఢీకొన్నప్పుడు తన నేర్పును వినియోగించటం- అంతా అర్థమైంది. క్రమేంగా పరిస్థితి విశదమవుతోంది. ఆఖరికి ఇప్పుడవగాహన అయింది- వాడు, వీధి చివర హోటలు ఎదుట దుకాణాలున్న చోటు ఎందుకు ఎంచుకున్నాడో. ఆ ప్రదేశం ఎప్పుడూ ఉండనంత కిటకిటలాడుతోంది వచ్చేపోయే జనంతో. వాళ్లంతా అక్కడున్న కొట్టుదగ్గర మూగుతున్నారు. ఇంతాచేసి ఆ దుకాణంలో అమ్మే వస్తువులు కూడా విపరీతమైనవి కావు. మామూలు కొబ్బరికాయలు, అగరువత్తులు, ఇంకా రకరకాల పూజాసామగ్రి, తదితర చిల్లర వస్తువులు ఉన్నాయంతే. కాని తన దుకాణాన్ని ఆకర్షణీయంగా చెయ్యాలని కొట్టు కిటూ అటూ గెలలతోవున్న అరటిచెట్లుపెట్టి, మామిడి తోరణాలుకట్టి, రంగు రంగుల కాగితంపువ్వులూ, బుట్టలూ వ్రేలాడదీశారు. ఈ హడావిడి అంతా వినాయకచవితి కోసం. వీటన్నిటిమాటా అటుంచి, మరో ప్రక్కన కిటికీ దగ్గర బోనులో మూడు కోతుల్ని పెట్టాడు. అవి తమ అపక తపక చేష్టలతో ప్రజలను సంతోషపెడుతున్నాయి. పథకం ఫలించింది. ఆకొట్టు ముందర నిత్యం జనం గుంపులు గుంపులుగా చేరుతున్నారు. ముఖ్యంగా స్త్రీలు- సంతోషంతో కేకలు పెడుతున్నారు. పూర్వం తమ పురుషులు ఏవిధంగా తోకలాడించుకుంటూ నగ్నంగా విహరించేవారో యీ కోతులు ప్రదర్శిస్తుంటే చూడటం స్త్రీలకు ముచ్చటగా ఉందేమో.

ఈ దృశ్యాన్ని నోరుతెరుచుకుని తేరిపార చూసేరకం మనుషులు గుమిగూడి నప్పుడు అవకాశం చూసుకుని, నా కాకీచొక్కా భాయి ఆగుంపులోకి చొచ్చుకుని ప్రవేశిస్తున్నాడు. ఇంతకుముందెంతో మంది, జేబుదొంగల్ని గురించి రాసే ఉంటారని నాకు తెలుసుగాని, జేబుదొంగతనంలోని నేర్పును వివరంగా వర్ణించటం ఎంతైనా అవసరం. నాకు తెలిసినంత వరకూ, చిరుచేపల ఉత్పత్తికి మెరక ప్రదేశం ఎంత అవసరమో నేర్పరి అయిన జేబుదొంగకికూడా జన సమూహాలంత అవసరం. జనసమ్మర్దంలో ఉన్నప్పుడే, ఏమనిషికైనా తన పర్సుని కాని, గడియారాన్ని కాని కాజేస్తున్న హస్తాన్ని గుర్తించటం అసాధ్యమవుతుంది. అంతే కాకుండా, జేబుదొంగ తనకు కావలసిన వ్యక్తి దృష్టిని మరోవైపుకి తిప్పి, అధమరుపుగా ఉండేట్లు చేస్తేగాని, వేసుకున్న పథకం ఫలించదు. లేకుంటే ఈ దోపిడీ ప్రపంచంలో ప్రతి మనిషీ తన వస్తువులను అత్యంత శ్రద్ధతో జాగ్రత్తగా చూసుకుంటూ ఉంటాడు. ఏవీధిలోనైనా

అగ్ని ప్రమాదం సంభవించినప్పుడు జేబుదొంగల పంట పండుతుంది. ఇప్పుడీ అగ్ని స్థానాన్ని కోతులు ఆక్రమించాయి. నవ్వుపుట్టించే వాటి చిలిపి చేష్టలూ, అర్థంబర్థం లేని వికారచేష్టలూ, నాకొత్త నేస్తం - జేబుదొంగకి అప్రయత్నంగా, దైవికంగా తోడ్పడ్డాయి.

క్షమించాలి, ఈ పరిశోధనలో పరవశత్వంపొంది, ఉత్సాహాన్ని అణచుకోలేక పోతున్నాను. జేబుదొంగ సందర్శనం ప్రప్రథమంగా లభ్యమైంది నాకు. పరిస్థితులు కూడా అపూర్వంగానూ, ఉత్సాహ జనకంగానూ ఉన్నాయి... కాదు... కాదు... సరిగ్గా చెప్పాలంటే, ఇది నా ద్వితీయానుభవం. నేను చదువుకుంటున్న రోజుల్లో తర్కశాస్త్రం నేర్చుకుంటూ, న్యాయస్థానానికి అప్పుడప్పుడు వెడుతుండేవాణ్ని. ఓసారి అక్కడ, రాగిరంగు రేగిన జుట్టుతో ఉన్న మొటిమలముఖం వాణ్నొకణ్ని పోలీసువాళ్లిద్దరు తీసుకొచ్చి బోనులోకి ఎక్కించారు. బల్లమీద ఒక పర్సుఉంది. సాక్ష్యానికొచ్చినవాళ్లు ఒట్టేసి చెప్పారు వాడు జేబుదొంగతనం చేశాడని. న్యాయాధికారి ఏవో రెండు ముక్కలు చెప్పాడు. వెంటనే ఆ రాగిజుట్టు మనిషిని తీసుకుపోయారు. ఆరునెల్ల కారాగారవాసం విధించారతనికి. జేబుధొంగని చూడటం అదే మొదలు. అయితే, ఇప్పటి పరిస్థితికీ దానికీ చాలా విభేదం ఉంది. ఇంతకుముందు నేను అసలైన జేబుదొంగని చూళ్లేదు. ఓ మనిషిని బోనులో కెక్కించి, ఇద్దరు సాక్షులిచ్చిన హామీపైన వాణ్ని జేబుదొంగగా నిర్ణయించినప్పుడు చూశానంతే- కాని, ఆ దుష్కృత్యాన్ని చూడనే లేదు. ఒక మనిషి పైన నిందమోపబడినప్పుడూ, శిక్ష విధింపబడినప్పుడూ చూశాను గాని, ఆ దొంగ తన విద్యను వాస్తవంగా ప్రయోగించినప్పుడు పరికించలేదు. అంచేత నేను దొంగనెప్పుడూ చూడలేదన్నమాట. దొంగ అన్నమాట యెప్పటికైనా దొంగతనం చేస్తున్నప్పుడే దొంగవుతాడు కాని, ఆ తరువాత ఎప్పుడో తనుచేసిన నేరానికి సమాధానం చెప్పుకోవలసి వచ్చినప్పుడు కాదు. ఒకవి అయినా అంతే- కావ్య నిర్మాణం చేస్తున్నప్పుడే కవి అవుతాడు కాని, ఆ తర్వాత కొన్నేళ్లకి సభాసదుల సమక్షంలో కావ్యగానం చేసినంత మాత్రాన కవికాడు. ఒక కళాకార్షుడైనా అంతే. తన కళను సాధకం చేస్తున్నప్పుడే కృషికుడవుతాడు. బహుశా నాకిప్పుడా విచిత్రక్షణం యొక్క కటాక్షం లభిస్తుందేమో. ఒక జేబుధొంగ పనిచేస్తూంటే నేనిప్పుడు చూడాలి. అతని వ్యక్తిత్వాన్ని వాస్తవంగా చూడాలి. దొంగలిస్తున్న సమయంలో అతని నిజస్వరూపాన్ని

గమనించాలి., అట్టి అపూర్వ అవకాశాలు అందరికీ లభ్యం కావు. మానవ జననంవంటి మహత్తర సన్నివేశాలు ప్రజలకంట బడవు. ఆ అవకాశం నన్ను పులకింప జేసింది.

నాకు లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవటానికే నిశ్చయించుకున్నానని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. ప్రారంభదశలోని అతిస్వల్ప విషయాలను కూడా నేను నిర్లక్ష్యం చెయ్యకూడదు. ఆ అపూర్వ క్షణాన్ని అంతకన్న వదులుకోకూడదు. ఈ హస్తకళలోని వైచిత్ర్యాన్నంతా విస్పష్టంచెయ్యాలని నిశ్చయించుకున్నాను. హోటలులో నేను కూర్చున్నస్థలం పర్యవేక్షణ కనువుగా లేదు. ఆ చోటు వదిలేశాను. మరోచోట, ఏ అడ్డులేని చోట ఉండి, నేను కొత్తగా కనిపెట్టిన కళాకారుని చర్యలన్నిటినీ దీక్షగా పరిశీలించాలని హోటలుబయటికి వచ్చేసి రోడ్డుపక్కగా నిలబడ్డాను - అక్కడ గోడమీద ఉన్న సినిమాపేర్లూ, బొమ్మలూ అవీ చూస్తున్నట్లు నటిస్తూ. నిజానికి నేను నా చంచలహస్తాల నేస్తాన్ని కనిపెట్టని క్షణంలేదు. ఆవిధంగా కాపలాకాస్తూ గంటసేపు పైగా అక్కడ నిలబడ్డాను. ఆ పాముతలకాయగాడు, పాచికలు వేస్తూనే ఉన్నాడు. తన భయంకర వ్యాపారాన్ని సాగించేందుకు మరింత శ్రద్ధగా, మరింత దీక్షగా పరిశీలిస్తున్నాడు. మొట్టమొదటిసారి ఎంతో గొప్పగా చెప్పుకున్న సినిమాని కూడా నేనంత దీక్షగా చూడలేదని బాగా జ్ఞాపకం. ప్రగాఢవాస్తవికత పరిపూర్ణ లలితకళకన్న అతీతం. సత్యం కలకాలం వర్ధిల్లాలి!

సాయంకాలం అయిదుగంటలునుంచి ఆరింటివరకూ వీధిలో నిలబడి కాలాన్ని మెరుపువేగంతో గడిపివేశాను. బిగువైన సన్నివేశాలతో, అసంఖ్యాకమైన నిర్ణయాలతో, సంఘటనలతో నేను గడిపిన ఆ గంటసేపునీ వర్ణిస్తూ కొన్ని గంటలసేపు చెప్పగలను. నన్ను ఆ సమయంలో ఎదుర్కొన్న నిరంతర అపాయాలు నా నరాల్లోని బలాన్నంతా స్వాధీనం చేసుకున్నాయి. ఇంతకుముందెన్నడూ నాకింత స్పష్టంగా తెలియదు- పడివీధుల్లో నిండు వెలుగులో జేబుదొంగతనం ఎంత క్లిష్టమో, ఎంత భీతావహమో నా కవగతమైందప్పుడు. ఇంతవరకూ నేను, జేబుదొంగతనానికి ధైర్యమూ, మాంత్రికుడికి మల్లే హస్తలాఘవమూ ఉంటే చాలుననుకున్నాను.

జేబుదొంగకి మామూలుకంగా కొన్ని లక్షణాలుండాలి. మనస్థైర్యం, ఏకాగ్రత, (అన్నిటికన్నా ముఖ్యం) ధైర్యసాహసాలూ ఉండితీరాలి. అంతేకాదు. ఉదాసీన స్వభావుడై ఉండాలి. చురుకుగా ఆలోచించగలగాలి. శస్త్రవైద్యునికి మల్లే అమోఘమైన

అవధారణ శక్తి జేబుదొంగకుండాలని, ఇరవైనిముషాలసేపు పరిశీలించినమీదట తెలిసింది. గాయపడ్డ హృదయానికి కుట్లు వేస్తున్నప్పుడు క్షణం ఆలస్యం అయినా అపాయకరమే. అయితే, అటువంటి శస్త్రచికిత్స చెయ్యటానికి ముందు రోగికి మత్తుమందిచ్చి, అతనికి నిరోధించేశక్తి లేకుండా చేస్తాడు వైద్యుడు. కాని జేబుదొంగ మాత్రం శస్త్రచికిత్సను మెరుపులా చేసెయ్యాలి- ఆ మనిషి స్పృహతో ఉండగానే, పైగా చికిత్స చెయ్యవలసిన స్థలం ఎప్పుడూ అతి సున్నితంగా ఉంటుంది.

ఇక అటువంటి ఉద్రిక్తక్షణంలో జేబుదొంగ వీలైనంత వేగంగా చికిత్స చేస్తున్నప్పుడు, ఆ ఉద్రేకం కాని ఆవేశంకాని అతని ముఖంమీద ప్రస్ఫుటం కాకూడదు. అతని ముఖం ప్రశాంతంగా, నిర్లక్ష్యంగా, నిరాసక్తంగా ఉన్నట్లుండాలి. కాని ఎంత మాత్రం తన ఆవేశాన్ని బయట పెట్టుకోకూడదు. క్రూరహంతకుడిలా కత్తిపోటు సమయంలో కన్నుల్లో కాంతి రానివ్వకూడదు. తనకు దొరికిన ఎరను పట్టుకోవటానికి చెయ్యి చాపినప్పుడు దొంగ చూపులు మాత్రం స్నేహపూర్వకంగా, మర్యాదగా ఉండి, ఒకవేళ అవతలివాణ్ని పొరపాటున కుదిపినట్లయితే వెంటనే సర్దుకుని వినయంగా క్షమాపణ చెప్పుకోవటానికి సిద్ధంగా ఉండాలి. కార్యనిర్వహణ సమయంలో దొంగ చురుకుగానూ, శాంతంగానూ ఉన్నంత మాత్రాన సరిపోదు. అంతకు ముందునుంచీ అతను తన తెలివితేటల్ని, మానవస్వభావం గురించి తనకున్న పరిజ్ఞానాన్ని వినియోగించి తను ఎంచుకున్న వ్యక్తి శారీరకంగానూ, మానసికంగానూ తన మోసానికి తగునో కాదో తెలుసుకోవటం అతని విధి. పరధ్యానంగా ఉన్నవాళ్లూ, నిర్లక్ష్యంగా ఉన్నవాళ్లూ ఇందుకు తగిన మనుషులు. వారిలో కూడా, తొడుక్కున్న కోట్లుకి బొత్తాలు పెట్టుకోని వాళ్లనీ, హడావిడిలేకుండా తాపీగా నడుస్తున్నవాళ్లనీ సులభంగా సాధించవచ్చు. ఒక గంట తీవ్ర పరిశోధన నాకు నేర్పినదేమిటంటే- ఓ వందమందిలో... ఒక్కొక్కప్పుడు అయిదువందల మందిలో ఒకళ్ళిద్దరికన్న ఎక్కువ ఉండరు. జేబుదొంగకి సరిపడినవాళ్లు అటువంటి అపూర్వ అవకాశాల్లోనే దొంగ తెలివితేటలు అతని వృత్తికి వినియోగ పడతాయి. అప్పటికీ, అతని ప్రయత్నం ఫలించకపోవచ్చును. దొంగ విజయం సాధించాలంటే అతనికి అనేక పరిస్థితులు కలిసిరావాలి సమయానికి. దొంగ తన పథకాన్ని ప్రయోగిస్తున్నప్పుడు తననెవ్వరూ కనిపెట్టకుండా మాయంకావాలి. దీన్నిబట్టి జేబుదొంగకి ఎంత అనుభవం, ఆత్మబలం, ఎంత పరిశోధనాపటిమ అవసరమో తెలుస్తుంది. ఎవరైనా పోలీసువాడుగాని, గూఢచారికాని ఏమూలనుంచైనా

కనిపెడుతూ ఉండొచ్చు. దొంగల్ని పట్టుకోవటానికి అధికారరీత్యా నియమితులైన వారిమాట అటుంచి, వీధుల్లో ఎంతో మంది జనం ఉంటారు. అందులో కొందరు నాకు మల్లే ఎదుటివారి వ్యవహారాల్లో కుతూహలం పెంచుకొని సంతృప్తిపడే వారుంటారు. ఇటూ అటూ దుకాణాల్లో బోలెడు అద్దాలుంటాయి. వాటిల్లో అతని చేష్టలు ప్రతిబింబించవచ్చు. ఆ విషయం అతనికి తెలియక పోవచ్చును. అద్దాలేకాకుండా, కొట్లలో కిటికీల గాజుతలుపులు మరీ ప్రమాదకరం. కొట్లో గుమాస్తాలుగాని, కొనుక్కోవటానికి వచ్చినవారుగాని యథాలాపంగా ఆగాజు తలుపులోంచి చూసినప్పటికీ అతని దొంగతనం బయటపడిపోతుంది. అతను పడవలసిన బాధ దుర్భరమూ, అపాయకరమునూ. ఒక్క అపరాధానికి కొన్ని సంవత్సరాలు చెల్లించవలసి ఉంటుంది. చేస్తున్నప్పుడు చెయ్యి వణికినా, కొంచం బలంగాలాగి, మనిషిని కుదిపినా, బంధింపబడడం ఖాయం.

నడివీధిలో నిండు వెలుగులో జేబుదొంగతనం చెయ్యడం ధైర్యసాహసాలతో కూడిన ఆ మానుషులకు గాని సాధ్యం కాదు. జేబుదొంగతనం ఎంతో నీచమైన నేరం అన్నట్లు దాని గురించి వార్తాపత్రికల్లో రెండు ముక్కల్లో తేల్చిపారేస్తూ ఉంటారు. అది చాలా అన్యాయం అనిపించింది నాకా శ్రావణ మాసపు సాయంకాలం వేళ. విమానవాహకుడికి ఎంత ధైర్యమూ, పరిజ్ఞానమూ అవసరమో, క్లిష్ట పరిస్థితిలో ఒక చేతి గడియారాన్ని కాని, జేబులోని పర్సునిగాని దొంగిలించడానికి కూడా అంత అవసరం. సైనిక, రాజకీయ వ్యవహారాల్లో కన్నా ఎక్కువ వ్యవహార నిపుణత కావలసి ఉంటుంది. ఒకవేళ ప్రపంచం, అద్భుత దృశ్యాలను, వాటి ఫలితాలను బట్టి కాకుండా, వాటిని సాధించడానికి వ్యయ పరిచే నరాల బలాన్ని బట్టి నిర్ణయించినట్లయితే, (నీతి నియమాలను అతిక్రమించడం మాట అటుంచి) ఈ వీధి దోపిడీదారుల చర్యల్ని బహిరంగపరచడంలో అంత దురహంకారం ప్రదర్శితం కాకపోవును. అన్ని రకాల హస్తకళల్లోకీ గౌరవనీయమైనవి కాని, మరేరకమైనవి కాని ఈ లోకంలో జరుగుతున్న హస్తకళలన్నిటికన్నా ఇప్పుడు నేను గమనించినదే ఎక్కువ కష్టమైనది, అపాయకరమైన దీనా. ఇది కనుక పరిపూర్ణంగా రూపొందినట్లయితే లలిత కళల్లో కలుపుకోవచ్చును. మద్రాసులో ఆ శ్రావణ మాసంనాటి నా అనుభవం, పరిశోధనల ఫలితంగా ఈ అభిప్రాయాలు నాలో స్థిరపడిపోయాయి.

అనుభవం ఒక్కటేకాదు... పరిశోధన ఫలితమే కాదు... ఒకవిధంగా భాగస్వామ్యం

కూడా. నా ఖాకీచొక్కా నేస్తాన్ని కొంచెంసేపే శాస్త్రజ్ఞుడి దృష్టితో పరిశోధించాను. తీవ్ర విమర్శ ఎప్పుడూ సానుభూతిని ప్రేరేపిస్తుంది. క్రమక్రమంగా, ఉద్దేశపూర్వకంగా కాకుండా, అనాలోచితంగా నన్ను ఆ దొంగతో సమైక్యం చేసుకోవడం, అతని శరీరంలో ప్రవేశించి, అతని హస్త చలనంలో సంలీనం కావడం జరిగిపోయింది. ప్రేక్షకుడిగా ఉండడానికి బదులు మనోలోకంలో, నేనే కర్తనయాను. ఓ పావుగంట గడిచేసరికి నా ప్రవర్తన నాకే ఆశ్చర్యం కలిగించింది. నాఅంతట నేను వచ్చేపోయే మనుషుల్ని తగినవాళ్ళవునా, కాదా అని పరీక్షించడం ప్రారంభించాను. వారి కోట్లకి బొత్తాలు పెట్టి ఉన్నాయా, లేదా, పరధ్యానంగా ఉన్నారా, జాగ్రదావస్థలో ఉన్నారా, దగ్గరేమైనా నోట్లకట్టలున్నట్లు సూచనలేమైనా ఉన్నాయా.... నా నేస్తం యొక్క నేర్పుకి ప్రతిఫలం లభిస్తుందా? జరుగనున్న సమరంలో తటస్థంగా ఉండడానికి బదులు, నేను హృదయ పూర్వకంగా అతనికి మంచి అవకాశం లభించాలని వాంఛిస్తున్నట్లు స్పష్టమైపోయింది. అతనికి శాయశక్తులా సహాయం చెయ్యాలనే హృదయారాటాన్ని బలవంతంగా అణచుకున్నాను. ఏదైనా మంచి అవకాశం వచ్చినప్పుడు అతను గ్రహించలేదని తోస్తే, ఇక్కడ నుంచి "అడుగో... అడుగో... నీక్కావలసిన మనిషి... ఆ లావుటాయన... చేతుల్లో పెద్ద పెద్ద పువ్వుల గుత్తులు పట్టుకుని వెడుతున్నాడేం... అయనే..." అని సైగచేయాలనే వాంఛ మాత్రం బలీయంగానే ఉంది.

ఓసారి, దొంగ జనసమూహంలోకి తోసుకొని వెళ్ళాడు. సరిగ్గా అదే సమయానికి పోలీసు వాడొకడు అటువైపుకి వచ్చేసరికి నాకాళ్ళు గజగజ వణికిపోయాయి. వాడు నన్నే పట్టుకుంటాడేమోనన్నట్లు. అతని భుజంమీద... కాదు... నా భుజం మీద ఏదో బరువైన హస్తం పడినట్లు అనిపించింది. అప్పుడు (హమ్మయ్య!) ఆ జేబుదొంగ ఏమీ దొంగిలించడానికి ప్రయత్నించకుండా, న్యాయదేవత నౌకరు కంటబడకుండా ఎలాగో జనం ఒత్తిడి నుంచి తప్పించేసుకున్నాడు. ఇదంతా ఉత్సాహజనకంగానే ఉంది. కానీ, అనుకున్నంత ఉత్సాహకరంగా లేదు. ఆ దొంగతో నన్ను నేను సమైక్యం చేసుకుంటున్నకొద్దీ, అతనింకా అసలు దెబ్బకొట్టలేదనే బాధ నాలో అధికమై పోతోంది... అయిందానికి, కానిదానికి అతనంత సందేహిస్తుంటే, నాకు ఒళ్ళు మండి పోయింది. "ఏమిటిరా. మొద్దూ, గుండె దిట్టంచేసుకుని మనికి ఉపక్రమించవేం! ఏదో ఒక అవకాశాన్ని వినియోగించుకో... ప్రయత్నించి చూడు... నీకా విద్య తెలుసునంట

టానికి నిదర్శనంగా అయినా ఏదో ఒకటి చెయ్యవేం?"

అదృష్టవశాత్తూ, నేనతని చర్యల్లో శ్రద్ధవహిస్తున్నానని ఊహించుకోనైనా లేని నా మిత్రుడు నా అసహనానికి కించిత్తు చలించలేదు. అదే, అనుభవజ్ఞుడైన నిపుణుడికీ, తెలిసీ తెలియని వాడికీ తేడా. ఘనవిజయం సాధించటానికి పూర్వం ఎన్ని ప్రయత్నాలు విఫలమవుతాయో నిపుణుడికి తెలుసు. ఆఖరున, ఆ అపూర్వ అవకాశం లభించేవరకూ ఓర్పువహించే నేర్పు అతనికి ఉంటుంది. కవి, తన మనస్సులో అసంఖ్యాకంగా వచ్చే వివిధభావాలను (అటువంటి అపరిపక్వ భావాలను అనుభవంలేని కళాభిమాని మాత్రమే పరిగ్రహిస్తాడు) లెఖ్ఖచెయ్యక, తన ప్రతిభనంతా ఎప్పటికో రాబోయే ఉజ్జ్వల భావాన్ని వ్యాఖ్యానించటం కోసం గుప్తం చేసుకున్నట్లే, ఈ నిర్భాగ్యజీవి కూడా, నావంటి ఆరంభకుడికెంతో ఆశగొల్పిన వందల అవకాశాలను జారవిడుచుకున్నాడు. ఇక్కడా, అక్కడా అనేకచోట్ల ప్రయత్నించి చూశాడు. చాలా జేబుల్ని పైపైన తడిమి చూశాడు. కాని, ఒక్కటి కూడా అతనికి అనువుగా, నిరపాయకరంగా లేదు. అయినా ఓరిమినంతా కూడగట్టుకొని, లేని నిర్లక్ష్యాన్ని తెచ్చుకొని కొట్టు దగ్గరనుంచి పదిగజాలు అవతలికి నడిచి, మళ్ళీ వెనక్కివచ్చాడు. ప్రతి అవకాశాన్నీ పరీక్షిస్తూ, వాటివల్ల వచ్చే లాభాలనూ, (నాకు అగమ్యగోచరమైన) నష్టాలనూ సరితూచుకుంటూ ఆలోచించుకుంటున్నాడు. అతని ప్రశాంతత, విసుగులేని పట్టుదల నన్ను సమ్మోహపరిచాయి. నాలో ఓరిమి లేకపోయినా, ఎప్పటికో చివరికి విజయం సాధించకపోడనే నమ్మకం కలిగింది. నామట్టుకు నేనూ, అర్ధరాత్రి అయిపోయినాసరే అతనికేదో లాభం కలిగేవరకూ నా పరిశోధన మానకూడదనే నిశ్చయించుకున్నాను.

చీకటిపడింది. నగరంలోని జనమంతా వీధుల్లోనే కనిపించే సమయం అది. బజారుకి వెళ్ళేవాళ్ళూ, సముద్రతీరానికి వెళ్ళేవాళ్ళూ, పార్కులికి పోయే వాళ్ళూ. సినిమాలకి వెళ్ళేవాళ్ళూ. గుళ్లోకివెళ్ళే ఆడవాళ్ళూ, ఆటలనుంచి తిరిగి ఇంటికిపోయే చిన్నపిల్లలూ... వీధులనిండా కిటకిటలాడుతూ ఉంటారు. పొద్దుటినుంచి ఉక్కిపోతూ ఇళ్లల్లో కూలబడ్డవాళ్ళూ, ఆఫీసుల్లో పనిచేసిన వాళ్ళూ, కాళ్ళూ చేతులూ ఊపుకుంటూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ చల్లగాలి సేవించటానికి బయలుదేరతారు. మళ్ళీ తెల్లవారితే ఒళ్లువంచి పనిచెయ్యక తప్పదు. అది తెలుసుకొని అవయవాలన్నీ

వీలైనంత స్వేచ్ఛననుభవిస్తున్నాయి. వాటికి కావలసింది కాంతి, సంతోషం, నూతనత్వం, వింతలూ, వినోదాలూ. ఈ అవకాశంవల్ల కోతుల్ని పెట్టినకొట్టు మాత్రం బాగా లాభిస్తుంది. అంతకంతకు ఆ కిటికీముందు జనం సందడి ఎక్కువైపోతోంది. ముందర వరసలో ఆడవాళ్లు- పక్షుల్లా కిచకిచమంటున్నారు. వాళ్లవెనక పనివాళ్ళూ, తిరుగుబోతులూ చేరి నీచంగా వేళకోళాలాడుతూ తమ అల్పత్వాన్ని ఋజువు చేసుకుంటున్నారు. వాళ్లు గుంపులు గుంపులుగా చేరుతున్నకొద్దీ, ఆ ఖాకీచొక్కా మనిషి లోపలికి తోసుకొని వెడుతున్నాడు. అప్పుడతన్ని చూస్తుంటే, గాజు తొట్టెలో నీళ్లల్లో ఈదుతున్న చిన్న బంగారు చేప గుర్తుకొచ్చింది.

"చేస్తే ఇప్పుడే ధైర్యంగా చేసెయ్యాలి... లేకపోతే అసలు చెయ్యనే లేదు" అనుకున్నాను. ఇలా అనుకుంటూండగా, నేనున్నస్థలం కూడా పరిశోధనకి అంత అనువుగా లేదనే అసంతృప్తి కలిగింది. అపని జరిగే చోటుకి దగ్గరలో ఉండాలి. ఆ తమాషా ఎలా చేస్తాడో సరిగ్గా చూడగలిగేటంత దగ్గరగా ఉండాలి. నేను అనుకున్నట్లు చెయ్యడం ఏమంత సులభం కాదు! చిరుచేపలా జారిపోతున్నాడు. ఎంత గుమిగూడిన జనంలోంచైనా సునాయాసంగా చొచ్చుకుని పోగలడు. ఒక్కక్షణం వెనక అతను నాపక్కకొచ్చాడు. ఇప్పటికప్పుడే ఆ కొట్టు కిటికీ దగ్గరున్నాడు- గాజుతలుపు పక్కనే. అంటే కన్ను మూసి తెరిచేటంతలో అయిదారు వరసల ప్రేక్షకుల్ని తప్పించుకు పోయి ఉంటాడు.

అతనికన్న ఇంకా నెమ్మదిగా, యింకా జాగ్రత్తగా అతన్ని అనుసరించాను అతని మీంచి చూపుల్ని మళ్లించకుండా. లేకపోతే నేను ఆ కిటికీ సమీపించేలోపునే ఏ కుడిపక్కకో, ఎడం పక్కకో కంటికనిపించకుండా వెళ్ళిపోయేవాడు... ఇంక కంగారు పడక్కర్లేదు... అతను మొట్టమొదటి సారిగా నిశ్చలంగా నిలబడ్డాడు. "ఏదో కారణం లేకపోలేదు ఈ మార్పుకి" అనుకుని, అతని చుట్టుపక్కలున్న జనాన్ని ఒక్కమాటు త్వరత్వరగా కలయచూశాను. అందులో బాగా లావుగాఉన్న ఒకావిడ కుడిచేత్తో నీరసంగా ఉన్న పదేళ్లపిల్లని పట్టుకుని, రెండోచేత్తో బజారుసంచీ పట్టుకుని నిలబడింది. సంచీలోంచి పెద్ద పెద్ద పొట్లాలు పైకి ఎత్తుగా కనిపిస్తున్నాయి. కాళ్లకి చెప్పులు లేవు. ముదురు రంగు ముతకచీర పొట్టిగా కట్టుకుంది. ఈవిడకి కోతుల్ని చూసేసరికి సరదాపుట్టింది. నవ్వినప్పుడల్లా ఆవిడ స్థూల శరీరం తీవ్రంగా కంపించి, ఆవిడ

చేతిసంచీలో సామాన్లన్నీ దడదడ లాడుతున్నాయి. ఈవిడ గంభీర మందహాసం కోతుల్ని కూడా ఆకర్షించింది. చుట్టుపక్కలున్న వాళ్లు కూడా జంతువులను చూడటం మానేసి ఈవిణ్ణే వింతగా చూస్తున్నారు. ఈ వినోదాన్ని కలుగజేసిన వాళ్ల ఔదార్యాన్ని ప్రశంసిస్తూ తెగ సంతోషిస్తోందావిడ. టిక్కట్లు లేకుండా వినోదం చూపిస్తూంటే పేదవాళ్ల ఆనందానికి అంతులేదు. దేముడు వరమిచ్చినట్లుగా ఉంటుంది వాళ్లకి. ఈవిడైనా మరీ స్వార్థంతో సంతోషించలేదు. అస్తమానూ పక్కకి తిరిగి తన కూతురితో ఆరవంలో చెబుతూంది కోతుల చేష్టల్ని సరిగ్గా చూడమని. అంతమందిలో సిగ్గుపడి ఆ పిల్ల తమాషా ఎక్కడ చూడదోనని ఆవిడబాధ. ఈ మహత్తరజీవి- ఆయురారోగ్యాభివృద్ధిగాంచిన ఈమహిళ- సాక్షాత్తు ఆ మహాతల్లి భూదేవిలా ఉంది. ఆవిడ అమాయకపు ఆనందానికి జాలివేసి ఆప్యాయంగా ఆవిడ ఒడిలో తలదాచుకుందామని పించింది. హఠాత్తుగా నాకు కంగారు పుట్టింది. ఆ ఖాకీచొక్కా చెయ్యి క్రమక్రమంగా పాపం, ఆ లావుటావిడ బజారుసంచీ దగ్గరికి జరుగుతోంది. ఆ సంచీ అసలే తెరిచి ఉంది. వస్తువులన్నీ లోపల చెల్లాచెదురుగా ఉన్నాయి- పేదవాళ్ల అజాగ్రత్తనంతా సూచిస్తూ.

"కొంపతీసి!... ఈ మహాసాధ్వి... అమాయకురాలు... ఆవిడ చేతిసంచీలోని డబ్బుల మూటని తీసుకుపోడుకదా!" నేనుమట్టుకు ఇష్టపడను. అంతవరకూ జేబుదొంగతనం భలే ఆట అనుకున్నాను. చెప్పానుగా, అతనితో నన్ను ఐక్యం చేసుకున్నానని. ఇంతసేపు అతను పడుతున్న శ్రమ ఫలితంగా ఆఖరున మంచి బహుమానం లభించాలని ఆశించాను, వాంఛించాను. తీరా ఇప్పుడు దొంగిలించే ప్రయత్నాన్నీ, దొంగిలింపబడబోయే వ్యక్తినీ చూశాను... పాపం, ఆర్భాటంలేని అమాయకురాలు... ఎంతో ఆనందంగా ఉంది... అంట్లుతోముకుంటూ బ్రతికే పని మనిషైనా, కష్టాన్నంతా మరిచి, ఎంతో ఉత్సాహంగా ఉన్న సమయంలో, ఆ పేదరాలిని దోచుకుంటుంటే, కోపం పట్టలేకపోయాను. "చెయ్యి తియ్యి, దొంగ వెధవా!" అని అరుద్దామనుకున్నాను. "నీ వెధవ్వేషాలన్నీ ఇంకెవరి దగ్గరన్నా చూపించు... ఈ పేదరాలిని వదిలేసెయ్!" నేను ముందుకి నడిచాను- ఆ దొంగకీ, చెదురుతూన్న చేతిసంచీకి మధ్య నిలవాలని. నేను రెండడుగులు వేసేసరికి వాడు నన్ను తప్పించుకొని "క్షమించండి" అని వినయంగా, సరళంగా అంటూ వెళ్ళిపోయాడు. మొట్టమొదటి సారిగా అతని కంఠం విన్నాను. మరుక్షణంలో ఖాకీచొక్కావాడు జనసమూహంలోంచి

తప్పించుకున్నాడు. నేను అడ్డువెళ్లటం ఆలస్యంగా జరిగిందనీ, అప్పటికే వాడి పథకం ఫలించిందనీ గ్రహించాను.

పోనీ, అయితేనేం, వాణ్ణి మాత్రం వదిలిపెట్టను. దూకుడుగా నేను కూడా జనాన్ని తప్పించుకుంటుంటే నా అడుగు ఒకాయనపాదంమీద పడింది. ఆయన నోరారా తిట్టుకున్నాడు. సమయానికి చూశాను ఖాకీచొక్కావాడు ఆ వీధిమలుపు తిరిగాక చిన్నసందులోకి దూరటం. చురుగ్గా నడిచి వాణ్ని మళ్ళీ చూశాను. నాకళ్లను నేనే నమ్మలేక పోయాను. గంటన్నరనుంచి తదేకంగా నేను పరిశీలించిన ఆ చిన్న మనిషి ధోరణి హఠాత్తుగా మారిపోయింది. ఇంతవరకూ నేను చూసినంతసేపూ అతను నిలకడలేకుండా యిటూ అటూ తచ్చాడుతూ వ్యాపకం లేనివాడిలా కనిపించాడు. ఇప్పుడు ముంగీసలా గోడకంటిపెట్టుకొని హడావిడిగా ఆఫీసుకిపోయి బస్సు తప్పిపోతే ఆఫీసరు తిట్లకి భయపడి కంగారు పడిపోయే గుమాస్తాలా నడుస్తున్నాడు. ఇంతకు పూర్వం ముందూవెనకా చుట్టుపక్కలా చూసుకుంటూ నడిచేవాడు. ఇప్పుడ తలవంచుకొని తిన్నగా తనదారిని తను వడివడిగా పోతున్నాడు. నా అనుమానం బలపడింది. దొంగతనం చేసేసిన తర్వాత, ఆ స్థలం నుంచి వీలైనంత త్వరగా ఎవరికీ తెలియకుండా బయటపడిపోవటం దొంగ అవలంబించే పద్ధతి. అంతే, సందేహం లేదు. వెధవ! ఆ అమాయకురాలి చేతిసంచీలోని డబ్బులమూటని అపహరించి ఉంటాడు.

ఆ కోపంతో "ఆగు, దొంగ వెధవా" అని గట్టిగా నలుగురికీ తెలిసేలా అరవాలనిపించింది. కాని ధైర్యంచాల్లేదు. ఇంతకీ దొంగతనం జరుగుతూండగా నేను చూడలేదు. అంతా నేనూహించుకున్నదేకదా. అదీకాక, ప్రభుత్వం పేరుతో న్యాయాధికారాన్ని చెలాయించటానికీ, తోటిమానవుని పట్టుకుని శిక్ష విధింపజెయ్యటానికీ అసామాన్యమైన ఆత్మవిశ్వాసం కావాలి. అటువంటి ఆత్మవిశ్వాసం నాకెప్పుడూ లేదు. నాకు తెలుసు న్యాయం ఎంత అపసవ్యంగా నడుస్తున్నదో, దాన్నెంత ధుర్రహంకారంతో అమలు జరుపుతున్నారో... ఈ కలికాలంలో నా న్యాయం?

అవిధంగా నిర్ణయించుకుంటూండగా, అతనిలో మరోవింత మార్పురావటం గమనించి మరింత ఆశ్చర్యపోయాను. రెండు మూడు సందులు దాటిపోయిన తరువాత ఆ అసాధారణ వ్యక్తి సరికొత్త నడవడిని అలవరచుకున్నాడు. తలవంచుకుని

వడివడిగా నడవటం లేదింక. మామూలు మనిషికి మల్లే స్వేచ్ఛగా ఒక్కసారి ఒళ్లు విరుచుకుని కొంత సర్దుకున్నాడు. ప్రమాదస్థలం దాటిపోయాడు. అతన్ని వెన్నంటే వాళ్లెవరూ లేరు. అపాయం గురించి ఆలోచించవలసిన ఆగత్యం లేదు. ఇంక స్తిమితపడొచ్చును. ఇప్పుడతను జేబులు కత్తిరించే దొంగకాదు. మామూలు మనిషి అయిపోయాడు- మద్రాసు వీధుల్లో సిగరెట్టు కాలుస్తూ నిర్లక్ష్యంగా నడచిపోయే లక్షల జనంలో అతనొకడు. ఏమీ ఎరగనట్లు అమాయకపు ధోరణిలో సావకాశంగా, కులాసాగా, నాలుగువీధులు కలిసేచోటు దాటేశాడు. సిసలైన "రసికుని"కి మల్లే అతను ఎదురయ్యే ప్రతి ఆడదాని చూపులకూ వెలకడుతున్నాడని ప్రప్రథమంగా తోచింది నాకు.

"అడుగడుగునా ఆశ్చర్యాలు వెదజల్లేవాడా! ఇంకెక్కడికోయ్"? అప్పటికి మేము దేముడిగుడి కెదురుగా ఉన్న చిన్న స్థలానికి చేరుకున్నాము. చెట్లన్నీ చిగిర్చి వచ్చగా ఉన్నాయి. "ఎక్కడికయ్యా? ఆ... తెలిసింది! అక్కడున్న రాతిగట్టుమీద కూర్చుని కాస్సేపు విశ్రాంతి తీసుకుందామను కుంటున్నావుకదూ? నిజమే మరి, సాయంకాలం నుంచి ఇప్పటివరకూ శ్రమించిన మీదట బాగా అలిసిపోయి ఉంటావు". అబ్బే, ఆ ఇంద్రజాలికుడు రాతిగట్టుమీద కూర్చోలేదు. (పాఠకులు క్షమించాలి) అతనెంతో ధైర్యంగా, మానవుని అత్యంత అంతరంగిక అవసరాలను తీర్చే చిన్న మురికి కొంప వైపుకి దారి తీశాడు. లోపలికి ప్రవేశించి ఒక మూలగా కుర్చీలో కూర్చున్నాడు.

నాకు నవ్వొచ్చింది. కళాకారులందరూ, దొంగల్ని మినహాయించకుండా, ఒకే మానవ జాతికి చెందినవారు. భయం వేసినప్పుడు కడుపులో కలకలం బయలు దేరుతుందని అందరికీ తెలునును- (అనేక యుద్ధరంగ వర్ణనలలో ఈ సత్యం చెప్పబడింది). ఇప్పుడీ ఖాకీచొక్కా మనిషి మంటల మధ్య సైనికుడిలా ఉన్నాడు. ఊహాలెంత చిత్రమైనవైనప్పటికీ, విన్నటికైనా వాటికన్నా వాస్తవిక వైచిత్ర్యాలు విపరీతంగా కన్పట్టిక మానవు. అసాధారణమైన వాటిని అసహ్యాకరమైన వాటితో ఎదిరించటానికి వాస్తవికతకు వెరవులేదు. అంతేకాదు- వాస్తవికత, సర్వసామాన్యమైన మానవలక్షణాలతో అసామాన్యమైన దాన్ని సన్నిహిత పరిచే విద్రోహకారి. ఆ వీధి గుమ్మానికి వైపు చూస్తూ, రాతిగట్టుమీద కూర్చుని (అంతకన్న నేను చెయ్యగలిగిందేముంది?) ఆలోచిస్తున్నాను. ఈ కళాకారుడు సరిగ్గా తన వృత్తికి

తగినట్లుగానే ప్రవర్తిస్తున్నాడు. దొంగతనమే వృత్తిగా పెట్టుకున్నవాడికి, ఒక జేబు కత్తిరించిన తక్షణం ప్రశాంతమయిన ఏకాంత స్థలం అత్యవసరం. దొరికిన సొమ్ము చూసుకుని, ఆచూకీయిచ్చే వస్తువులను వదుల్చుకోవాలి. అయితే, అటువంటి మహాపట్నంలో, కొన్నివేల కళ్లు పరికిస్తూ ఉంటాయి. అంత స్వల్ప వ్యవధిలో నాలుగు గోడల మధ్య ఏకాంతం లభించటం అసాధ్యం. నేర విచారణ వృత్తాంతాలను వార్తా పత్రికల్లో చదివేసరికి, అనేకమంది అనుక్షణం ప్రతిస్వల్ప విషయాన్నీ పరిశీలిస్తూ ఉంటారనీ, కొంతమందికి విపరీతమైన జ్ఞాపకశక్తి ఉంటుందనీ, తెలిసే ఉంటుంది.

అంతవరకూ దేనికి? ఓ చిన్న ఉత్తరాన్ని చింపి ముక్కలుచేసి వాటిని పక్కనున్న చెత్తడబ్బాలో పారెయ్యండి... దారిని పోయేవారిలో మూడొంతులు మంది ఆ విషయాన్ని కనిపెట్టిఉంటారు. ఏమీతోచని కుర్రవాడైతే కుతూహలంతో ఆ కాగితం ముక్కల్ని ఏరి కష్టపడి దగ్గరికిచేర్చి చదువుకొని సంతృప్తి పడతాడు. ఏదైనా హోటలుకి భోజనానికి వెడతారు. హోటలు కుర్రాడొకడు (వాణ్ణి మీరు అంతకు ముందెప్పుడూ చూసి ఉండరు- అయినా, లక్షమంది కుర్రాళ్లలో వాడెవడో ఎవరు లక్ష్య పెడతారు) మనస్సులో మీ వ్యక్తిత్వాన్ని చిత్రించుకుంటాడు- మీ ముఖలక్షణాలనూ, మీ దుస్తులు, మీ తరహా... మీజుట్టు... మీ జోళ్లు... మీగోళ్లు అందంగా ఉన్నాయో లేదో- అన్నీ అనాలోచితంగా పరిశీలిస్తాడు.

ప్రతికిటికీలోంచి, ప్రతికొట్టులోంచీ. ప్రతి పరదావెనకనుంచీ, ప్రతిచోటు నుంచీ ఏవో రెండు కళ్లు మన చర్యలను పరికిస్తూనే ఉంటాయి. వీధుల్లో నడుస్తున్నప్పుడు మనల్ని ఎవ్వరూ గమినించలేదనుకుంటాం. కాని, అనుమానానికి అవకాశం లేని కొన్నివేల మంది చూపులకు బలి అవుతాం. మన దైనందిన జీవితం చుట్టూ విత్యమాతన ఆసక్తి దట్టంగా అల్లుకుని ఉంటుంది. ఈకళావేత్త మంచి ఉపాయమే ఆలోచించాడు. పావలా డబ్బులతో పదినిమిషాలపాటు ఏకాంతాన్ని కొనుక్కున్నాడు. దొంగిలించిన సొమ్ము లెక్కచూసుకునేందుకు తగిన సమయం, అనుమానాస్పదమైన కాగితాలను కాని, ఇతర వస్తువులను కాని వదుల్చుకునేందుకు తగిన సురక్షితమైన స్థలం. అతనిచుట్టూ నాలుగుగోడలు, పైన యింటికప్పు- నిస్సంకోచంగా, దొరికిన దొంగ డబ్బులు లెక్కపెట్టుకోవచ్చు. చివరికి, శేషు కూడా - అతని అడుగుజాడల్ని అనుసరిస్తూ, ఆరుబయట అతనికోసం ఉత్సాహ నిరుత్సాహాలతో నిరీక్షిస్తున్న నేను

కూడా అతనెంత సంపాదించాడో తెలుసుకోలేకపోయాను.

అయినా, ఆ జనసమూహంలోంచి అతను బయటపడ్డప్పుడే అనుకున్నాను- నా అంతట నేను స్వయంగా ఆ లావుపాటావిడ డబ్బుల మూటలో ఎంత ఉన్నదీ లెక్కచూసినట్టుగా- అతనికాట్టే గిట్టుబాటు కాలేదనే అనుకున్నాను. అతని ముఖంలో వ్యక్తమవుతున్న విసుగు, అతని నీరసం - వాలకం, యాంత్రికంగా నడవటం- అన్నీ స్పష్టంగా చెప్తున్నాయి- అతను సాయంకాలం నుంచీ పడ్డ శ్రమకి తగిన ఫలితం ముట్టలేదని. అయినా ఆ మూటలో ఏముంటాయి కనక? మహా అయితే, ఇంటి తాళం చెవి, కాసిని వక్కలు, ఒకటి రెండు రూపాయల చిల్లర డబ్బులు- అన్ని గంటలసేపు చమటోడ్చి శ్రమిస్తే లభించిన ఫలం! అయితే, ఆ లావుటావిడకి మట్టుకు పాపం, ఎంతో నష్టం కలిగిందనిపించి, ఆవిడ కళ్లల్లో నీరు నిండిఉంటుంది. పదిసార్లు చుట్టుపక్కలవాళ్లని పిలిచి జరిగిన విషాద సంఘటనను వివరించి ఉంటుంది. పదిసార్లు ఆ చేతినంచీ దులిపి చూసుకొని ఉంటుంది. పదిసార్లు ఆ దొంగని దుమ్మెత్తి పోసి ఉంటుంది. ఆ దొంగ కూడా ఆవిడంత బీదవాడే. అందుకే, మొదటి చూపులోనే, అతనికి తన కష్టార్జితం తన అవసరాలకు చాలదనిపించి ఉంటుంది. ఈ నిజం నాకిప్పుడు ప్రత్యక్షంగా నిదర్శనం కానున్నది. అతనికి పట్టిన ఈ నికృష్టస్థితిలో నీరసంగా మరో వందగజాలు నడిచాడు. దారిలో చెప్పులదుకాణం కనిపిస్తే ఆగి, గాజుబీరువాల్లో పెట్టిన అందమైన జోళ్లవైపు ఆశగా చూశాడు. ప్రస్తుతం తన పాదాలను కప్పటానికి ప్రయత్నిస్తున్న తోలుముక్కల స్థలాన్ని ఆక్రమించేందుకు చవకగా దొరికే చెప్పులకోసం వెతికాడు. మద్రాసురోడ్లను చప్పుడు చెయ్యకుండా నిశ్శబ్దంగా, రబ్బరు, క్రేపుజోళ్లతో తొక్కుకుపోయే వారికన్న ముందర ఇతనికి కొత్తజోళ్లు అత్యవసరమని తోచాయి. తన వ్యాపారాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాలంటే కొత్తజోళ్లు అవసరం. అధమం అఖరురకం జోళ్లకోసం ఖర్చు చెయ్యగలిగినంత సొమ్మైనా సంపాదించలేక పోయాడని అతని చూపులే చెబుతున్నాయి. నిస్పృహతో నిట్టూర్చి ఖాకీచొక్కా ముందుకి నడక సాగించాడు.

ఇంకెక్కడికి? మళ్ళీ వేటకి బయలుదేరుతున్నాడా? తిరిగి తన శక్తినంతా స్వల్ప ప్రతిఫలం కోసం ధారపోస్తాడా? "ఒద్దయ్యా, పిచ్చివాడా! ముందు కాస్త విశ్రాంతి తీసుకో". నాభావాలను గ్రహించినట్టుగా,- నా కోరికలన్నీ తంతి ద్వారా

అతనికి చేరినట్టుగా, అతను పక్కనున్న సన్నటిసందులోకి తిరిగి, అక్కడున్న చవకరకం హోటలుముందు ఆగి, స్తంభానికి కట్టిన బోర్డుమీది ధరలు చదువుకున్నాడు - లోపలికి ప్రవేశించడానికి సాహసించక పూర్వం. రెండుగంటలసేపు గుండెదడతో, అత్యంత శ్రద్ధాసక్తులతో అతని చర్యలను పరిశోధించి, అతనిలో నిగూఢమయివున్న మర్మాన్నంతా విస్పష్టం చెయ్యాలని నిర్ణయించుకున్న నేను అతన్ని అనుసరించానని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఓ వార్తాపత్రిక కొనుక్కుని ముఖానికడ్డం పెట్టుకుని, అతనికి కాస్త దూరంలో మరోకుర్చీలో కూర్చున్నాను. నేనంత అతి జాగ్రత్తపడటం అనవసరమే అయింది. ఆ జేబుదొంగ చచ్చేటంత అలసటతో, ఆకలితో ఉన్నాడేమో, తన గొడవ తప్పించి ఇతరుల విషయం పట్టించుకునే స్థితిలో లేడు. బల్లమీద బట్టకి బదులుగా పరచిన తెల్లకాగితాన్ని తేరిపారిచూస్తూ నిశ్చలంగా కూర్చున్నాడు హోటలు కుర్రాడు పూరీలు పట్టుకొచ్చేవరకూ. వాటినిచూసీ చూడటంతోనే అతని బక్కపలచని చేతులు ఆత్రంగా లాక్కున్నాయి వాటిని. ఆకలిగొన్న సింహంలా తినటం మొదలుపెట్టాడు. అతనికి సరిగ్గా తిండి దొరకటం లేదనుకుంటాను. పొద్దుటినుంచీ ఏమీ తినిఉండడు. ఒకవేళ నిన్నటినుంచీ పస్తున్నాడేమో. అతను చెప్పిన ప్రకారం హోటలుకుర్రాడు పట్టుకొచ్చిన పాలగ్లాసు చూడగానే అతనిపైన మరింత జాలేసింది. పట్నవాసపు దొంగ పాలుత్రాగటం!

ఇటువంటి అతిస్వల్ప విషయాలే, నిప్పురవ్వ గడ్డికుప్పపైన పడి అగ్ని జ్వాలలు రేపినట్టు, మనో ప్రపంచాన్ని విజ్ఞానపు వెలుగులతో నింపివేస్తాయి. ఆసమయంలో, (ప్రజలు న్యాయప్రకారం నేరస్తుని క్రింద జమకట్టే) జేబుదొంగ ఎంతో అమాయకమైన, స్వచ్ఛమైన తెల్లనిపాలు మెల్లమెల్లగా గుటకలు వేస్తోంటే "దొంగ" అనిపించలేదు నాకు. నామరూపాలు లేని "నికృష్టజీవుల్లో" అతనొకడు. ఈ విశాలవిశ్వంలో నిలువ నీడలు లేక, కడుపుచిచ్చుతో అల్లాడే లెక్కలేని పేద ప్రజలలో ఒకడు! కర్తవ్యంకన్న ఆసక్తి, అతనితో నాకొక విధమైన అనుబంధాన్ని ఏర్పరిచింది.

విశ్వమానవత్వపు వివిధ రూపాల్లో- నగ్నత్వం, గాఢనిద్ర, పరిశ్రమ- రక్త మాంసాలు కోరే ప్రతి అత్యవసర విషయంలో మనుషులను మంచీ చెడూ అనీ, గౌరవనీయులూ అగౌరవనీయులనీ, విశ్వాసపాత్రులూ విశ్వాస ఘాతకులూ అంటూ కృత్రిమ విభేదాలను కల్పిస్తారు. ఆ కృత్రిమ కవాటాలు అప్పుడే కూలిపోతాయి. చివరికి మిగిలేదల్లా

ఆకలిదప్పులతో అల్లాడిపోయే ఆ నిర్భాగ్యజీవి మాత్రమే. నాకూ, నావంటి ప్రతిమనిషికీ అవసరమైనట్టే అతనికీ నిద్రకావాలి. విశ్రాంతికావాలి.

అతనావిధంగా గ్లాసులో ఒక్క చుక్క మిగల్చకుండా పాలు తాగుతూంటే, ఒక్క ముక్క రాల్చకుండా రొట్టెలు తింటూంటే విస్తుబోయి చూశాను. అంతలోకే, అవమానంతో క్రుంగిపోయాను. అంత కుతూహలంతో అతని కష్టభరితమైన వృత్తిని పరిశీలిస్తూ, అతన్నంతసేపు వెంటాడుతూ ఆఖరికి నాలుగు డబ్బులైనా సాయం చెయ్యలేక పోయాను. ఏవిధంగా అతన్ని పలుకరించాలో, ఏవంక పెట్టుకుని అతనికి ధనసహాయం చెయ్యాలోనని, బుర్ర చించుకున్నాను. అయినా మనతత్వం ఎంత విచిత్రమైనది! సాధించవలసిన నిర్ణీతక్షణం అనన్నమయేసరికి, వింతగా ప్రవర్తిస్తాం. సహాయం కోసం పరితపించిపోతున్న తోటిమానవుణ్నీ మనలనూ వేరుచేసే, సన్నని గాలి పొరను చీల్చుకుని దారిచేసుకుని ముందుకు సాగిపోవటానికి ధైర్యం చాలక పిరికివందల్లా వెనుకంజవేస్తాం. అయితే, సహాయం అపేక్షించని వాళ్లకి సహాయం చెయ్యగలగటం ఎంత కష్టమో అందరికీ తెలుసును. ఈ అర్థించక పోవటమే అతనికి మిగిలిన ఆఖరిఆస్తి- అదే- ఆత్మాభిమానం! ముష్టివ్యాపారం సాగించేవాళ్లకి మాత్రమే అర్థించటం సులభ సాధ్యమవుతుంది. అంచేత వాళ్లకు సహాయం చెయ్యటంకూడా సులభమే. ఆ అవకాశాన్ని కల్పించినందుకు వారికి కృతజ్ఞత తెలుపుకోవలసి ఉంటుంది కూడా. కానీ, ఇప్పుడు నేను చూస్తున్న మనిషి ఒక తరహాకు చెందిన అభిమానస్తుడు. తనస్వేచ్ఛనూ, జీవితాన్నీ అయినా లెక్కచెయ్యక పోవచ్చునుకాని, ముష్టెత్తుకుని మానాన్ని మాత్రం చంపుకోడు. అందువల్ల అతన్ని నిందించేందుకు మనకధికారం లేదు. చెయ్యిచాచి అడిగేకన్న చాకచక్యంతో దొంగతనం చెయ్యటం అతనికి మేలనిపించి ఉంటుంది.

నేనుకనక దురభిప్రాయపడి సహాయం చెస్తానన్నట్లయితే, అతనెంత విపరీతంగా బాధపడతాడు, ఎటువంటి జీవన్మరణ బాధ ననుభవిస్తాడు? అంతేకాదు. అతను చాలా అలిసిపోయినట్లు కనిపిస్తున్నాడు. అతన్నీ సమయంలో కలత చెందించటం భావ్యం కాదు.

తీరిగ్గా విశ్రమించటానికి కుర్చీని గోడవైపుకి తోశాడు. ఇప్పుడయితే తల గోడకాన్చి ఖులాసాగా కుర్చీలో జార్లపడవచ్చును. అతని దళసరి కనురెప్పలు

మూసుకున్నాయి. కునికిపాట్లు పడుతున్నట్లున్నాడు. అప్పుడతని ఆకారం చూస్తే భయంవేసింది- వెల్లవేసిన జైలుగదిలా ఉన్నాడు. ఆచొక్కా చేతికున్న పెద్దచిరుగు- చూస్తే, అతన్ని ప్రేమతో దయతో చూసే భార్యగాని మరే ఆడదిగాని అతనికి లేరని తెలుస్తోంది. అతని జీవితాన్ని- గాలి, వెలుతురు లేని చిన్నగది... అందులోకుక్కి మంచం... సొట్టలు పడిన సూటుకేసు... ప్రతినిత్యం పోలీసుల భయంకర పదధ్వని వినిపిస్తుందనీ, తలుపు ధన్నుమని చప్పుడవుతుందనే భయభ్రాంతులతో... కడుపులో ఆకలితో... బుర్రలో ఆలోచనలతో... ఈ విధంగా ఊహించుకున్నాను- దుమ్ముకొట్టిన తలకాయను గోడకాన్చి, కృశించిన దేహాన్ని కుర్చీమీద జార్లవేసి అతను కునుకుతీసిన రెండు మూడు నిముషాల్లోనూ.

హోటలు కుర్రాడు బల్లమీంచి ప్లేట్లూ, గ్లాసులూ, చెంచాలూ అవీ తీస్తూ అధికార యుతంగా గడబిడ చేస్తున్నాడు. నిజమే, అంత పొద్దుపు చేసే అతిధిని అట్టేసేపు నిలవనివ్వకూడదు. నేను చెల్లించవలసింది చెల్లించేసి వీధులోకి వచ్చేశాను. నేను అట్టేసేపు ఆగనక్కర్లేకుండా ఖాకీచొక్కా వీధులోకొచ్చేశాడు నన్ను గమనించ కుండానే. అతన్ని అనుసరించాను. అతను ఆలోచనల్లో మునిగిపోయినట్టు కనిపించాడు. అతని పరిస్థితి చూస్తుంటే, అంతవరకూ ఎరుగని ఏదో నూతన కళాసృష్టిని తిలకించాలనే ఉత్సాహం, సరదా, ఆసక్తితో ఆ సాయంకాలం ఉన్నట్టుగా లేదు నా మనస్సు. అంతవరకూ అణగిపోయిన ఆదుర్దా అంతకంతకు అధికమై దుర్భరమై పోతోంది- అతను మళ్లీ ఆ నడివీధివైపుకి దారితీస్తుంటే.

"నీ యిల్లు బంగారం కానూ! మళ్ళీ ఇందాకటిచోటికే- ఆ కోతులు అడే దుకాణం దగ్గరికే వెళ్లేటంత మూర్ఖుడివా? తన సొమ్ము పోయిందని తెలునుకోగానే ఆవిడ ఈపాటికే పోలీసులతో చెప్పివుంటుంది- వాళ్లు నిన్ను పట్టుకోవటానికి సిద్ధంగా ఉండిఉంటారు. ఈ ప్రమాదం సంగతి అటుంచి, ఇవాల్టికి నీపని చాలిస్తేనే నీకు మంచిది. మళ్ళీ కొత్త ప్రయత్నం ప్రారంభించకు. అందుకు తగిన స్థితిలో లేవు. బాగా అలిసిపోయావు. ఎటువంటి కళాపూరితమైన పనైనాసరే, అజాగ్రత్తగా ఎవరుచేసినా అది చెడిపోయితీరుతుంది. నీకిప్పుడు కావల్సింది విశ్రాంతి. ఇంటికి వెళ్ళి హాయిగా పడుకో. ఇవ్వాళ మాత్రం నువ్వు మరోగొడవ తలపెట్టకు.

ప్రథమ ప్రయత్నంలో అతను తన సామర్థ్యాన్ని ప్రదర్శించి ఉండచ్చును

కాని, యిప్పుడతను బాగా అలిసిపోయిన మూలాన్ని ఏదో అవకతవక పని చెయ్యటం ఖాయం- అనే అభిప్రాయం నాలో ఎంతబలంగా నాటుకుందో చెప్పటానికి మాటలు చాలవు. అయితే, సందులుదాటి ఆ నడివీధి చేరుకునేసరికి ఏకారణం వల్లనైతేనేం, నా ఆదుర్దా అధికమైపోయింది. "ఏం చేసినా సరేకాని, ఆ కోతులదగ్గరికి మాత్రం మళ్ళీ వెళ్లకు!" ఆ మాటలు నా పెదవులమీద నిలిచాయి. నా చెయ్యి ముందుకి సాగింది- అతన్ని రెక్కపట్టుకు ఆపేందుకు... అతను సరిగ్గా నాలుగువీధులు కలిసే చోట్కు దాటి, యిందాకటి అడమనిషిని కొల్లగొట్టిన చోటికి- ఆ కోతుల దుకాణం వైపుకి దారితీస్తూండగా... నా కోరికలన్నీ అతని కర్థమవుతున్నట్టుగా, హఠాత్తుగా పక్కకి తిరిగి కుడిచేతివైపుకి దారితీశాడు. అక్కడున్న భవనం వైపుకి ఎంతో దర్జాగా తన సొంత ఇంటికేనన్నట్లుగా నడిచాడు. నాకు తెలుసాభవనం. మద్రాసులో కంతటికీ ప్రఖ్యాతి గాంచిన వేలం దుకాణం.

ఆ క్షణంలో ఆ నిగూఢ మానిసి వింతప్రవర్తన చూసి అంతులేని ఆశ్చర్యాన్ని పొందాను. నేనతన్ని అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తూండగానే, అతనిలో ఏదో శక్తి నాకొక్కలమ అమలు జరిపిస్తున్నది. ఆసాయంకాలం నేను వెళ్లాలనుకున్న కొన్ని వందల భవనాల్లో ఇదొకటి ముఖ్యమైనది. ఇక్కడనేకసార్లు కాలాన్ని ఉత్సాహంగా, ఆనందంగా, ఇష్టంగా గడిపాను. ఒక్కొక్కప్పుడు వస్తుప్రదర్శనశాలల్లో కన్న విలువైన, అందమైన వస్తువాహనాలిక్కడ ఉంటూ ఉంటాయి. స్థలం అదే అయినప్పటికీ, అక్కడి వస్తువుల్లో ప్రతినిత్యం వైరుధ్యం గోచరిస్తుంది. మద్రాసులో చూడవలసిన ముఖ్యస్థలాల్లో ఇదొకటి. ఇదంటే నాకెంతో యిష్టం. మద్రాసు నగరంలో జీవనాన్ని ఈ స్థలం క్లుప్తంగా వ్యక్తపరుస్తుంది. రోజూ సజీవంగా సంచరించే చక్కని మృగం హఠాత్తుగా ఒకనాడు కసాయివాడి ఇంట్లో నామ రూపాలులేకుండా ముక్కలు ముక్కలుగా పడి ఉన్నట్లే, మామూలు గృహంలో ఒకచోట చేర్చి అందంగా అలంకరింప బడినవే ఈ వేలం ప్రదేశంలో ఒకదానికీ మరొకదానికీ సంపర్కం లేకుండా విడివిడిగా పడి ఉంటాయి. ఇక్కడ పవిత్రమైనవాటికీ, అపవిత్రమైనవాటికీ, సామాన్యమైన వాటికీ, అపురూపమైన వాటికీ భేదం లేకుండా, ప్రపంచంలోని నానారకాల వస్తువుల్లా గందరగోళంగా పడిఉంటాయి. ఈ వేలం స్థలంలో ప్రదర్శితమైన ప్రతివస్తువూ డబ్బుగా మార్చటానికే..., మంచాలు, బల్లలు, తివాసీలు, గడియారాలు, గొప్ప గొప్ప

వాళ్ల ఫొటోలు, శిల్పాలు, అద్దాల బీరువాలు, విదేశాలకు చెందిన వింత వస్తువులు, సైకిళ్లు, పురాణ గ్రంథాలు, చెడిపోయిన గ్రామఫోనులు, అవసరమైనవి, అనవసరమైనవి, చెత్త సామానులు, విలువైన శిల్పాలు, పెద్దవి, చిన్నవి, సిసలైనవి, కృత్రిమమైనవి, పాతవి, కొత్తవి- అన్నీ అక్కడ గడబిడగా చేర్చటం- రూపాయలుగా మార్చటానికే. ఆకర్షణీయమైన వాటినీ, అందమైనవాటినీ- అసహ్యకరమైనవాటితో కలిపి తోసేస్తారు ఈ యంత్రంలోకి. ఈ యంత్రం వాటినన్నింటినీ పొట్టలో పెట్టుకొని వాటి విలువను నాశనం చేస్తుంది. ఈ క్రూరమయిన అగ్నిగుండం ప్రతివస్తువునూ నిర్దాక్షిణ్యంగా కరిగించి వేస్తుంది. మానవ ఆడంబరాలకూ, మానవ అవసరాలకూ మధ్య వర్తకం సాగించే ఈ విశాల విక్రయస్థలంలో- ఈ విపరీత యంత్రాగారంలో ప్రపంచంలోని వైవిధ్యమంతా గందరగోళంగా, వికృతంగా కనిపిస్తుంది.

కళ్లు తెరుచుకుని బుర్ర ఉపయోగించే వాళ్లెవరైనానరే, పురావస్తుశాస్త్రాన్ని నేర్చుకోవాలన్నా, గ్రంథవివరాలను సేకరించాలన్నా, కళల చరిత్రలను చదువుకోవాలన్నా ఇంతకన్న మంచి ప్రదేశాన్ని పొందగలుగుతారా? ముద్రాశాస్త్రాన్ని కాని, (అంతకన్న ముఖ్యంగా) మానవత్వాన్ని కాని అర్థం చేసుకోవటాని కింతకన్న మంచి అవకాశం లభిస్తుందా?

యజమానులను మార్చుకోవటానికే ఇక్కడికిచేరి, అక్కడున్న కొద్దిక్షణాలసేపు మాత్రం ఆబానిసత్వంనుంచి విముక్తిచెందే వస్తువులలో ఎంతోవైరుధ్యం కనిపించినట్లే- ఉత్సాహంతో మెరిసే కళ్లతో, బేరంచెయ్యాలనే ఉద్రేకంతో ఆ విక్రయస్థలానికి గుంపులు గుంపులుగా చేరే జనంలో ఎన్నిజాతులు, ఎన్నికులాలు, ఎన్నిమతాలు కనిపిస్తాయి! పొడుగుకోట్లు తొడుక్కుని, గొప్ప వ్యాపారస్థులూ,తెల్లని ఖద్దరుటోపీలు పెట్టుకున్నవాళ్లూ, వాళ్లపక్కని చిన్నచిన్న దుకాణదారులూ, చవగ్గా సామాను కొనుక్కుని తమకొట్లనిండా నింపుకుని ఎక్కువధరకి అమ్ముకుందా మనుకునేవాళ్లూ బోలెడుమంది. వారిలో మధ్యతరగతి కుటుంబీకులూ, మిలిటరీలో పనిచేసిన వాళ్లూ, రైల్వేపనివాళ్లూ, గుమాస్తాలూ, అవకాశం దొరికితే చవగ్గా కొట్టేద్దామని చూస్తూఉంటారు. కొంతమంది, గొప్ప గొప్పవాళ్లు కోరినవస్తువులకి పట్టుదలగా ధర పెంచుతారు వాళ్లనేడిపించటానికి.

అందంగా అలంకరించుకున్న ఆడవాళ్లు... ఖరీదైన ముత్యాల నగలు పెట్టుకుని... నెమలిపింఛంలా పమిట కప్పుకుని... మొదటివరసలో, ముందే నౌకర్లను

పంపి ఏర్పాటు చేసుకున్న స్థలాల్లో కూర్చుంటారు. ఒక మూలగా, గొప్ప గొప్ప వ్యాపారస్థులకు సలహాదారులుగా ఉండే అభిజ్ఞులు నుంచుంటారు. మధ్య మధ్య సామాన్యప్రజలు కనిపిస్తూఉంటారు. వ్యాపార దృష్టితో కాకుండా, వైజ్ఞానిక దృష్టితో కాకుండా, కళారాధన కోసంకాకుండా, వట్టికుతూహలంతోకాని, లేకుంటే కాలక్షేపం కోసంకాని వచ్చినవాళ్లుంటారు. ఈవినోదం కోసం వారు వ్యయం చెయ్యవలసిందేమీ ఉండదు. అక్కడున్న వాళ్లని ఉత్సాహపరచటంకాని, నిరుత్సాహపరచటంకాని వాళ్లకి సరదా.

ఎవరెవరు ఎందుకోసం ఆ స్థలానికొచ్చినదీ, వారి ముఖ కవళికలే చెబుతున్నాయి. అయితే, ఒక్కరకం మాత్రం- ఇక్కడికి రాగా నేనెప్పుడూ చూడలేదు. వస్తారని ఊహించుకోనైనాలేదు... అదే... జేబుదొంగలరకం. అయినా, నా మిత్రుణ్ని చూడగానే, వెంటనే మనసుకి తట్టింది. కొనేవాళ్లూ ప్రేక్షకులూ అంతా ఏకాగ్రతతో వేలంపాటలో లీనమై పోయిఉండగా, అతనిక్కడికి రావటానికి గల కారణాన్ని వ్యాఖ్యానించుకోవలసిన అవసరం కలగలేదు... బహుశా మద్రాసు నగరంలో అతను తన కళాచాతుర్యాన్ని ప్రయోగించటానికి ఇంతకన్న మంచి ప్రదేశం ఉండదు. అటువంటి వేటగాడికి తగినస్థలం ఇదే. కావలసిన పరిస్థితులన్నీ తమాషాగా సానుకూలమైపోయాయి- నిలుచోవటానికి స్థలంలేనంతగా కిక్కిరిసిన జనం, వేలంపాటలో నిమగ్నమైన మనస్సులూ, ఇతర విషయాలన్నిటినీ విస్మరించేటంత ఉద్రేకం, ఉత్సాహం... జేబు దొంగలికి బాగా పనికల్పించే గుర్రపు పందేల్లోనూ, రైల్వేస్టేషన్లలోనూ తప్ప- అప్పటికప్పుడు డబ్బు చెల్లించే పద్ధతిపైన వ్యాపారంసాగే స్థలం ప్రపంచంలోకల్లా వేలంపాడే చోటొక్కటేననుకుంటా. పైగా చెల్లించే సొమ్ముకూడా పెద్దమొత్తాలే. అంచేత ప్రతి జేబులోనూ నోట్లకట్టలు వ్రేలాడుతూ ఉంటాయి. చంచల హస్తాల పెద్దమనుషులికి మంచి అవకాశాలు లభించే చోటేదైనాఉంటే- ఇదే. నాకిప్పుడు తట్టింది అసలు సంగతి. నా మిత్రుడు సాయంకాలం చేసినది అభ్యాసం మాత్రమే... చెయ్యినులువు చేసుకోవటానికే... అసలు పెద్దదెబ్బ వెయ్యటం ఈ ప్రదేశంలోనే.

ఎదోలాఉన్నా, నాకుమట్టుకు, నిర్లక్ష్యంగా మెట్లెక్కి లోపలికి ప్రవేశించబోతున్న అతని భుజం పట్టుకులాగాలనిపించింది. "ఏయ్, బుద్ధిలేదూ, తాటికాయలంత అక్షరాలతో ఎర్రగా వెలుగుతూ, మూడు భాషల్లో రాసిన బోర్డు కనిపించటం లేదూ?"

జోపుడి తిరడర్ గళ్ జాగ్రదై.

జేబు దొంగలున్నారు జాగ్రత్త.

బివేర్ ఆఫ్ పిక్‌పాకెట్స్.

"గుడ్డివాడివా, వెర్రివెధవా? నీలాంటివాళ్ల గురించే దాన్నిక్కడ తగిలించారు. లోపల పదిపన్నెండు మందైనా సి.ఐ.డీ.లు ఉంటారు. నా మాట విను, ఇవాళ నీకు మంచిరోజుగా కనిపించటం లేదు."

బోర్డుకేసి ప్రశాంతంగా చూసి, ఈసారి, అతనికి కాబోయే రక్షకుణ్ణైన నన్నూ, నా భావాలనూ లెక్కచెయ్యకుండా, ఖాకీచొక్కా లోపలికి ప్రవేశించాడు. అతను భవనం మేడమీదికి వెళ్లాడు. ఆ స్థలాన్నే ఎందుకు ఎంచుకున్నాడో అర్థం చేసుకోవటం సులభమే. క్రిందిభాగంలో, వాడుకున్న వస్తువులను అమ్ముతున్నారు- బీరువాలు, డ్రాయర్లు... మొదలైనవాటిని. పాతసామాను వ్యాపారం చేసేవాళ్లూ, చిన్న వ్యాపారస్థులూ చాలా జాగ్రత్త మనుషులు. పల్లెటూరి వారికి మల్లే పంచ బిగదీసి నడుముదగ్గర డబ్బుల మూటని గట్టిగా దోపుకుంటారు. మేడమీది భాగంలోనే శిల్పాలూ, ఫొటోలూ, ఆభరణాలూ, ఇంకా అనేక విలువగల వస్తువులూ అమ్మకానికుంటాయి. కొనేవాళ్లు కూడా జేబుల్లో పెద్దపెద్ద నోట్లకట్టలు పెట్టుకొని ఉంటారు. అతన్ని అంటిపెట్టుకొని తిరగటం మహాకష్టమైపోయింది. కనిపించిన నోటీసులన్నీ విజ్ఞానిలా పఠిస్తూ, అవకాశాలను పరీక్షిస్తూ, ఇక్కణ్నించి అక్కడికీ, అక్కణ్నించి ఇక్కడికీ చకచకా నడిచి వెళ్ళిపోతున్నాడు. ఆఖరికి ఎలాగో మేడమీదున్న మూడోగదిలో విదేశీయవస్తువులు వేలం జరుగుతున్న చోట నిలవటానికి నిర్ణయించుకున్నాడు. గదిలో అమ్మకానికున్న వస్తువులు చాలా విలువైన వస్తువులై ఉంటాయి నిస్సందేహంగా. అందుకే, జనసమర్దం అంత ఎక్కువగా ఉందాగదిలో. గదిగుమ్మాని కడ్డంగా ఓ గుంపు చేరింది. లోపలికి ప్రవేశించేందుకు అవకాశం లేదు. వేలంవేసే అతని బల్లదగ్గరికి చేరటంకాని, అధమం అతన్ని చూడటంకాని మాకుమల్లే అప్పుడొచ్చినవాళ్లకి సాధ్యం కాదు. ఆ బల్లకీ గుమ్మానికీ మధ్య ఇరవైముప్పయి వరసల్లో మనుషులు కిక్కిరిసి ఉన్నారు. మునివేళ్ల మీద నిలబడి తలకాయలమీంచి చూస్తే ఎలాగో ఆ వేలంపాడే అతని ముఖం, అతని చేతిలోని సుత్తీ కనిపించాయి- అంతే. ఆ తెల్లని దంతపు సుత్తిని చేత్తో పెట్టుకొని అతను సంగీత సమ్మేళనాన్ని నిర్వహిస్తున్న హానికిమల్లే జనాన్ని ఉండుండి

ఉత్తేజ పరుస్తున్నాడు.

ఒక మామూలు సంసారి, నగరానికి దూరంగా ఏ వడపళని లోనో కుళాయిలూ, విద్యుద్దీపాలూ లేని రెండు గదుల్లో ఉంటూ- ఇక్కడ, ధీరునికి మల్లే జనాన్ని అదుపులో పెడుతు దర్జా వెలిగిస్తున్నాడు. నలగని నూటు, నిగనిగలాడే నల్లనిజుట్టు, చుట్టూ లక్షాధికారులూ- అతను నిజంగానే గర్విస్తున్నట్టున్నాడు - కొద్ది ఘడియల్లో అక్కడున్న విలువైన వస్తువులన్నిటినీ ఒక్క సుత్తిదెబ్బతో రూపాయలుగా మార్చే అధికారాన్ని చెలాయిస్తున్నందుకు. చేతుల్లో బంతులు పెట్టుకొని, వాటిని తమాషాగా ఎగరేస్తూ, ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందే గారడీవానికి మల్లే ఇతను, అక్కడున్న మనుషులు ఇటునుంచీ అటునుంచీ, ఎదుటినుంచీ వెనకనుంచీ విసురుతున్న మాటల్ని చురుగ్గా పట్టుకుంటూ, "ఆరువందలు," "ఆరువందల అయిదు", "ఆరవందల పది" అంటూ ఆ పదాలనే తిరిగి చమత్కారంగా వారిమీదికే విసురుతున్నాడు.

ఓ క్షణంసేపు కనక పాటలో చురుకు తగ్గిందంటే, అతను వెంటనే అందుకుని ఉత్సాహ జనకంగా "ఈ కుడిపక్క ఎవరూ లేరూ?", "అటు ఎడమపక్క కూడా ఎవరులేరూ?" అంటూ కనుబొమ్మలు పైకెత్తి, కంఠంలో ఆశ్చర్యం ఉట్టిపడేటట్టు ప్రశ్నిస్తూ, ఆఖరుమనిషి పాడినదాంతో పాట ఆపేస్తున్నట్లూ, వస్తువు అమ్ముడై పోతున్నట్లూ నూచిస్తూ చేతిలోని సుత్తిని బల్లమీద పెట్టబోతూ, మళ్లీ మరొక్కసారి నలుగురి వైపూచూసి చిరునవ్వు నవ్వుతూ, "ఇదేమిటండీ, అసలుమీరు పాట సరిగ్గా పాడందే!... అద్భుతమైన ఈ వస్తువువెల ఆరువందల పదేనా! అబ్బే..." అంటూ ప్రోత్సాహపరుస్తున్నాడు. మధ్యమధ్య, అప్పుడే హాజరైన వారికి స్వాగతం చెబుతూ, పాట పెంచగల పెద్ద మనుషులవైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. ఏదైనా కొత్తవస్తువును అమ్మకానికి పెడుతున్నప్పుడు.. "ఇదుగోనండీ! ఇది అన్నిటికన్నా ముఖ్యమైనది- ముప్పయిమూడోదండి!" అంటూ నలుగురి దృష్టినీ ఆకర్షించేలా చెప్పటం ప్రారంభిస్తాడు. పాట అతనికి నంతృప్తి కలిగించేవరకూ పెరిగినప్పుడు అతని గంభీరకంఠం మరింత మృదుమధురమవుతోంది. కొన్ని గంటలసేపు వరసగా, నాలుగైదు వందలమంది విసురుతూన్న పదాలు అతని పెదవులపైన దొర్లుతూ, అతని చేతిలోని దంతపుసుత్తి కదలికను అత్యంత శ్రద్ధానక్తులతో ప్రేక్షకులు పరిశీలిస్తుంటే, అతనికి నిజంగా తృప్తి కలుగుతోంది. నిజానికి, పాట పెరగటం అప్రయత్నంగా జరుగుతున్నప్పటికీ, తను నిర్వహించే పాత్ర అతి ముఖ్యమైనదనే భావం అతనికి

సంతృప్తి కలుగజేస్తోంది. అతని కంఠ విన్యాసం, పురివిప్పి నాట్యం చేసే నెమలిని గుర్తుకి తెస్తోంది. కాని, సాయంకాలం నేను చూసినదాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటే, అక్కడి దుకాణంలో కిటికీదగ్గర కూర్చుని తమ వికారచేష్టలతో జనాన్ని ఆకర్షించి తద్వారా నా జేబుదొంగకి అవకాశం ఇచ్చిన కోతులూ, ఈ వేలంవేసే అతనూ ఒకే స్థితిలో ఉన్నారనిపిస్తోంది.

ఆ విధంగా అనుకోకుండా కలిసివచ్చినా, ప్రస్తుతానికి మాత్రం నా మిత్రుడికేమీ లాభంలేకపోయింది. గుమ్మంలో ఉన్న గుంపులో ఇద్దరం ఇరుక్కుపోయాం. ఇక వాళ్ళల్లోంచి దారిచేసుకుని ఆ వేలంవేసే వస్తువులను సమీపించటానికి అవకాశమే లేదు. అయితే, ఈ లలితకళలో నేనింకా ప్రావీణ్యాన్ని పొందలేదన్న సంగతి మరోసారి సుస్పష్టమైంది. నా మిత్రుడు ప్రవీణుడు కాబట్టి, వేలంపాడే అతని చేతిలో సుత్తి బల్లపైన పడగానే (సరిగ్గా అప్పుడే అతను 'ఏడువందల అరవై రూపాయలకు వెళిపోయింది' అంటున్నాడు) గుండెల్ని బిగపట్టే ఉద్రిక్తత సడలిపోయింది. ఎత్తినతలలు యథాస్థానంలోకొచ్చాయి. వేలంవేస్తున్న వాళ్ళు కేటలాగులో ధరలు రాసుకుంటున్నారు. వినుగుపుట్టినవాళ్ళు వెళ్ళిపోతున్నారు. మంచుప్రదేశంలో బీటలు పడినట్లుగా జనసమర్దంలో మధ్య మధ్య ఖాళీలేర్పడుతున్నాయి. ఆ అవకాశాన్ని వెంటనే అందుకున్నాడు మన జేబుదొంగ. ధైర్యంగా ముందుకు చొచ్చుకొని మూడు నాలుగు వరసలు దాటిపోయాడు. అతనిదోవని అతన్ని విడిచిపెట్టకూడదని ఒట్టు పెట్టుకున్న నేను, గుమ్మం ఇవతలే ఒంటరిగా మిగిలిపోయాను.

నేనూ లోపలికి దూరటానికి ప్రయత్నించాను. కాని ఈలోపునే వేలంవేసే అతను ఏదో కొత్త వస్తువు గురించి చమత్కారంగా చెప్పటం ప్రారంభించాడు. బీటలు మూసుకుపోయాయి. నిస్సహాయంగా గుంపులో ఇరుక్కుపోయాను, ఇటూ అటూ ముందూవెనకా, జనం ఒత్తిడిఎంత విపరీతంగా ఉందంటే, నాపక్కనున్నాయన దగ్గినదగ్గుకి నా ఆపాదమస్తకం ఒక్కసారి అదిరిపోయింది. ప్రసరిస్తున్న గాలికూడా దుర్గంధంతో, ధూళితో నిండిపోయింది. ఒకరి ఊపిరి ఒకరు పీలుస్తున్నారు. చెమట కంపు దుర్భరంగా ఉంది. (ప్రజలు డబ్బుకోసం తాపత్రయపడే ప్రతిచోటా ఇంతే). నా మట్టుకు నేను చెమటతో తడిసి ముద్దయిపోయాను. వేస్టుకోటు బత్తాములు పీవాకులని లోపల జేబులో పర్సు జాగ్రత్తగా ఉందో లేదో చూసుకుందా మనుకున్నాను.

ఈ లోపల ఎలాగో మొండిగా రెండు మూడు వరసలు తోసుకుని ముందుకి వెళ్లాను. కాని, లాభం లేకపోయింది. అప్పటికే ఖాకీచొక్కావాడు మాయమైపోయాడు. కాని ఆ గదిలోనే ఎక్కడో ఓ చోట ఉండి తీరతాడు. అతనక్కడున్నాడనే భీకరసత్యం నాకొక్కడికే తెలుసును. ఇవాళ అసలే అతనికి మంచిరోజు కాదు. అతనెక్కడ పట్టుబడిపోతాడోననే ఆదుర్దాతో నా నరాలన్నీ బిగుసుకుపోయాయి. ఎవరి జేబులోనైనా చెయ్యిపెట్టగానే ఎక్కడ పట్టుబడిపోతాడో, ఎప్పుడు "దొంగ... దొంగ" అనే అరుపు నా పాపిష్టిచెవులకు వినిపిస్తుందో, ఎక్కడ పోలీసుల్ని పిలుచుకొస్తారోనని క్షణక్షణం నా గుండె బెదిరిపోతోంది. ఆనాడే అతనికేదో దురదృష్టం పట్టితీరుతుందనే నమ్మకం నాకెలా కలిగిందో నాకే తెలియదు. బహుశా అతని నుదుటిమీద రాసి ఉందేమో.

కాని, అటువంటిదేమీ సంభవించలేదు. ఎవ్వరూ "దొంగ... దొంగ" అని అరవలేదు. ఆ అరుపులుకి బదులు, హఠాత్తుగా నిశ్శబ్దత ఏర్పడింది- అక్కడున్న రెండు మూడు వందల మందీ ఒక్కసారిగా ఊపిరి బిగపెట్టినట్లు, అంతా తదేక దృష్టితో, అత్యంత శ్రద్ధతో వేలంవేసే వాడివైపు చూస్తున్నారు. అతను ఒకటి రెండడుగులు వెనక్కి వేశాడు. అప్పుడు విద్యుద్దీపకాంతి అతని ముఖంమీదపడి తళుక్కుమంది. కారణం గ్రహించాను. అక్కడున్న సామానంతటిలోకీ అతి ముఖ్యమైన వస్తువునితీసి ఇప్పుడు అమ్మకానికి పెడుతున్నాడు. అది, చైనాదేశం నుంచి హిందూ దేశానికి వచ్చిన బౌద్ధభిక్షువులు అశోక చక్రవర్తికి బహూకరించిన బంగారు బుద్ధ విగ్రహం. అదెలాగో నేపాలు దేశపురాజు ఆస్థానానికి చేరి అక్కడ కొన్నాళ్లుండి, కాలక్రమేణా తిరిగి తిరిగి చెన్నపురికి చేరుకుంది. ఇప్పుడీ వేలంవేసేచోట దాన్ని అపురూపంగా ఎంచి దానికి విలువకడుతున్నారు. అది రెండున్నర అడుగుల విగ్రహం. ఇద్దరు మనుషులు దాన్ని మోసుకొచ్చి జాగ్రత్తగా బల్లమీద పెట్టారు. ధన మదాంధకారంలోపడి కొట్టుకుంటున్న జనానికి విజ్ఞానదీప్తిని ప్రసాదిస్తున్నట్లుగా ఉందా బుద్ధవిగ్రహం. వేలంవేసే అతను గొంతుక సర్దుకుని చెప్పటం ప్రారంభించాడు. ఈ విగ్రహం వెలముందే నిర్ణయింపబడిందనీ, పాట మూడు వేల అయిదువందలకు పైనే పాడవలసి ఉంటుందనీ చెప్పాడు. అధమం మూడువేల అయిదువందలు! అంత అంకె వినేసరికి అందరి మనస్సుల్లో ఆలోచనలు రేగి, ఆ విగ్రహంపైన ఒక విధమైన పూజ్యభావం ఏర్పడింది. పాట పాడటానికి కాని, ఒక్క అడుగు ముందుకి వెయ్యటానికి కాని, ఒక్కముక్క మాట్లాడటానికి కాని, ఏ ఒక్కరూ సాహసించలేదు.

ఆఖరికి, ఎడంవైపు కూర్చున్న- బాగా తలనెరిసిన పండుముదుసలి ఒకాయన తలపైకెత్తి మెల్లిగా "మూడువేల ఆరువందలు" అనిగొణిగాడు. అదివిని వెంటనే కుడివైపున కూర్చున్న బట్టతలాయన లేచి "మూడువేల ఎనిమిది వందలు" అన్నాడు. అదివిని ఓ లక్షాధికారి బుగ్గ మీసాలు మెలివేస్తూ "నాలుగు వేలు" అన్నాడు బొంగురు గొంతుతో. పాట కాస్సేపు అలాగే నిలబడిపోయింది. ఆ తరువాత, అందరికన్నా ముందర వరసలో కూర్చున్న విదేశీయుడొకాయన కనుబొమ్మలు పైకెత్తి చేతివేళ్లతో ఏదో సంజ్ఞ చేశాడు. అయనపక్కనే నుంచున్న సెక్రటరీ ఆ సూచనను గట్టిగా మాటల్లో చెప్పాడు. ఆ సెక్రటరీ పేరు అక్కడున్న వాళ్లంతా గుసగుసలాడు తున్నారు. "నాలుగువేల అయిదువందలు". దాంతో, బుగ్గ మీసాలాయనకి తలకొట్టేసినట్లయింది. అయినా, పౌరుషాన్ని నిలబెట్టుకోవాలని మరోవంద హెచ్చించాడు. విదేశస్థుడు కూడా ఊరుకోలేదు. పాట వీరిద్దరి మధ్యా సాగుతోంది. పట్టుదలగా ఇద్దరూ పాడుతున్నారు. ఒకరిముఖాన్నొకరు చూసుకోకుండా, ఇద్దరూ తమదృష్టిని వేలంవేసే అతనివైపు కేంద్రీకరించారు. వేలంవేసే అతను వీరినుండి వారివైపూ, వారినుండి వీరివైపూ సందిగ్ధంగా చూపులు మళ్లిస్తున్నాడు. ఆఖరికి విదేశీయుని సెక్రటరీ ధీమాగా "అయిదు వేలు" అన్నాడు. బుగ్గమీసాలు మెలికలు తిరిగిపోయి మండిపోతున్నాయి. ఏదో పట్టుదలకోసం, బంగారంకదా అని యింత దూరం వచ్చాడు. కాని, ఆ బుద్ధ విగ్రహాన్ని తనేం చేసుకుంటాడు! ఇంక ఊరుకున్నాడు. "అయిదు వేలు" గాలిలో వ్రేలాడుతూ గడ్డకట్టుకు పోతోంది. అత్యధికమవుతున్న ఉత్సాహంతో వేలంవేసే అతను నాలుగుసార్లు అరిచాడు... "అయిదువేలు.. వెళ్ళిపోతోంది" అంటూ. కొంత సేపాగి, ఇంకాఎవరైనా హెచ్చిస్తారేమోననే ఆశతో "ఇంకెవరూ పాడరా?" అన్నాడు. నిశ్శబ్దం, మళ్ళీ "ఇంకెవరూ పాడరూ?" ఆ మాటలు గాలిలో తేలిపోయాయి. ధ్వని తేవటానికి ప్రయత్నించే తీగెలాగ నిశ్శబ్దం కంపిస్తోంది. వేలంవేసే అతను సుత్తి పైకెత్తాడు. సుమారు మూడువందల మంది గుండెలు ఆగిపోయినంతపనైంది. "అయిదు వేలకు వెళ్ళిపోతోంది" అని మళ్లీ మూడు సార్లన్నాడు. అంతా ఊపిరి బిగపట్టుకు నిల్చున్నారు. ఆ దంతపు సుత్తి యింకా పైకిలేచింది. "వెళ్ళిపోతోంది" అన్నాడా వేలంవేసే అతను. సమాధానం లేదు. "వెళ్ళిపోతోంది" సమాధానం లేదు. బల్లమీద టక్కుమంది సుత్తి. ఆ వెనువెంటనే "వెళ్ళిపోయింది" అని వినిపించింది. ఆ వ్యవహారం పరిష్కారమైపోయింది.

అయిదువేల రూపాయలు! గోడకట్టుకు పోయిన ప్రేక్షకులంతా చిన్న చిన్న సజీవ మానవస్వరూపాలుగా విడిపోయారు. పెద్ద నందడి... అంతా గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు... గొంతుకలు సర్దుకున్నారు. అంతా కలిసి ఒక్క ఊపున ఒకరినొకరు తోసుకుంటూ వెనక్కొచ్చేశారు.

ఎవడో కొత్తమనిషి చేతితోపు నాకూ తగిలింది. దాంతోబాటే ఎవరో "క్షమించండి" అని గొణిగారు. నేను కొయ్యబారిపొయ్యాను. అదేకంఠం! అవును, అతనే. అదృష్టవశాత్తు ఆ గుంపంతా నాపక్క నుంచే తోసుకుపోయింది ముందుకి. అతను నా దృష్టిపథం నుంచి తప్పించుకున్నాక మొదటిసారి అతను నా పక్కన ఉన్నాడు. తిరిగి నేనతన్ని కనిపెడుతూ ఉండి, అతనికి రక్షణ ఇవ్వచ్చును. అయితే, అతని కళ్లల్లోకి సూటిగా మాత్రం చూళ్లేదు. చాటుగా అతని చేతులవైపు, అతనుపయోగించిన పనిముట్లవైపు చూశాను- కాని అవి అక్కడ లేవు! అతని చొక్కాచేతులు రెండూ క్రిందికి వ్రేలాడుతున్నాయి. చలివేస్తున్నట్టు, గుప్పిళ్లు రెండింటినీ లోపలికి ముడిచి పెట్టేసుకున్నాడు. ఒకవేళ ఇప్పుడు ఎవరిజేబైనా కత్తిరించ దలుచుకున్నప్పటికీ, ఎదుటివాడికి మాత్రం అమాయకంగా కనిపించే చొక్కాచేతులే తగుల్తాయి కాని, అందులోదాక్కున్న జేబుదొంగ భీకరహస్తాలుమాత్రం కంటపడవు- పిల్లి పంజాకుండే గోళ్లకుమల్లే. భలే ఉపాయం! అయితే ఇంతకీ తన విద్యను ఎవరిమీద ప్రయోగిస్తాడు? నేను అతిజాగ్రత్తగా అతని కుడివైపుకి చూశాను. అక్కడ ఒక బక్కపలచటి మనిషి నిలుచుని ఉన్నాడు. కోటుబొత్తాలన్నీ బిగించే ఉన్నాయి. ఆయన ముందర, దృఢంగా కనిపిస్తున్న పెద్దమనిషి ఒకాయన ఉన్నాడు. వీపు విశాలంగా ఉంది. వీళ్ళిద్దరిలోనూ ఎవరిమీదో ఒకరిమీద మంచి దిట్టమయిన దెబ్బ తీస్తాడనే నమ్మకం కలిగింది నాకు. ఇంతలోకే హఠాత్తుగా నామోచేతికేదో మెత్తగా తగిలినట్లయింది. నేనే వాడి మోసానికి గురి అవుతున్నానేమోననే భావంతో నాఒళ్లు జలదరించింది.

"నీ చర్యలన్నిటినీ మొదటినుంచీ కనిపెడుతున్నవాడికే నీ ప్రతాపం చూపించేటంత మూర్ఖుడివా? నీహస్తకళ గురించి అతిముఖ్యమైన ఆఖరు పాఠాన్ని నేర్పటానికి, దాన్ని నామీదనే ప్రయోగించాలా?" ప్రారంభం నుంచీ అతనితోబాటు తిరుగుతూ, అతనిపైన సానుభూతి చూపించిన నన్నే ఏరికోరి ఎంచుకొన్న దౌర్భాగ్యజీవి!

అవును, సందేహం లేదు. ఆ జేబుదొంగ మోచెయ్యి నా నడుముని మెల్లిమెల్లిగా నొక్కుతోంది. అందులో దాక్కున్న భీకరహస్తం కదులుతోంది. నా చొక్కాకీ వేస్టుకోటుకీ మధ్య పాము నాలుకలా కాటువెయ్యటానికి చూస్తోంది.

నిజమే, నేనీలోపల సర్దుకోవటానికి కావలసినంత అవకాశం ఉంది. ఏమీ అవసరం లేదు- నేనొక్కసారి అతనికేసి చూస్తేచాలు- లేకపోతే కోటు బొత్తాములు పెట్టుకున్నా చాలు. కాని, ఏంచెయ్యటానికీ నాకు ధైర్యం చాల్లేదు.

ఉద్రేకంతో, ఆదుర్దాతో నా శరీరమంతా మంత్రముగ్ధమై పోయింది. ఈ అర్థం లేని ఆవేదనలో నా నరాలన్నీ బిగుసుకుపోయాయి. శరీరం గడ్డ కట్టుకుపోయినట్టుంది. గబుక్కుని ఆలోచించాను- నా పర్సులో యెంత డబ్బుందోనని. అలా ఆలోచిస్తూండగా, (శరీరంలోని ప్రతిభాగం- పన్ను కానీ, కన్నుకానీ చిటికిన వ్రేలుకానీ- దానిగురించి ఆలోచించటం ప్రారంభించగానే దాని చైతన్యం అధికమవుతుంది) వక్షంమీద పర్సు మెల్లగా నొక్కుతున్నట్లు తోచింది. నేను అక్కడే, అలాగే నిశ్చలంగా నిలబడి, జరుగనున్నది తెలుసుకొని; చెయ్యవలసిందేమిటో తెలుసుకొని, ఆ దోపిడీ కోసం ప్రశాంతంగా నిరీక్షించాను. విచిత్రం ఏమిటంటే, అది జరగాలని వాంఛిస్తున్నానో, జరగకూడదనుకుంటున్నానో నాకే తెలియటం లేదు. నా భావాలన్నీ సుడిగాలిలో చిక్కుకున్నాయి. నేనప్పుడు ద్వంద్వముఖంగా ఉన్నాను- అతని మంచికోసమే అయితే, ఆ మూర్ఖుడు నన్నొదిలెయ్యాలనే అనుకున్నాను; మరోపక్క, దంతవైద్యుడి సమక్షంలో కూర్చుండగా, వైద్యుని చేతిలో సూది వంటిని సమీపించినప్పుడు ఉండే గుండెదడస్థితిలో ఉండి నిరీక్షిస్తున్నాను. కాని, ఖాకీచొక్కావాడు నా ఆసక్తికి తగిన శిక్ష విధించాలన్నట్లు, కించిత్తు కంగారుపడకుండా క్రమక్రమంగా నన్ను సమీపిస్తున్నాడు. అతని ఊపిరి వెచ్చగా తగిలింది నాకు. అడుగడుగు చొప్పున నాదగ్గరికి జరుగుతున్నాడు. నా స్పర్శజ్ఞానమంతా అతని సంపర్కానికి వినియోగిస్తూండగా, జ్ఞానేంద్రియం ద్వారా వేలంపాట ఎంతవరకు సాగిందో, ఏ స్థితిలో ఉందో తెలుసుకుంటూనే ఉన్నాను..." మూడువందల డబ్బయి... పైచెయ్యి ఎవరిదైనా ఉందా?... మంచిది, మూడు వందల డబ్బయి... ఇద్దరు... మూడువందల ఎనభై... తొంభై... ఇంకా పాడేవాళ్లున్నారా?... ఆ... నాలుగువందలు... నాలుగువందలు... నాలుగువందల్కు... నాలుగొందలికి వెళ్ళిపోతుంది... పోతోంది... పోతోంది... పోయింది" గొంతుక తగ్గిపోయింది.

మళ్లీ గుంపులో బిగువు సడలిపోయింది. వేలంపాట అయిపోగానే జనమంతా ఒక్కఊపున వెనక్కొచ్చేశారు. ఉద్రేకం తగ్గింది. ఆసమయంలో నా వక్షంమీద మెల్లిగా తేపుతగిలినట్లుగా తోచింది. స్పష్టంగా లేదు. పాము కదలికలా తేలిగ్గా, సున్నితంగా ఉంది. ముందరనుంచీ నేనాసంగతి గ్రహించి, చైతన్యం కలిగి- ముఖ్యంగా ఆ ప్రమాదస్థలంలో చైతన్యం కలిగి ఉండకపోయినట్లయితే నాకీ సంగతి తెలిసేదే కాదు. యథాలాపంగా ఎవరిచెయ్యో నాకోటుకి రానుకుపోయినట్లుగా, ఏ పావురమో నన్ను రెక్కతో విదిల్చి ఎగిరిపోయినట్లుగా... అప్పుడు.

అప్పుడేం జరిగిందో అది నాకే ఆశ్చర్యం కలిగింది... నా స్వహస్తం చటుక్కున పైకిలేచి నా కోటుకిందికి దూరిన సన్ననివేళ్లని గట్టిగా పట్టుకుంది. అసలు నన్ను నేను సంరక్షించుకునేందుకు ఇంత మోటుగా ప్రవర్తించాలని నేను అనుకోనేలేదు. నా మనస్సు నా స్వాధీనంలో లేకపోవటం నాకాశ్చర్యం కలిగించింది... ఆత్మ సంరక్షణ మానవసహజ లక్షణం కాబట్టి. ఆ 'లక్షణం' నన్ను సంరక్షించుకోమని ప్రేరేపించి ఉంటుంది. ఆ అవకాశాన్ని జారవిడుచుకోకుండా, అప్పుడే నా చెయ్యి మరో ముంజేతిని- చల్లగా అయిపోయి వొణికిపోతున్న అతని ముంజేతిని బలంగా పట్టుకోవటంతో, సంభ్రమం, భయం నన్నావహించాయి. అంత చురుగ్గా ఫలించిన నా కదలిక నిస్సందేహంగా, ఉద్దేశపూర్వకంగా మాత్రంకాదు... అనాలోచితంగా జరిగిపోయింది.

ఈ క్షణాన్ని వర్ణించటానికి నా శక్తి చాలదు. ఆవిధంగా ఒక అపరిచితుని అవయవాల్లో ఒకదాన్ని అంత బలంగా పట్టుకోవటానికి బెదురుపుట్టి నా నరాలు బిగుసుకు పోతున్నాయి. అలాగే అతనుకూడా విపరీతమైన భయంతో కొయ్యబారిపోతున్నాడు. అతని ముంజేతిని వొదిలిపెట్టటానికి నాలో బలం, పరిజ్ఞానం లోపించినట్లే, అతనికి కూడా తనచేతిని గబుక్కున లాగేనుకోవటానికి ధైర్యం, పరిజ్ఞానం లోపించాయి.

"నాలుగువందల యాభై... నాలుగువందల అరవై... డబ్బై"... బల్ల దగ్గర నుంచి వేలంవేసే అతని గొంతు వినిపిస్తూనే వుంది... నేనింకా కంపించిపోతున్న దొంగ చేతిని పట్టుకునేవున్నాను... నాలుగువందల ఎనభై. తొంభై..." ఆ గొంతు అరుస్తూనే వుంది... ఇంతసేపూ ఆ దొంగకీ నాకూమధ్య ఏం జరుగుతోందో ఎవ్వరికీ

తెలియదు. ఈ గదిలో ఇద్దరు వ్యక్తుల మధ్య విధివశాత్తూ పెద్ద సంఘర్షణ (శారీరకంగా కన్న, మానసికంగా) జరుగుతోందని ఎవ్వరూ అనుమానించనైనా లేదు... "అయిదు వందల పది... యిరవై... ముప్పయి... నలభై... యాభై..." అంకెలు బద్ధకంగా సాగుతున్నాయి. ఈ గొడవ మహాఅయితే పదిహేను క్షణాలపాటు జరిగి ఉంటుంది. అప్పటికి నేను తిరిగి ఊపిరి పీల్చుకోగలిగాను. చెయ్యిపట్టు వదిలేశాను. ఆ అపరిచితుని హస్తం వెనక్కివెళ్ళిపోయి ఖాకీచొక్కా చేతిలోకి మాయమైపోయింది.

"అరవై... డెబ్భై... ఎనభై... తొంభై... ఆరువందలు... ఆరువందలు... ఆరువందల పది..." అంటున్నాడు వేలంవేసే అతను. మేమిద్దరం- నేనూ, నన్ను దోచుకోవాలనుకున్న కాబోయే దొంగ ఒకరిపక్కన ఒకరం- ఒకేరకమైన అనుభవంతో కొయ్యబారిపోయి (రహస్యతంత్రంలో భాగస్థులుగా) నిశ్శబ్దంగా నిల్చున్నాం. ఇంకా అతని శరీరం వెచ్చగా నాకు తగులుతూనే ఉంది. ఉద్రిక్తత తగ్గిపోగానే, నా మోకాళ్లు వణకటం ప్రారంభించాయి. నాకు తగులుతున్న మోకాల్లో కూడా అదేవిధమైన కంపన కలుగుతున్నట్లు నేనూహించుకున్నాను. "ఆరువందల ఇరవై... ముప్పై... నలభై... యాభై... అరవై... డెబ్భై..." ఆ బొంగురుగొంతు అరుస్తూనే వుంది. ఇంకా సామానంతా అమ్ముడుపోలేదు. మేమిద్దరం ఒకరి పక్కన ఒకరం భీకరశైత్యావరణంలో ఇరువురం బంధింపబడినట్లు నిశ్చలంగా నిలబడ్డాం. ఆఖరికి ఎలాగైతేనేం, నాతల పక్కకి తిప్పి అతన్ని పరిశీలించే శక్తి సమకూర్చుకున్నాను. మాచూపులు కలుసుకున్నప్పుడు, "మీకు పుణ్యముంటుంది... నన్ను పట్టించకండి... నన్నొదిలి పెట్టండి... కనికరించండి" అని అతని ప్రార్థనను అర్థం చేసుకున్నాను. అతని అంతరంగంలో అణచిపెట్టుకున్న భయాన్నంతా గ్రహించాను. కిరాతకుడి చేతికి చిక్కిన క్రూరమృగంలా భయాన్నీ, ఆదుర్దానీ ప్రసరిస్తున్నాయతని వెలవెలబోయే కనుపాపలు. అతని దుబ్బుగడ్డం భయభారానికి కంపిస్తోంది. అన్నిటికన్నా ఆ భీతనేత్రాలే నన్నెక్కువగా ఆకర్షించాయి. అతని ముఖలక్షణాల్లో విపరీతమైన భయం వ్యక్తమవుతోంది. అటువంటి స్థితిలో ఏ మనిషినీ, నేను అంతకుముందుగాని, తరవాత కాని చూడలేదు. జీవన్మరణశక్తులు నా చేతుల్లో ఉన్నట్టుగా, ఒక తోటి మానవుడు నావైపు అటువంటి బానిసచూపు చూస్తుంటే అవమానంతో క్రుంగిపోయాను. అతని ఆందోళన నన్ను కుంచింపజేసింది. ఆ వ్యాకులత భరించలేక తలపక్కకి

తిప్పుకున్నాను.

అతను అర్థం చేసుకున్నాడు. అతను తెలుసుకోవాలనుకున్నది తెలుసు కున్నాడు. అతన్ని నేను నిందించటం కాని, పోలీసులకు అప్పచెప్పటం కాని, చెయ్యనని తెలుసుకున్న తర్వాత, అతనికి కొస్త ధైర్యం చిక్కింది. ఒక్క కుదుపుతో నన్ను తప్పించుకొని వెళ్ళిపోయాడు. ఇక జన్మలో నన్ను కలుసుకోకూడదనే అతని కోరిక. అతని కంపించే మోకాలు నాకు తగులుతున్నదనే భావం ఇప్పుడు లేదు... అతని ఒంటి వెచ్చదనం కూడా సోకటం లేదు. మరోసారి, ఆ కళాకారుడు చురుగ్గా కదిలి జనప్రవాహంలోంచి చేపలా ఈదుకుంటూ వెళ్ళిపోయాడు.

అతని వెచ్చదనం నాకు తగలటం ఆగిపోయిన క్షణంలో, అతన్నంత సులభంగా వదిలించుకోకూడదని నా హృదయం కొట్టుకుంది. నా మూలంగా అతనుపడ్డ భయానికి బదులుగా నేనేదైనా ముట్టచెప్పవలసి ఉంది. అంతకన్న ముఖ్యం- అతను హస్తకళ గురించి నాకు నేర్పిన పాఠాలకు గురుదక్షిణ ఇచ్చుకోవలసి ఉంది. ఏదో కొంత ధనరూపంగా అతనికిచ్చి తీరాలి. త్వరత్వరగా అతని వెనకాలే బయలు దేరాను వీధి గుమ్మం వరకూ. కాని, ఆ వెర్రి వెధవ నారాకనూ, నా ఉద్దేశాలనూ అపార్థం చేసుకున్నాడు. నా మనస్సు మార్చుకున్నాననీ, అతన్ని పోలీసులకి అప్పజెప్పటానికి నిశ్చయించుకున్నాననీ భ్రమించాడు. నేను వీధిగుమ్మందాటే లోపుగానే అతను వచ్చేపోయే జనంలో కలిసి మాయమైపోయాడు. వీలైనంత వేగంగా వీధులన్నీ దాటిపోతున్నాడు. ఒక్క క్షణంపాటు కనిపించి అతని ఖాకీరంగు చొక్కా మాయమైపోయింది. నా అసంకల్పిత పరిశోధన పరిసమాప్తమైంది.

# అపరిచిత లేఖ

ప్రఖ్యాత నవలా రచయిత రవి, సెలవుల్లో ప్రశాంతంగా ఉంటుందని పల్లెటూరు వెళ్ళొచ్చాడు. ప్రొద్దుటే పట్నం చేరగానే, స్టేషనులో వార్తాపత్రిక కొనుక్కున్నాడు. దానిమీద తారీఖు చూడగానే ఆ రోజు తన "పుట్టినరోజు" అన్న సంగతి గుర్తుకొచ్చింది. "నలభై వొకటి"- మెరుపులా వచ్చిందా తలపు. అందుకే అతను సంతోషించనూ లేదు, విచారించనూ లేదు. ఓ అద్దెకారు మాట్లాడుకొని, దారిలోనే పత్రికవిప్పి కారుకుదుపుకి చెదిరిపోతున్న అక్షరాలను చదువుకున్నాడు. ఇంటికి వెళ్ళగానే నౌకరు అతను ఊళ్లో లేనప్పుడు వచ్చినవాళ్ల పేర్లన్నీ చెప్పాడు. అవికాకుండా, అతనికొచ్చిన టెలిఫోన్ సందేశాలను కూడా అందించాడు. ఓ ఉత్తరాల కట్టొకటి ఎదురుచూస్తోంది. వాటన్నిటినీ మామూలుగా చూసి అందులోంచి రెండు మూడు మాత్రం విప్పి చూశాడు- పంపినవారి ప్రాముఖ్యాన్ని బట్టి. కొత్తదస్తూరితో రాసిన ఒక కాగితాల కట్టను మాత్రం పక్కగా పెట్టేశాడు. కాలకృత్యాలన్నీ తీర్చుకున్నాక కాఫీతాగి, పేపరు పూర్తిగా చదివి, ఏవో కొన్ని నోటీసులవీ చూశాక, అప్పుడు సావధానంగా పడకకుర్చీలో జార్లబడి సిగరెట్టు వెలిగించాడు. మిగిలిన ఉత్తరాన్ని తీసుకున్నాడు.

దాన్ని లేఖ అనటం కన్న లిఖితగాథ అంటే బావుంటుంది. అడవాళ్ల దస్తూరిలో, ఆదరాబాదరాగా రాసిన అక్షరాలతో, కొన్ని డజన్ల కాగితాలవి. అప్రయత్నంగా మరోసారి కవరుతీసి చూశాడు అందులో ఏదైనా చీటీగాని ఉండిపోయిందేమోనని. అటువంటిదేమీ లేకపోగా, కవరు మీదగాని, లోపలి కాగితాలమీద గాని, ఎక్కడా పంపినవాళ్ల చిరునామా కనిపించలేదు. "విచిత్రంగా ఉంది" అనుకున్నాడు, ఆ రచన చదవటానికి పూనుకుంటూ. మొట్టమొదటి మాటలు పెద్ద అక్షరాలతో ప్రత్యేక వరుసలో, "నేటికీ నేనెవరో తెలియని మీకు," అని రాసి ఉన్నాయి. అతనికేమీ అర్థంకాలేదు. ఈ ఉత్తరం తనకే ఉద్దేశింపబడిందా లేక ఏ ఊహాపురుషునికైనానా?

ఉన్నట్టుండి అతనిలో కుతూహలం బయలుదేరింది. చదవటం సాగించాడు.

నా కొడుకు నిన్న చచ్చిపోయాడు. క్షీణించిపోతున్న ఆ చిన్నప్రాణంకోసం మూడు రాత్రుళ్ళు, మూడు పగళ్ళూ మృత్యువుతో పోరాడాను. వరసగా నలభై గంటల సేపు, చలిజ్వరం, సలసల కాలుతున్న కుర్రవాడి శరీరాన్ని కుదిపేస్తుంటే, వాడిప్రక్కనే కూర్చున్నాను. తడిగుడ్డలు వాడి నుదుటిమీద పెడుతూవచ్చాను రాత్రీ పగలూ, పగలూ రాత్రీ. కొట్టుకుంటూన్న వాడి చిన్న చేతుల్ని పట్టుకొని కూర్చున్నాను. మూడోనాటి సాయంకాలానికి నా ఒంట్లో ఓపిక కూడా హరించుకుపోయింది. నాకు తెలియకుండానే నా కన్నులు మూతలు పడ్డాయి. మంచంపట్టీ మీద తలపెట్టుకొని మూడు గంటల సేపు నిద్రపోయి ఉంటాను. ఈలోపుగానే వాణ్ని మాయదారి మృత్యువు మింగేసింది.

అదుగో, ఆ కుక్కిమంచం మీద చచ్చిపడి ఉన్నాడు- నా చిన్నారి నాయన. ఆ నల్లటి తెలివైన నయనాలు మూసుకున్నాయి- అంతే. హస్తాలు రెండూ వక్షస్థలం మీద ఉన్నాయి. తలవైపు ప్రమిదలో వత్తి వెలుగుతోంది. కానలేక పోతున్నాను... కదల్లేక పోతున్నాను. ఆ దీపం మిణుకు మిణుకుమన్నప్పుడల్లా వాడిముఖం మీదా, ముడుచుకున్న మూతిమీదా వికృతచ్ఛాయలు విహరిస్తున్నాయి. వాడి అవయవాలలో చలనం కలుగుతున్నట్లు, వాడింకా బ్రతికే ఉన్నట్లు, వాడు నిద్ర లేస్తాడనీ, నన్ను "అమ్మా" అని పిలుస్తాడనీ అనిపిస్తోంది. నాకు తెలును వాడు చచ్చిపోయాడని. వాణ్ణి యింక చూడలేననీ, ఆశపడితే ఫలితం నిరాశేననీ తెలునును. నాకు తెలును నా కొడుకు నిన్ననే పోయాడని. నా కిప్పుడీ లోకంలో మిగిలిపోయినది మీరొక్కరే- మీరొక్కరే. నేనెవరో మీకు తెలియదు... మీరుమాత్రం మామూలుగా మీ విలాసాలతో ఖులాసాగా జీవిస్తున్నారు. నేనెవరో నేటికీ మీకు తెలియకపోయినా, నేటికీ మిమ్మల్ని నేను ప్రేమించటం మానలేదు.

మరో ప్రమిదలో వత్తివెలిగించి దానిముందు కూర్చుని మీకిప్పుడు రాస్తున్నాను. నా హృదయంలోని బాధను ఎవరితోనైనా చెప్పుకోకుండా, ఈ శిశుశవం సాన్నిధ్యంలో ఒంటరిగా ఉండలేను. ఇటువంటి భీకర క్షణాల్లో మీకు కాకుంటే - ఇప్పటికీ నా జీవిత సర్వస్వం అయిన మీకు కాకుంటే - మరెవరికి చెప్పుకోను? బహుశా నా హృదయములో ఉన్నదంతా మీకు చెప్పలేకపోతానేమో. ఒకవేళ చెప్పినా మీరు నన్ను

అర్థం చేసుకోలేకపోతారేమో. నా తల భారంగా ఉంది. నా కణతలు పోట్లుపెడుతున్నాయి; చేతులూ కాళ్లూ సలుపుతున్నాయి; జ్వరం తగిలిందనుకుంటాను. ఈ ప్రదేశంలో చలిజ్వరం విపరీతంగా వ్యాపించింది. ఒకవేళ నాకూ పట్టుకుందేమో. ఇదే దారిని నాబిడ్డని నేను చేరగలిగితే నాకు విచారం లేదు. ఉండుండి నా కళ్ల ముందు అంతాచీకటి అలుముకుంటోంది. బహుశా నేనీ ఉత్తరాన్ని పూర్తిచెయ్యలేక పోతానేమో. కానీ నా శక్తినంతా వినియోగించి ప్రయత్నిస్తాను... ఈ సారి... ఈ ఒక్కసారీ మీతో మాట్లాడేందుకు... నా ప్రేమపాత్రులైన మీతో... నేటికీ నన్నెరుగని మీతో... మీ ఒక్కరితోనే నేను చెప్పదలుచుకున్నాను... ప్రప్రథమంగా ప్రతీదీ మీతో చెప్పాలని, గడచిన నా జీవితాన్నంతా మీరు తెలుసుకోవాలని ఉంది నాకు. నా బ్రతుకంతా మీ కోసమే... మీకుమాత్రం అదేమీ తెలియదు. నా రహస్యం నా మరణానంతరమే మీకు తెలుస్తుంది... అప్పుడు మీరెవరికీ సమాధానం చెప్పుకోవలసిన అవసరం ఉండదు. నా ఒంటిని ఇప్పుడు ఒణికిస్తున్న చలి, జ్వరం, నా జీవితాన్ని అంతం చేసిన మీదటే, మీకీ సంగతి తెలుస్తుంది. ఒకవేళ నేను బ్రతికుంటే ఈ ఉత్తరాన్ని చింపేసి మళ్లీ ఎప్పటిలా మౌనం వహిస్తాను. ఈ ఉత్తరాన్ని మీరు మీ చేతులతో పట్టుకున్నారంటే- ఒక మృత స్త్రీ తన జీవితగాథను- ఆరంభం నుంచి అంతవరకూ మీ కర్పించిన జీవితగాథను చెప్పుకుంటోందనే భావించండి. నా మాటలికి మీరు భయపడవలసిన ఆగత్యం లేదు. చచ్చిపోయిన స్త్రీ కోరేదేమీ ఉండదు... ప్రేమకాదు... దయకాదు... సానుభూతి కాదు... అయితే, నేను కోరేదొక్కటే... నాలోని బాధ నాచేత చెప్పిస్తున్నదంతా మీరు విశ్వసించాలని. నా మాటలు నమ్మండి, నేనింక మిమ్మల్ని అడిగేదేమీ లేదుకదా! తన ఒక్కగాని ఒక్క బిడ్డ మృత్యుశయ్య సాన్నిధ్యంలో ఏ తల్లీ అబద్ధం ఆడదు.

నా జీవితగాథ మీకు వినిపిస్తాను... నిజానికి నా జీవితం మిమ్మల్ని మొట్ట మొదటిసారి చూసేవరకూ ఆరంభం కాలేదు. అంతకుముందు జీవితం గుర్తుకు తెచ్చుకున్నప్పటికీ అంతా అస్పష్టంగా అయోమయంగా ఉంటుంది... నానాచెత్త, దుమ్ము, ధూళితో నిండిన డబ్బాలా వుంటుంది... నా హృదయంతో నిమిత్తం లేనిచోటు అది. మీరు నా జీవితంలో ప్రవేశించినప్పుడు నా వయస్సు పదమూడు సంవత్సరాలు. నేనప్పుడున్న ఇల్లు- ప్రస్తుతం మీరుంటున్నదే- ఇప్పుడీ క్షణంలో ఈ ఉత్తరాన్ని చదువుతున్న ఇంట్లోనే ఉండేదాన్ని- అదే అంతస్తులో- మీ భాగానికి ఎదురుగా ఉన్న

భాగంలో ఉండేవాళ్లం. మా తలుపుకి మీతలుపు ఎదురు. మీరు మమ్మల్ని మరిచే పోయిఉంటారు. చాలాకాలం క్రిందటే- ఆ విధవావిడ గుమాస్తాగారి భార్యనీ, ఆ ఎదిగీ ఎదగని సన్నటమ్మాయినీ మరిచిపోయి ఉంటారు. మేమెంతో మర్యాదగా ఉండేవాళ్లం- మధ్యతరగతి సంసారులకు మచ్చుగా, మాపేరూ ఊరూ మీకు తెలిసి ఉండటం అసంభవం. మా గుమ్మానికి బోర్డు లేదు. మాఇంటికి గొప్పగొప్ప వాళ్లెవరూ వచ్చేవారు కాదు. అదీగాక, ఇప్పటికప్పుడే పదిహేను సంవత్సరాలు కావస్తున్నది. మీకు జ్ఞాపకం ఉండటం నిజంగా అసంభవం. కాని, నేనో, ప్రతి చిన్న విషయం నాకెంత బాగా గుర్తుంది! అదంతా ఈ మధ్యే జరిగినట్లు, నేను మొట్టమొదట మీ గురించి విన్నప్పటి, మిమ్మల్ని చూసినప్పటి క్షణం, రోజూ నాకు జ్ఞాపకం ఉన్నాయి. అందుకు విరుద్ధంగా ఉండమన్నా ఎలా ఉంటుంది- మీతోనే నాకు లోకమయినప్పుడు? కాస్సేపు ఓపికపట్టండి... మొదటినుంచి చివర దాకా నన్ను చెప్పనివ్వండి... అప్పుడే, ఈ కాస్సేపటికే విసుక్కోకండి... ఎందుకంటే, నేను జీవితాంతం మిమ్మల్ని ప్రేమించటానికి విసుక్కోలేదుకదా.

మీరు రాకముందు మీరున్న వాటాలో సంస్కారం అంటే తెలియని అడివిరకం మనుషులుండేవారు. నిత్యం పోట్లాడుకోవటమే వాళ్లపని. వాళ్లుకూడా తినటానికి లేనివాళ్లయినా మేము దూరంగా, మర్యాదగా ఉండేవాళ్లమని మా పేదరికాన్ని చూసి అసహ్యించుకునేవారు. ఆ ఇంటాయన బాగా తాగి పెళ్లాన్ని తన్నేవాడు. ఆ ఇంట్లో అర్ధరాత్రివేళ ఒక్కొక్కరోజున ప్లేట్లు పగిలినట్లు, కుర్చీలు దొర్లినట్లు అనేకరకాల చప్పుళ్లవుతూంటే మాకు మెలుకువ వచ్చేసేది. ఓరోజున రక్తం కళ్లపడేట్లు కొట్టాడు ఆవిణ్ణి. ఆవిడ కుర్చీపీట చేత్తో పట్టుకొని ఇంట్లోంచి బయటికి వచ్చేస్తూంటే మొగుడు బూతులు తిడుతూ ఆవిణ్ణి తరుముకొచ్చాడు. అప్పుడు చుట్టుపక్కల వాళ్లంతా మేడమెట్ల దగ్గరికి పరుగెత్తుకొచ్చి, పోలీసుల్ని పిలుస్తామని బెదిరించారు. మా అమ్మ వాళ్ల వైపుకి వెళ్లేదికాదు. నన్ను వాళ్ల పిల్లలతోకూడా ఆడుకోనిచ్చేది కాదు. అందుకని వాళ్లు నన్ను వెక్కిరించేవారు. నేను వీధిలో కొస్తేచాలు, ఎవో పేర్లు పెట్టి పిలిచేవారు. ఓసారి పెంకుతీసుకొని నా మీదికి విసిరేశారు- నా నుదుటి మీద రక్తం కూడా వచ్చింది.

ఆ యింట్లో మిగిలిన వాటాల్లో కాపురం ఉంటున్న వాళ్లంతా వీళ్లని అసహ్యించుకునేవారు. ఏదో గొడవజరిగి, వాళ్లంతా వెళ్ళిపోతున్నారని తెలిసేసరికి అందరికీ

పెద్ద బరువుదించినట్లైంది. ఏదో దొంగతనం చేసినందుకు ఆయన్ని పట్టుకున్నారనుకుంటాను. కొన్నాళ్లపాటు "ఇల్లు అద్దెకు ఇవ్వబడును" అని బోర్డు కట్టారు వీధి గుమ్మానికి. కొన్నాళ్ల తరవాత దాన్ని తీసేస్తూ, ఇంటియజమాని మాతో చెప్పాడు ఎవరో పుస్తకాలు రాసే ఆయన అద్దెకు తీసుకుంటున్నాడనీ. ఆయనకింకా పెళ్ళి కాలేదనీ, మర్యాదగా ప్రవర్తించే రకమేననీ కూడా తెలిసింది. అదే మొదలు నేను మీపేరు వినటం.

కొద్దిరోజులు పోయాక గదులన్నీ శుభ్రం చేయించారు. గోడలకి వెల్లవేసేవాళ్లూ, తలుపులకీ వాటికీ రంగులువేసేవాళ్లూ వచ్చారు. వాళ్లు పెద్ద హడావిడిచేసేవారు. మా అమ్మకి మాత్రం సంతోషంగానే ఉండేది, పక్కవాటాలో గొడవలు పోయాయికదా అని. సామాను తెస్తున్నప్పుడెప్పుడూ మిమ్మల్ని చూడలేదు నేను. మీ నౌకరే అన్నీ చూస్తూ ఉండేవాడు. అతను కూడా కాస్త వయస్సు మళ్లినవాడు... తలనెరిసింది. మంచి సంసారాల్లో మసలిన రకం అని అతని ప్రవర్తనవల్లనే తెలిసేది. అతని పనితనం చూస్తే ముచ్చటేసింది మాకు. మావంటి చిన్న చిన్న సంసారాల్లో అటువంటి సంస్కారం ఉన్న నౌకర్లు ఉండటం ఎరుగం. మిగిలిన తక్కువరకం నౌకర్లతో కలిసి పరాచకాలాడటం వంటి పనులు చేసేవాడుకాడు. చాలా మర్యాదగా ఉండేవాడు. మొదటి నుంచీ మా అమ్మనెంతో గౌరవంగా చూసేవాడు. ఒక గృహిణిని చూసినట్లు, చిన్నదాన్నైనా నా దగ్గరకూడా వినయంగా ఉండేవాడు.

మీ గురించి చెప్పవలసి వచ్చినప్పుడల్లా, ఎంతో ఆప్యాయంగా, ఇంట్లో మనిషికిమల్లే చెప్పేవాడు. అందుకే రంగయ్య అంటే నాకు చాలా ఇష్టంగా ఉండేది. అతనంటే ఈర్ష్యగాకూడా ఉండేది- ప్రతినిత్యం మీసమక్షంలో ఉండి మీకు సేవచేసే భాగ్యం అతనికి లభించినందుకు.

ఈ గొడవలన్నీ మీతో ఎందుకు చెబుతున్నానో తెలుసా? నేనింకా సిగ్గుతో, బిడియంతో చిన్నపిల్లగా ఉన్నప్పుడే మీ వ్యక్తిత్వానికి నాపైన ఎంత ప్రభావం ఉండేదో మీరు అర్థం చేసుకోవాలి. నేను మిమ్మల్ని చూడక మునుపు - మీకు బట్టతల ఉండేది. మీకు బోలెడు డబ్బూ, హోదా ఉండేవి. సంకుచిత జీవితాలు గడిపే జనం నూతనత్వాన్ని ఆకాంక్షిస్తారు. ఈ యింట్లో ఉన్న అన్ని వాటాల్లోవాళ్లూ మీ రాకకోసం అత్యాసక్తితో ఎదురు చూశారు. ఇక నా మట్టుకునేను... ఆ కుతూహలం

ఎంతవరకూ హెచ్చిందంటే... మీ గుమ్మం ముందు సామానుతో లారీ కనిపించేసరికి జ్వరం వచ్చినంత వేడెక్కిపోయింది నా ఒళ్లు ఉద్రేకంతో. పెద్దపెద్ద సామాన్లన్నీ పైకి తీసుకుపోయారు. ఇక చిన్న వస్తువులు పట్టుకెడుతున్నారు కూలివాళ్లు. నేను తలుపుదగ్గర నుంచుని మీ సామానంతా పరికించి చూశాను... మీకు సంబంధించిన ప్రతి వస్తువూ ఎంతో అసామాన్యంగా అపురూపంగా తోచింది నాకు. రకరకాల బొమ్మలూ, రంగు రంగుల పటాలూ, అన్నిటికన్నా ఆఖర్ని పుస్తకాలు- ఎంత ముద్దొచ్చే పుస్తకాలు- నా ఆలోచనలకు అతీతమయిన వస్తువులన్నిటినీ చూశాను. అవన్నీ గుమ్మం ముందు పోగేశారు. మీ నౌకరు అక్కడ నిలబడి ఒక్కొక్కటే జాగ్రత్తగా దుమ్ము దులుపుతున్నాడు. సామాను పెరుగుతున్న కొద్దీ వాటివైపు నేను ఆశగా చూస్తున్నాను. నన్ను వెళ్లిపొమ్మనలేదు మీ నౌకరు... అలా అని ప్రోత్సాహపరచనూ లేదు. అందుకనే నేను వాటిని ముట్టుకోనైనా లేదు - ఆ పుస్తకాలమీదున్న అందమైన అట్టలపైన అలా చెయ్యి పెట్టి నిమరాలనిపించినప్పటికీ. కొన్ని కొన్ని పుస్తకాలమీదున్న వాటి పేర్లు చదివాను- భయపడుతూనే. చాలా మట్టుకు ఇంగ్లీషువి. ఇంకా బోలెడు పుస్తకాలు- నాకు తెలియని అనేక భాషల్లో ఉన్నాయి. ఆ విధంగా ఆ సామాను కేసి చూస్తూ ఎన్ని గంటలసేపైనా నిలబడేదాన్నే... కాని యింతలోకే మా అమ్మ పిలిస్తే వెళ్ళిపోయాను.

ఆ సాయంకాలమంతా మీగురించే ఆలోచించాను... అప్పటికింకా మిమ్మల్ని చూడనేలేదు. నాకున్నవి ఏవో చవకరకం పుస్తకాలు పది పదిహేను ఉన్నాయంతే- మా పాతషెల్ఫుల్లో. అవంటే నాకెంతో ఇష్టం... చదివిన పుస్తకాలే చదువుతూ... అలా ఎన్నిసార్లు చదివానో. నాకప్పుడు ఆశ్చర్యం వేసింది... లెక్కలేనన్ని పుస్తకాలున్న మనిషి ఎలా ఉంటాడోనని... అంత చదువు చదివిన మనిషి... అన్ని భాషలు నేర్చిన మనిషి... అంత ధనం ఉండి, విద్య కూడా ఉన్న మనిషి! అన్ని పుస్తకాలు... తలుచుకునేసరికి ఒక విధమయిన పూజ్యభావం కలిగింది. మీ స్వరూపాన్ని నా మనస్సులో చిత్రించుకోవటానికి ప్రయత్నించాను. మీరు బాగా వృద్ధులై ఉండాలి... ముడుతలు పడిపోయిన ముఖం, నెరిసిపోయిన జుట్టు, ముక్కు చివరికి జారిన కళ్లజోడూ - మా జాగ్రఫీ మాస్టరులాగ... కానీ ఆయనకన్న ఎంతో దయకలిగి, సాధువులా ఎంతో మంచిగా ఉంటారని... ఎందుకో నాకే తెలియదు... మీరు మాత్రం ఎంతో అందంగా ఉండిఉంటారనే నమ్మకం కలిగింది- మిమ్మల్ని వృద్ధులుగా

ఊహించుకున్నప్పటికీ. ఆ రాత్రి - మీ గురించి మొట్టమొదటిసారిగా కలగన్నాను.

ఆ మర్నాడే మీరొచ్చారు. ప్రతీక్షణం మీ ముఖ సందర్శనంకోసం వేచి ఉన్నప్పటికీ అది సాధ్యంకాలేదు. ఆ ఓటమి నాలో మరింత కుతూహలాన్ని రేపింది. చివరికి మూడోనాడు చూడగలిగాను మిమ్మల్ని. ఎంత నిర్ఘాంతపోయాను, చూసి! బాల్య లక్షణాలింకా పోని నేను ఊహించుకున్న వృద్ధ వ్యక్తికి పూర్తిగా విరుద్ధంగా... నేనూహించుకున్న కళ్లజోడూ, బట్టతలా లేకుండా... మీరు కనిపించారు... మీరిప్పుడున్నట్లుగానే... వయస్సు మీరినా మీలో చెప్పుకోదగ్గ మార్పురాదు... లేతమట్టి రంగు ఊలు సూటు వేసుకున్నారు... మేడమెట్లు రెండేసిమెట్లు ఒక్కసారి చొప్పున దాటుతూ ఎక్కారు- చిన్నతనంలోని చురుకు మీ నడకలో ఎప్పుడూ కనిపిస్తుంది. దొరలటోపీ చేతిలో ఉంది... మీ అందమయిన, తేజోవంతమయిన ముఖం, నల్లటి ఒత్తైన జుట్టూ - నా సంభ్రమం వర్ణనాతీతం. మీ అందమైన నాజూకు శరీరం చూసి విస్తుబోయాను. నేనే ఏమిటి, మా చుట్టుపక్కల వాళ్లంతా మిమ్మల్ని వింతగా చూశారు.

అయితే, మీలో రెండు రకాల వ్యక్తులు లీనమై ఉన్నారని అప్పుడనుకున్నాను. మీ యౌవనం, మీ అందం- ఆటపాటలకూ సాహస కృత్యాలకూ వినియోగపడుతుంది... అది కాకుండా, మీ కళోపాసన చూస్తే మీలో ఒక విజ్ఞాని, జీవితపు విలువలు తెలిసి, బాధ్యత వహించిన గొప్ప సంస్కారి కనిపిస్తాడు. అనాలోచితంగా గ్రహించాను- మిమ్మల్ని ఎరుగున్న ప్రతి మనిషికీ మీరు ద్వంద్వ జీవితాన్ని గడుపుతున్నట్లు తెలుసునని. ఇందులో ఒకరకం అందరికీ తెలిసినదే- ప్రపంచానికి ప్రత్యక్షంగా కనిపిస్తున్నది; ఇక రెండవది- ప్రపంచానికి పరోక్షంలో గడిపే జీవితం- అది మీకు మాత్రం సంపూర్ణంగా తెలుసును. నేను, ఒక పదమూడు సంవత్సరాల పిల్లను. మీ ఆకర్షణకు లోనై మీ జీవిత రహస్యాన్ని గ్రహించగలిగాను. ప్రథమ వీక్షణంలోనే మీ ద్వంద్వ జీవితంలోని వైరుధ్యాన్ని గమనించాను.

ఇప్పుడైనా అర్థం చేసుకోగలరా, అంతచిన్న వయస్సులో ఉన్న నాకు మీరెంత నిగూఢంగా, మర్మభూయిష్టంగా గోచరించారో? ఓ మూల లోకమంతా ఒక రచయితని ఈ మహాప్రపంచంలో ప్రఖ్యాత పురుషుడని సన్మానిస్తుంటే, హఠాత్తుగా నాకుమాత్రం అతడు చిలిపికుర్రవాడిలా, పాతికేళ్ల యువకుడిలా కనిపించాడు. అప్పటినుంచి నా నియమిత లోకంలో నాకిష్టమైనదల్లా మీరొక్కరేనని వేరే చెప్పనక్కర్లేదు. ఆ పదమూడేళ్ల బాలిక బ్రతుకు మీ జీవితాన్ని ఆవరించుకుంది. మిమ్మల్ని కనిపెట్టి ఉండేదాన్ని.

మీ అలవాట్లూ, మీ అతిథులూ-అవన్నీ మీ వ్యక్తిత్వంపైన అయిష్టాన్ని కలుగజేయటానికి బదులు నా అభిమానాన్ని మరింత అధికం చేశాయి- ముఖ్యంగా మీకోసం వచ్చే రకరకాల అతిథులలోనే మీ ద్వంద్వ జీవితంలోని వైరుధ్యం ప్రతిబింబించేది. వారిలో కొంతమంది యువకులూ, మీ స్నేహితులూ, ఇష్టంవచ్చినట్లు దుస్తులు ధరించే విద్యార్థులూ - వాళ్లందరితో మీరు ఆడుతూ పాడుతూ ఉండేవారు. కొంతమంది ఆడవాళ్లకూడా వచ్చేవారు మోటారుకారుల్లో. అందులో కొందరు ఆడపిల్లలూ, యువకులూ, ఇంకా కాలేజీల్లో చదువుతూ ఉండేవారు... సిగ్గుపడుతూ చల్లగా మీ గదిలోకొచ్చేవారు. మీకోసం వచ్చేవారిలో చాలామంది ఆడవాళ్లే. నేనవేమీ ఆలోచించే దాన్ని కాదు. ఓరోజున నేను స్కూలికి వెడుతూంటే, ముఖం నిండా ముసుగు వేసుకున్న ఒక యువతి మీ గదిలోంచి వచ్చేస్తుంటే చూశాను. అప్పటికి కూడా నేనేమీ అనుకోలేదు. నాకింకా పదమూడేళ్లే. ఆ అపరిపక్వదశలో, అత్యంత కుతూహలంతో మీ చేష్టలన్నిటినీ అవలోకించటం- అదంతా ప్రేమేనని నేను ఎంత మాత్రం తెలుసుకోలేకపోయాను.

కానీ, నాకొక్క విషయం తెలుసును- ఏరోజున, ఏక్షణంలో నా సంపూర్ణ హృదయాన్ని మీకు సమర్పించానో నేనెరుగుదును. నా స్నేహితురాలొకమ్మాయితో కలిసి షికారుకి వెళ్ళొచ్చి, వీధిగుమ్మం దగ్గర నుంచుని కబుర్లు చెబుతున్నాను. ఇంతలో ఒక కారు వచ్చిందక్కడికి. మీరు ఒక్కగెంతులో అక్కడికి వెళ్లారు... ఆ చలాకీతనమే ఆరంభం నుంచీ నన్నంతగా ఆకర్షించింది... సరిగ్గా కారుని సమీపిస్తున్నారు... మీకోసం కారు తలుపు తీయాలనిపించింది- గబుక్కున మీదారికడ్డంగా వెళ్లాను... కొంచెమైతే యిద్దరం ఢీకొనేవాళ్లమే. అప్పుడు మీరు నాకేసి సరళంగా, సొంపుగా, లాలనగా చూశారు- ఇంచుమించు బుజ్జగించినట్లు చూసి సున్నితంగా చిరునవ్వు నవ్వారు... అవును, సున్నితమే సరియైన పదం... కొంచెం వంగి, మెల్లగా... కాదు... అంతరంగికంగా అన్నారు "మంచిదానివి" అని.

అంతే- ఆక్షణం నుంచీ- మీరు నావైపు లాలనగా పాలనగా చూసినప్పుడే నేను పిచ్చిదాన్నైపోయాను.

ఆ తరవాత... చాలా రోజులకి నాకు తెలిసింది- మీకు పరిచయమైన ప్రతి ఆడదానివంకా మీరు ఆ పద్ధతిలోనే చూస్తారని. అనురాగభరితమైన, ఆకర్షణీయమయిన ఆ వీక్షణం- జన్మతః లభించిన శక్తివంతమైన వీక్షణం. అవిధంగా అనిచ్ఛాపూర్వకంగానే

కనిపించిన ప్రతి కన్యపడుచుకేసీ, పనిచేసే ప్రతిదాసీదాన్నీ చూసేవారు. వాళ్లందరినీ అనుభవించాలని ఉద్దేశపూర్వకంగానే ఆకాంక్షించారని కాదు నేననేది- మీ అంతరంగంలోని వాంఛ, ఏ ఆడది ఎదురైనా అనాలోచితంగానే ఆమెవైపు ఆప్యాయంగా చూసేట్లు చేసేది. పదమూడేళ్ల వయస్సులో నాకిటువంటి ఆలోచనే లేదు. ఆ చూపుకి అగ్నితో చెలగాటమాడినట్లనిపించింది. ఆ ఆప్యాయత నా కొరకేనని నమ్మాను. నా కొక్కరైకేననుకున్నాను. ఈ ఏకైకానుభవమే కన్నెపిల్లలోని స్త్రీ మూర్తిని - భావిజీవితమంతా మీదికానున్న స్త్రీమూర్తిని మేలుకొలిపింది.

"ఎవరతను?" అని అడిగింది నా స్నేహితురాలు, చటుక్కున సమాధానం చెప్పలేకపోయాను. మీ నామధేయాన్ని ఉచ్చరించటం నాకసాధ్యమైంది. అకస్మాత్తుగా అదెంతో పవిత్రంగా తోచింది - అది నా రహస్యం.

"ఆ, ఎవరూ కాదు... ఈ ఇంట్లో మరోవాటాలో ఉంటున్నారు" అన్నాను తడుముకుంటూ.

"అలా అయితే అంత సిగ్గు పడిపోయావెందుకు అతను నీకేసి చూసినప్పుడు?" కొంటెగా అడిగిందా అమ్మాయి. నన్ను వేళాకోళం చేస్తోందనీ, నా రహస్యం తెలిసిపోతోందనీ గ్రహించాను. నా ముఖం మరింత కందిపోయింది సిగ్గుతో. తిట్టాలనే తిట్టాను "పో, మొద్దుపిల్లా" అని కోపంగా ముఖం పెట్టి. అది పకపకా నవ్వటం మొదలెట్టింది. నాకు ఉడుకుమోత్తనంతో కళ్లమ్మట నీళ్లుకూడా వచ్చాయి. దాన్ని అక్కడే వదిలేసి నేను మా ఇంట్లోకి పారిపోయాను.

అప్పటినుంచి నేను మిమ్మల్ని ప్రేమిస్తూనే ఉన్నాను. "మిమ్మల్ని ప్రేమించాను" అని ఆడవాళ్లు అనటం మీరు తరుచు వినేఉంటారని నాకు తెలుసును. కాని, నాకుమల్లే బానిసలాగ, కుక్కలాగ- అంత భక్తితో, విశ్వాసంతో ఇంకెవ్వరూ మిమ్మల్ని ప్రేమించి ఉండరని నాకు బాగా నమ్మకం. ఎవ్వరూ కనిపెట్టని చిన్నపిల్ల ప్రేమతో ఇంకేదీ సాటిరాదు. అందులో ఉండే నిరాశ, విశ్వాసం, ఓరిమీ, తాపమూ- యువతుల స్వార్థపూరిత ప్రేమలో ఇమిడి ఉండటం అసాధ్యం. ఆ తాపాన్ని ఒంటరిగా బ్రతికే బాలికలే భరించగలరు. సాధారణంగా, సాహచర్యంలోనూ, రహస్య సంభాషణల్లోనూ యువతులు వాటిని వ్యర్థం చేసుకుంటారు. ప్రేమ గురించి వాళ్లు చాలా విని ఉంటారు, చదువుకుని ఉంటారు. సహజంగా అది అందరికీ సంప్రాప్తమవుతుందని

తెలుసు వాళ్లకి. దానితో వాళ్లు బొమ్మలాట ఆడుకుంటారు. దాన్ని గురించి బడాయిలు చెప్పుకుంటారు- మొట్టమొదటిసారి సిగరెట్టు కాల్చిన కుర్రవాడికి మల్లే. అటువంటి ఆంతరంగిక మిత్రులు నాకెవరున్నారు? నాకెవరూ ప్రేమగురించి పాఠం చెప్పనూ లేదు... నన్ను హెచ్చరించనూలేదు... నాకనుభవం లేదు... నన్నెవ్వరూ అనుమానించరు... నావిధిని ఎదుర్కొనేందుకు నేనే త్వరపడ్డాను. నాలో ఎట్టి చలనం కలిగినా, నాకేది సంభవించినా- అంతా మీవల్లనే- మీ గురించి నేను ఊహించుకున్న వాటి వల్లనే. మా నాన్నగారు పోయి చాలా కాలమయింది. మా అమ్మకెప్పుడూ, వచ్చే పెన్షను ఇంటి ఖర్చులకు సరిపెట్టుకోవటం, రెండు పూటలా తిండికి ఉందో లేదో చూసుకోవటం మినహా మరో తాపత్రయమే లేదు. ఆవిడనీ, ఆ ఎదిగీ ఎదగని కన్నెపిల్లనీ కలిపే విషయాలేముంటాయి? మా స్కూలు పిల్లలంతా తెలిసీ తెలియని రకం. నేను దేన్నైతే తీవ్రమయిన తృష్ణగా భావించానో, దాన్నే వాళ్లు మిడి మిడి జ్ఞానంతో తుచ్ఛంగా చూసేవారు. వారి అయోగ్యత నాకయిష్టంగా ఉండేది. అసలు సంగతి - సాధారణంగా ఆ వయస్సులో పిల్లల దృష్టి నలుగురి మీదనూ ఉంటుంది - అగమ్యంగా. కాని నా దృష్టినంతా మీ మీదే కేంద్రీకరించాను. నాకు మీరు... ఏ అలంకారంలో నా భావాలను వ్యక్తం చేస్తే న్యాయంగా ఉంటుంది!... నా జీవిత సర్వస్వం మీరే. మీకు సంబంధించనిదానికి నా జీవితంలో స్థానం లేదు. మీతో ప్రసక్తిలేని ప్రతి విషయం నాకు అర్థశూన్యంగా తోచేది. మీరే ఆ మార్పుకి కారణం, ఇంతకు ముందు స్కూలుమీద శ్రద్ధ ఉండేది కాదు... నన్నెవ్వరూ లెక్కచేసేవారుకాదు... అటువంటిది, అకస్మాత్తుగా అందరికన్నా తెలివైన దాన్ననిపించుకున్నాను. పుస్తకం తరువాత పుస్తకం, ఎంత రాత్రయినా చదివేదాన్ని- మీకు పుస్తకాలంటే అభిరుచి అని తెలిసి. మీరు సంగీతప్రియులని ఊహించుకుని రోజూ సంగీతం అభ్యాసం చేసేదాన్ని. అమ్మతెల్లబోయేది నా పట్టుదలచూసి. నా బట్టలు చిరిగిపోతే కుట్టుకుని, ఉతుక్కుని కట్టుకునేదాన్ని- మీ కళ్లకి శుభ్రంగా కనిపించటానికి. మా అమ్మ చీరచింపి కుట్టిన స్కూలు పరికిణీ ఒకటుండేది నాకు. దానిమీద బెత్తెడుమేర చిరిగిపోతే వేరేగుడ్డముక్క అతుకువేసింది. అది మీకెక్కడ కనిపించిపోతుందో, మీరు నన్నెంత ఏవగించుకుంటారోనని భయపడి వేణీతో ఆ అతుకుని కప్పుకునేదాన్ని- మేడమెట్ల మీద ఉన్నప్పుడు. మీరెక్కడ చూస్తారోనని హడలిపోయేదాన్ని, నేనెంత వెర్రిమొద్దుని! మీరు నావంక మళ్ళీ ఎప్పుడూ చూడనేలేదు.

అయినప్పటికీ నా రోజులన్నీ మిమ్మల్ని కనిపెడుతూ, మీకోసం కాచుకుని ఉండటంతోనే గడిచిపోయేవి. మావీధి తలుపుకి చిన్నకన్నం ఉండేది. అందులోంచి మీ గుమ్మం కొంచెం కనిపించేది... నవ్వకండీ... ఆ దొంగకన్నం దగ్గరే నేను గడిపిన రోజులు తలుచుకుంటే ఇప్పటికీ నేను సిగ్గుపడను. గుమ్మం దగ్గర తచ్చాడుతూంటే మా అమ్మ అనుమానిస్తుందేమోనని భయపడేదాన్ని. కాని, ఎన్ని మధ్యాహ్నాలు, ఎన్నిరోజులు, ఎన్ని మాసాలు- చేతిలో పుస్తకం పెట్టుకుని బిగువైన వీణతీగెలా మీ సామీప్యతకు కంపిస్తూ ఎదురుచూశాను మీకోసం! నేను మీకెంత సామీప్యంలో, ఎంత దృఢంగా నిలిచానో మీ కెంతమాత్రం తెలియదు- మీ జేబులోని గడియారం మీ హృదయానికి చేరువలోనే ఉంటూ దాని స్పందనం మీకు వినిపించనట్లే.

మీ గురించి నాకంతా తెలుసును, మీ అలవాట్లు, మీరు ధరించే దుస్తులు- నాకన్నీ ఆనవాలే. మీ కోసం నిత్యం వచ్చేపోయే అతిథులు నా కొనవాలే. వారి గురించి నా ఇష్టాయిష్టాలు కూడా ఏర్పరచుకున్నాను. నా పదమూడో సంవత్సరం నుంచి పదహారో సంవత్సరం వరకూ నే గడిపిన ప్రతిక్షణం మీకొరకే. నేను చేసిన తప్పులేమిటి? మీరు ముట్టుకున్న తలుపు గడియని ముద్దుపెట్టుకునేదాన్ని, మీరు కాల్చిపారేసిన సిగరెట్టు ముక్కల్ని ఏరుకునేదాన్ని- మీ అధరాలను అంటిపెట్టుకున్న ఆ సిగరెట్టుముక్క నాకెంతో పవిత్రంగా తోచేది. ఏదోవంక పెట్టుకుని వీధిగుమ్మం వద్దకు పరుగెత్తుకుని వచ్చేదాన్ని, ఏ గదిలో మీదీపం వెలుగున్నదో చూసేందుకూ, మీ అదృశ్యాకారం అక్కడున్నదో లేదో గ్రహించేందుకు. మీరు వారాల తరబడి ఊరు విడిచివెళ్లినప్పుడు (ముఖ్యంగా మీరు వెళ్లేరోజున మీనౌకరు సామానంతా మేడమీంచి క్రిందికి తెస్తూండగా చూసినప్పుడు నా గెండె ఆగిపోతుందేమో అనిపించేది) బ్రతుకు అర్థశూన్యంగా ఉండేది. ఏమీతోచేది కాదు; చచ్చిపోతే బావుండుననిపించేది; ఆ బాధలో ఏం చెయ్యాలో తోచక ఇటూ అటూ తచ్చాడేదాన్ని. మళ్లీ నా కన్నీరుచూసి మా అమ్మ నాబాధ గ్రహించకుండా ఉండాలని తంటాలుపడేదాన్ని.

నాకు తెలుసును- నేనిప్పుడిక్కడ రాసేదంతా, ఓ కన్నెపిల్ల వెర్రి ఊహాలతో చేసిన విపరీతచేష్టలకు వ్యాఖ్యానమని. నిజంగా నేను సిగ్గుపడవలసిన సంగతి. అయినా నేను సిగ్గుపడటం లేదు. ఈ సమయంలో ఉన్నంత పవిత్రంగా, తీవ్రంగా నాప్రేమ ఇంతక్రితముందెప్పుడూ లేదు. మీకు తెలియకుండానే మీతో కలిసి వేవేవిధంగా జీవించానో, గంటలకొద్దీ, రోజులకొద్దీ కూర్చుని చెప్పగలను. అయితే, మీకు నా

గురించి తెలియనే తెలియదు. ఒక్కొక్కప్పుడు మేడమెట్లదగ్గిర మీరు ఎదురుపడితే తలవంచుకొని తొందరగా తప్పుకుపోయేదాన్ని- మీ తీక్షణవీక్షణానికి భయపడి. అగ్ని ప్రమాదాన్నితప్పించుకోవటానికి నీటిలోకి ఉరికేదానిలా కంగారు పడిపోయేదాన్ని. మీరు ఏనాడో మరిచిపోయిన ఆ రోజుల గురించి గంటలు, రోజుల తరబడి మీతో చెప్పగలను. ఇప్పుడదంతా చెప్పి మీకు విసుగు పుట్టించనులెండి... అయితే, మరొక విషయం మాత్రం తప్పక చెబుతాను. ఆ రోజుల్లో నా చిన్నతనంలోని అద్భుతానుభవం- మరి, నవ్వకూడదు సుమా! మీకది చెత్తగా తోచినా, నా దృష్టిలో మాత్రం అది అత్యంత ప్రాముఖ్యం కలదే.

ఆనాడు ఆదివారం అనుకుంటాను. మీరు లేరు; మీనౌకరు పెద్దపెద్ద రగ్గులు ఎండలో దులిపి మళ్లీ గదిలోకి తీసుకువెడుతున్నాడు. అవి చాలా బరువుగా ఉండటం మూలాన్ని ఆ ముసలివాడికి స్వాధీనం కావటం లేదు. నేను ధైర్యం తెచ్చుకొని సాయం చెయ్యమంటాడేమోనని అడిగాను. వాడు తెల్లబోయాడు. వద్దనిమాత్రం అనలేదు. అప్పుడు నేనెంత శ్రద్ధా భయభక్తులతో మీ వసతిలో పాదం పెట్టానో, ఎంత ఇదిగా మీ ప్రపంచాన్ని పరికించానో... మీరు తరుచు కూర్చునేచోట మీ రాతబల్ల, దానిమీద ఒక నీలంగాజు కూజాలో పువ్వుల గుత్తులు... బొమ్మలు... పుస్తకాలు- ఎలా నచ్చజెప్పగలను మీకు? వీటన్నిటివైపు ఒకదొంగచూపు చూశాను- అంతే. మీ నౌకరు ఒప్పుకునేవాడే, నేను బాగా చూస్తానంటే. పరిసరాలను గ్రహించటానికీ, నిద్రలోనూ మెలుకువలోనూ మీ గురించి కన్న కలలలో కొత్తదనాన్ని చేకూర్చటానికీ నాకంతే చాలును.

ఆ క్షణికానుభవమే నా బాల్య జీవితంలో సుఖప్రదమయినది. నా గురించి ఏమీ తెలియని మీరు, ఇప్పుడైనా, నాజీవితం మీపై ఏవిధంగా ఆధారపడిందో అర్థం చేసుకోవటం ఆరంభిస్తారేమోననే ఇదంతా చెప్పదలుచుకున్నాను. నే చెప్పదలుచు కున్నది - ఆక్షణం గురించీ, దాన్నిఅనుసరించిన దుర్భర క్షణాల గురించీ. ఇంతకుముందే చెప్పాను మీకు, మిమ్మల్ని గురించి ఆలోచనలు రావటం ప్రారంభ మయాక మిగిలినవాటన్నిటినీ మరిచేపోయాను. మా అమ్మ విషయంకానీ, మా ఇంటికొచ్చే పోయే అతిథుల విషయంకాని పట్టించుకోనేలేదు. మా అమ్మవైపు దూరపు బంధువొకాయన బాగా ఆస్తిపరుడు- తరుచు మాయింటి కీమధ్య వస్తూపోతూం డటం కూడా గమనించనేలేదు. అమ్మని సినిమాలకీ ఇక్కడికీ అక్కడికీ కూడా

తీసుకుపోతూంటే ఎంతో సంతోషించేదాన్ని నన్ను ఒంటరిగా వదిలేసినందుకు. ఏగొడవా లేకుండా మీ గురించి ఆలోచించుకునేందుకు అనువుగా ఉండేది. నాకు కావలసింది అదే.

ఓరోజున అమ్మ నన్ను ప్రత్యేకంగా పిలిచి, నాతో ఏదో ముఖ్యమయిన విషయం మాట్లాడాలని చెప్పింది. నాముఖం పాలిపోయింది. గుండె దడదడ కొట్టుకుంది. ఏమన్నా అనుమానించిందా? నా ప్రవర్తనవల్లనే నా గుట్టు బయటపడిపోయిందా? వెంటనే వచ్చిన ఆలోచన మీ గురించే- నా జీవిత రహస్యం గురించి. కాని, మా అమ్మకూడా తికమకపడింది. ఎప్పుడూ నన్నావిధంగా దగ్గరగా తీసుకోలేదు. నన్ను ఆప్యాయంగా హృదయానికి హత్తుకుంది. మంచంమీద కూర్చోబెట్టింది. సంకోచిస్తూ, తను చేసిన పనికి దేనికో సిగ్గుపడుతున్నట్లు చెప్పింది. తన దూరపు బంధువొకాయన- భార్యావియోగి- తనను వివాహం చేసుకోమని కోరినట్టూ, నాకోసమే తనందుకు అంగీకరించినట్టూ చెప్పింది. నా తల తిరిగిపోయినట్లయింది. నాకొక్కటే ఆలోచన- అది మీ గురించే.

"మనం ఈ ఊళ్ళనే ఉంటాంకదూ" అని గొణిగాను.

"లేదు. మనం వరంగల్ వెళ్ళిపోతున్నాం. అక్కడాయనకి మంచి ఇల్లూ, భూములూ ఉన్నాయి". అంతే. నాకింకేమీ వినిపించలేదు. నా కళ్లముందు అంతా చీకటి. తరవాత తెలిసింది నేను ఆ వెంటనే మూర్ఛపోయానని. గుప్పిళ్లు రెండూ బిగించి, మట్టిగోడలా కూలిపోయాను. ఆ తర్వాత కొద్దిరోజులపాటు జరిగిందంతా ఏమని చెప్పను?- నోరులేని చిన్నదాన్ని- వ్యర్థంగా యుద్ధం చేశాను పెద్దలతో! ఇప్పుడు కూడా తలుచుకుంటుంటే నా చేతులు వణుకుతున్నాయి. రాయలేక పోతున్నాను... నా అసలు రహస్యాన్ని వెల్లడించ లేకపోయాను. అంచేత నా తిరుగుబాటు మొండితనంగా తోచింది మా అమ్మకి. ఎవరూ నాతో చెప్పలేదు- ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. నేను రోజూ స్కూలికి వెళ్ళి తిరిగి వచ్చేసరికి ఏదో ఒక సామాను యింట్లోంచి బయటకి వెడుతూ ఉండేది. నా బ్రతుకు పగిలి తునక తునకలై పోతున్నట్లుగా ఉండేది. చివరికి ఒకరోజున సాయంకాలం ఇంటికొచ్చేసరికి ఇల్లంతా ఖాళీచేసేశారు కూలివాళ్లొచ్చి. ఆ ఖాళీగదుల్లో రెండు మడత మంచాలూ, ఒక పెట్టె మాత్రం ఉన్నాయి. ఆ ఒక్కరాత్రికీ అమ్మా, నేనూ అక్కడ పడుకుని ఆ తర్వాత వరంగల్ వెళ్లిపోవాలి.

ఆ ఆఖరురాత్రి హఠాత్తుగా ఒక నిశ్చయానికొచ్చాను - మీకు దూరంగా ఉండి బ్రతకలేనని. నా సమస్తలోకం మీరే. ఆ సమయంలో నేను దేని గురించి ఆలోచించానో, అసలా దుఃఖంలో ఆలోచించగలిగానో లేదో చెప్పటం కష్టం. మా అమ్మ ఇంట్లో లేదు. ఉన్నపళంగా, స్కూలు బట్టలతోనే, లేచి మీ గదివైపుకి వెళ్లాను. అయితే, వెళ్లాననీ చెప్పలేను. కొయ్యబారినకాళ్లూ చేతులతో, కంపించే దేహంతో ఉన్న నన్ను ఏదో బలీయమైన ఆకర్షణ శక్తి మీ గది వద్దకు లాక్కువెళ్ళింది. నన్ను మీ దాసిగా నైనా, మీ బానిసగానైనా సరే స్వీకరించమని మీ పాదాలపైన పడి వేడుకుందామని ఉంది నామనస్సులో. ఈ పదమూడేళ్ల పిల్ల పిచ్చి చూసి మీరు నవ్వుతారని భయపడకపోలేదు. భయంతో వణికిపోతున్నా ఆ చల్లని నేలమీద నిలబడ్డాను. ఏదో అనివార్యమయిన ఆవేశంతో ముందుకి నడిచాను. అప్రయత్నంగానే నా చెయ్యిపైకి లేచింది, బెల్ మ్రోగించాను. కొన్ని దుర్భర క్షణాలు యమయాతనపడ్డాను. ఆ వెనువెంటనే ఆవరించిన నిశ్శబ్దతలో మీరాకకెదురు చూస్తున్నప్పుడు నా రక్తం గడ్డకట్టుకుపోయి, నా గుండె ఆగిపోయినట్లనిపించింది.

కాని మీరు రాలేదు. ఎవ్వరూ రాలేదు. ఆ మధ్యాహ్నం మీరు వీధిలోకి వెళ్ళి ఉండాలి. మీ నౌకరు కూడా వెళ్ళిఉండాలి. ఆ గంటచప్పుడింకా నా చెవుల్లో గింగురుమంటున్నట్టుగానే ఉంది. నేను కాళ్ళీడ్చుకుంటూ మా ఖాళీ గదిలోకి వచ్చేశాను. వచ్చీరావటంతోనే వాల్చిఉన్న మడత మంచం మీద కూలిపోయాను. ఆ నాలుగడుగులు నడిచేసరికే, హిమాలయ పర్వతాలను అధిరోహించినట్లుగా అలిసిపోయాను. నేనెంతో అలిసిపోయినప్పటికీ, వాళ్లంతా కలిసి నన్నిక్కడినుంచి లాక్కుపోయేలోపల మిమ్మల్ని ఒక్కసారి కలుసుకుని మీతో మాట్లాడాలని నేను చేసుకున్న నిర్ణయం మాత్రం దృఢంగానే ఉంది. అయితే, ఒక్క విషయం మాత్రం మీతో కచ్చితంగా చెప్పగలను. నాలో కామవాంఛలు మాత్రం లేవు. అప్పటికి నాకింకా ఏమీ తెలియదు. మిమ్మల్ని గురించితప్ప నేను మరొకటి ఆలోచిస్తేకదా. నేకోరిందల్లా ఒక్కటే - మిమ్మల్ని ఒక్కసారి కలుసుకుని మీ పాదాలపైన పడిపోవాలని.

ఆ భీకరనిశీధిలో, కర్కశ శైతల్యావరణంలో నిలబడి మీకొరకు నిరీక్షించాను. అమ్మ వెంటనే నిద్రపోయింది. నేను చెవులు నిక్కబొడుచుకొని మీ పదధ్వని కోసం ఎదురు చూస్తున్నాను. ఆ కార్తీకమాసపు చలిని నా శరీరం భరించలేకపోతోంది. కూర్చోవటానికి అక్కడొక కుర్చీకూడా లేదు. కాళ్లు పీక్కుపోయి చివరికి ఆ కటికనేల

మీదనే చతికిలబడ్డాను. కట్టుకున్న బట్టలు పల్చనివి అయినప్పటికీ ఏమీ కప్పుకోలేదు. అయినా ఆ సమయంలో వెచ్చగా ఉండాలని లేదు నాకు- ఎక్కడ నిద్రపట్టిపోతుందో, ఎప్పుడు మీరొచ్చేస్తారోనని భయం. కండచీమలు కరిచినట్లు కరుస్తోంది మాయదారి చలి. పైగా గాండాంధకారం... లేవడం... కూర్చోవటం... మళ్ళీ లేవడం... ఆవిధంగా ఆ రాత్రంతా మీకోసం ఎదురుతెన్నులు చూశాను- విధికోసం ఎదురుచూసినట్లు.

ఆఖరికి (తెల్లవారుఝామున మూడో నాలుగో అవుతుంది) వీధి తలుపు తెరిచిన చప్పుడు విన్నాను. అడుగుల సవ్వడి కూడా సమీపిస్తోంది. అంతవరకూ పట్టుకున్న చలి వదిలిపోయి ఒక్కసారిగా ఒంటిమీద వేడి గాడ్పులు ప్రసరించాయి. రెండడుగులు ముందుకి వేశాను, ఒక్కపరుగున పోయి మీ పాదాలపైన పడిపోవాలని... ఆ విపరీత స్థితిలో ఏంచేసేదాన్నో నాకేతెలియదు... అడుగుల సవ్వడి అంతకంతకు అధికమవుతోంది... ఎందుకో నా శరీరం కంపించింది, మీ ఆకారాన్ని గుర్తించగానే... ఆ వచ్చేది మీరేనా?

అవును... మీరే... కాని... మీరు... ఒంటరిగా రాలేదు. సరిగ్గా అప్పుడే మృదు మందహాసం, పట్టుచీర గరగరశబ్దం, మీ రహస్య సంభాషణా వినిపించింది. మీతో ఒక స్త్రీ కూడా వచ్చింది.

ఇక తెల్లవారేవరకూ నేనెలాగడిపానో చెప్పటం నా తరంకాదు. మర్నాడు పొద్దున ఎనిమిది గంటలికి వరంగల్ తీసుకుపోయారు నన్ను, అమ్మావాళ్లు. వాళ్ళకి అడ్డుచెప్పటానికి నాకు ఓపిక లేకపోయింది.

నిన్నరాత్రి నా కొడుకు పోయాడు. మరోసారి ఒంటరిదాన్నైపోతాను - నిజంగా నేను బ్రతకాలంటే. రేపు యమకింకరులొచ్చి నా ఒక్కగాని ఒక్క కొడుకునీ భుజంమీద వేసుకుని తీసుకుపోతారు. చుట్టుపక్కల వాళ్ళొచ్చి ఆ దృశ్యాన్ని చూసి కట్టుకున్న బట్టకొంగుతో కళ్లనీళ్లు ఒత్తుకుంటారు. కానీ ఏమిటి లాభం? ఎవరి మట్టుకువారు నాలుగు ముక్కలు చెబుతూ సానుభూతి వ్యక్తపరుస్తారు... మాటలు, మాటలు, మాటలు! మాటలేంచెయ్యగలవు? నాకు తెలిసిందల్లా ఒక్కటే- నేను మళ్ళీ ఒంటరిదాన్నై పోతాను. మనుషుల మధ్య ఉంటున్నా ఒంటరితనాన్ని అనుభవించటంకన్న ఘోరం ఏముంటుంది? అక్కడ వరంగల్‌లో మావాళ్లదగ్గర ఖైదీలాగున- నా పదహారోయేడు మొదలుకుని పద్దెనిమిదోయేటి వరకూ గడిపిన రెండు సంవత్సరాలోనూ నాకు

తెలిసిందల్లా అదే. మా పినతండ్రి పాపం నెమ్మదస్తుడు, మితభాషి; నన్ను ప్రేమగానే చూసేవాడు. మా అమ్మకూడా పాపం, తనేదో పెద్ద అన్యాయం చేసినట్లు బాధపడి, పాపపరిహారం కోసమన్నట్లు నేనేం కోరితే అది చేసేందుకు సిద్ధంగా ఉంది. ఆ చుట్టుపక్కల నా ఈడు పిల్లలు చాలామంది ఉన్నారు - నేను కాస్తచనువిస్తే స్నేహం చెయ్యడానికి సిద్ధంగా. కాని వాళ్లని రవ్వంత చొరవ తీసుకోనిచ్చేదాన్నికాదు. వాళ్లని కసిరికొట్టేదాన్ని. నాకు సుఖంగా ఉండాలని లేదు. మీరులేకుండా నా జీవితాన్ని సంతృప్తిగా గడపటం నా కిష్టంలేదు. అంచేత నా చుట్టూ విషాదవాతావరణాన్ని కల్పించుకుని కావాలని ఒంటరితనాన్ని అనుభవించేదాన్ని. నాకోసం వాళ్లు ఎంతమంచి బట్టలు కొన్నా కట్టుకుని కులాసాగా ఉండేదాన్నికాదు. పండగపూట తలంటుకోవటం గాని, పేరంటాలకు వెళ్లటంకాని, సరదాగా ఏమీ చేసేదాన్నికాదు. అసలు ఇల్లు కదిలేదాన్నికాదు. ఆ ఊళ్లో నేను రెండు సంవత్సరాలున్నప్పటికీ మా ఇంటి చుట్టుపక్కల ఎన్ని ఇళ్లున్నాయోకూడా నాకు తెలియదంటే మీరు నమ్ముతారా? విషాదమే నాకు సంతోషప్రదంగా ఉండేది. లోకాన్నీ, సుఖాలనూ వదిలేశాను. మీ దర్శనభాగ్యం కలగక పోవటానికి సాయం నేను కావాలని అనుభవించే చిత్రవధలో ఎంతో ఆనందాన్ని పొందేదాన్ని. మీ ఒక్కరి కోసమే జీవించాలన్న ప్రబలవాంఛను మరిపించే ఎట్టి అవకాశాన్నీ కలుగనిచ్చేదాన్ని కాదు. ఇంట్లో ఒంటరిగా కూర్చుని గంటలు, రోజుల తరబడి మీ గురించే ఆలోచించేదాన్ని - మనస్సులో దాచుకున్న లక్షజ్ఞాపకాలను పదే పదే నెమరు వేసుకుంటూ. మీ ప్రతి కదలికనూ, ప్రతి చేష్టనూ నా మనోరంగంమీద ప్రదర్శింప జేసేదాన్ని. నా బాల్య జీవితంలో మీరు ప్రవేశించిన నాటినుంచి నేటివరకు నేను గడిపిన ప్రతినిముషమూ నా మనోఫలకంపైన స్పష్టంగా శాశ్వతంగా ముద్రితమైపోయింది. ఏనాడో జరిగిన ఘట్టాన్ని కూడా నిన్న మొన్న జరిగినంత స్పష్టంగా జ్ఞప్తికి తెచ్చుకోగలను.

నా యావజ్జీవితం మీలోనే కేంద్రీకృతమై పోయింది. మీరు రచించిన గ్రంథాలన్నీటినీ కొనుక్కున్నాను. మీపేరు ఎప్పుడైనా వార్తాపత్రికలో కనిపించిందంటే ఆ రోజున నాకు పండగ. మీ పుస్తకాలను ఎన్నిసార్లు చదివానంటే, చివరికి అవన్నీ నాకు కంఠస్థమైపోయాయంటే నమ్ముతారా? ఎవరైనా నన్ను అర్ధరాత్రి గాఢనిద్రలో ఉండగా లేపి ఏదైనా పుస్తకంలో ఎక్కడిదో ఒక వాక్యం అందిస్తే ఆపేజీ అంతా అప్పజెప్పగలను - ఇప్పటికి పదమూడు సంవత్సరాలయిపోయినా. మీ ప్రతి పలుకూ

అతి పవిత్రంగా తోచేదినాకు. మీకు సంబంధించినంతవరకే నాకు ప్రపంచంతో నిమిత్తం. హైదరాబాదు స్థానిక పత్రికలలో సినిమావివరాలు చూస్తూ, ఏ సినిమా మీ అభిరుచికి తగినదో ఊహించుకునేదాన్ని. సాయంకాలం కాగానే ఊహాలోకంలో మీ వెంట నడిచేదాన్ని. "ఈ పాటికి టిక్కట్టుకొంటూ ఉంటారు... ఈ పాటికి తనసీటులో కూర్చుండి ఉంటారు" అని నాలో నేనే అనుకునేదాన్ని. ఇలా వెయ్యివిధాల ఊహించుకోవటానికి కారణం, ఒక సారెప్పుడో మిమ్మల్ని సినిమాహాల్లోకి వెడుతుండగా చూడటమే.

ఎందుకీ విషయాలన్నీ వివరించడం? నిర్లక్ష్యం చెయ్యబడిన అమాయకపు బాలిక విషాద పరిస్థితిని వర్ణించటం దేనికి? నా ప్రశంసనుగాని, ఆవేదనముగాని కలలోనైనా ఊహించుకోని మీతో చెప్పుకోవటం దేనికి? కాని అప్పటికీ నేనింకా చిన్నపిల్లనేనా? పదిహేడేళ్లు నిండాయి; పద్దెనిమిదో ఏడొచ్చింది. వీధిలో అడుగు పెట్టానంటే వెయ్యిమంది పురుషులు కళ్లు పెద్దవి చేసి నన్ను నిలువెల్లా చూస్తారు. వాళ్లనుచూస్తే పట్టలేనంత కోపం వచ్చేది. మిమ్మల్ని తప్ప మరొకర్ని ప్రేమించటం, మరొకర్ని ప్రేమించాలన్న తలపు రావటంకూడా నాకు అసంభవం. పరపురుషునిపైన అనురాగం కలగటమే నా ఉద్దేశంలో మహాపరాధం. మీమీద అభిమానం ఎప్పటిలాగ గాఢంగానే ఉంది; అయితే, వైఖరిలో మాత్రం మార్పు వచ్చింది. నా శరీరం పెరుగుతున్న కొద్దీ, నాలో శారీరక వాంఛలు మేలుకొని తీవ్రమవుతున్నాయి - అది యౌవనంలో ఉండే స్త్రీ ప్రేమ అనటంలో సందేహంలేదు. ఆనాడు తలుపు బెల్ మ్రోగించినప్పుడు ఏ ఉద్దేశం ఆ అమాయకపు బాలిక మనస్సులో దాగి ఉందో, అదే ఉద్దేశం ఇప్పుడు నాలో ఉద్ధృతమైపోయింది. నా సర్వస్వాన్నీ మీకు సమర్పించుకోవాలని నా వాంఛ.

మా చుట్టుపక్కల వాళ్లంతా నన్ను చూసి నాకు సిగ్గు, బిడియం ఎక్కువ అనుకునేవారు. కాని, నా కర్తవ్యాన్ని నేను స్పష్టంగా నిర్ణయించుకున్నాను. నా జీవిత పరమావధి ఒక్కటే- మళ్ళీ హైదరాబాదుకి వచ్చెయ్యాలి, మీ దగ్గరికి వచ్చెయ్యాలి. మొత్తంమీద ఎలాగో సాధించాను అక్కడనుంచి బయటపడటానికి- పైవాళ్లకి నేచేసిన పని సబబుగానూ యోగ్యంగానూ కనిపించక పోవచ్చును. నా కొత్త పినతండ్రి బాగా ఆస్తిపరుడూ కాబట్టీ, సహృదయుడు కాబట్టీ నన్ను బాగానే చూసేవాడు. అయినా, హైదరాబాదు వెళ్ళిపోయి టైపిస్టుగా ఎక్కడైనా చేరి నా పొట్ట నేను పోషించుకుంటానని

పట్టుపట్టాను. ఆయన ఆఖరికెలాగో సమ్మతించాడు.

హైదరాబాదు చేరుకున్నాక, ఆ సాయంకాలంపూట, మాఘమాసపు గాలిలో నా పాదాలు ప్రప్రథమంగా ఎక్కడికి దారితీశాయో నేను ప్రత్యేకంగా చెప్పాలా మీకు? పెట్టె, పరుపుచుట్టా స్టేషనులో వెయిటింగ్ రూములోనే పెట్టేసి, త్వరత్వరగా బస్సు ఎక్కేశాను. అబ్బ! ఆ బస్సు ఎంత తాపీగా పోతోంది! ఆగినప్పుడల్లా నా విసుగు అధిక మవుతోంది. చివరికి ఆ ఇంటికి చేరుకున్నాను. మీగది కిటికీదగ్గర దీపం వెలుగు చూడగానే నా హృదయం గెంతులువేసింది. అంతవరకూ నిర్జీవంగా శ్మశానంలా కనిపించిన పట్నమంతా ఇప్పుడు హఠాత్తుగా సజీవంగా కలకలలాడుతున్నట్లు కనిపించింది. మీ సందర్శనం కాగానే నా అనంతస్వప్నం సత్యమైనట్లు తోచి నాలో ఉత్సాహం ఉప్పొంగిపోయింది. పైకెత్తిన నా కళ్లకూ మీకూ మధ్య ప్రస్తుతం పల్చనిగాజు తలుపొక్కటి మాత్రం ఉండటంతో, నిజానికి మీ మనస్సుకీ నాకూ మధ్య అడవులూ కొండలూ నదులూ ఎన్నో ఉన్నాయన్న సత్యాన్ని విస్మరించగలిగాను. మీ కిటికీవైపు చూస్తూ ఉండిపోవచ్చు. లోపల దీపం వెలుగుతోంది. అదే మీ పడకగది అదే నా ప్రపంచం. ఈ ఘడియకోసం రెండుసంవత్సరాలు తపస్సు చేశాను. ఈనాటికిది సిద్ధించింది. మబ్బుమబ్బుగా ఉండి ఉక్కబోస్తున్న ఆ సాయంకాలం నుంచి మీరు దీపం ఆరిపేసేవరకూ ఆ కిటికీవైపు చూస్తూ వీధిలో నిలుచున్నాను. అప్పటివరకూ నా బస గురించి ఆలోచించనేలేదు.

ప్రతిసాయంకాలం అదే ప్రదేశానికి తిరిగివచ్చేదాన్ని. మా పినతండ్రి ఇచ్చిన ఉత్తరం సహాయంతో ఆయన బంధువు ఆఫీసులోనే టైపిస్టుగా చేరాను. సాయంకాలం ఆరుగంటల వరకూ ఆఫీసులోపని. పనిచెయ్యటం ఎంతో కష్టమనిపించినా, అదే ఇష్టంగా ఉంది. ఆఫీసు హడావిడిమూలంగా మనసులో గడబిడ కొంత తగ్గేది. గడియారం ఆరుకొట్టీ కొట్టడంతో నా ప్రియ స్థలానికి పరుగెత్తేదాన్ని. మిమ్మల్ని మళ్ళీ ఒకసారిచూసి, ఒక్కసారి మిమ్మల్ని కలుసుకోవాలనే నేను కోరేదల్లా... దూరం నుంచైనా సరే నాకళ్ళలతో మీ ముఖసౌందర్యాన్ని ఆస్వాదించాలని. ఆఖరికి వారంరోజులయ్యాక మిమ్మల్ని కలుసుకున్నాను. ఆ కలయికకూడా నన్నెంతో ఆశ్చర్యపరచింది. నేను మీ కిటికీవైపు చూస్తుండగా మీరు రోడ్డు దాటుతున్నారు. ఆక్షణంలో నేను తిరిగ్గి పదమూడేళ్ళ బాలికనైపోయాను. నా చెక్కిళ్ళు కందిపోయాయి సిగ్గుతో. మీ కళ్లల్లోకి చూడాలని ఎంత తీవ్రంగా వాంఛిస్తున్నప్పటికీ, వెంటనే

తలవంచేసుకుని, వెనకాతల నుంచి ఎవరో తరుముకొస్తున్నట్లు త్వరత్వరగా నడక సాగించాను. ఆ తరవాత నా ప్రవర్తన తలుచుకుని నేనే సిగ్గుపడ్డాను, అలా స్కూలుపిల్లలా పారిపోయి వచ్చేసినందుకు. నా కిప్పుడేం కావాలో స్పష్టంగా తెలుసును. మిమ్మల్ని కలుసుకోవాలని ఉంది. కష్టభరితమైన ఇన్ని సంవత్సరాల అనంతరమైనా నన్ను గుర్తించి, నన్ను పరికించి, నన్ను ప్రేమించాలని ఉంది.

చాలా కాలంపాటు మీరు నన్ను గుర్తించనేలేదు. మంచు కురుస్తున్నా, చలిగాలి విపరీతంగా వీస్తున్నా, అక్కడే, మీ ఇంటి ఎదుటనే నిలబడేదాన్ని. ఎన్ని గంటలసేపు నిరీక్షించినా, ఫలితం శూన్యమే. తరుచు, నేనిన్ని గంటలు నిరీక్షించిన తర్వాత, మీరు స్నేహితులతోకలిసి బయటికి వెళ్లిపోతూండేవారు. రెండుసార్లు మీరు ఒక స్త్రీతో కలిసి వెళ్లటం చూశాను. ఇప్పుడు నేను పెద్దదాన్నైపోయాను కాబట్టి మిమ్మల్ని చూస్తే నాలో కలిగే భావాలువేరు. అవిధంగా మీతో ఒక అపరిచిత స్త్రీ చనువుగా చెయ్యీచెయ్యీ కలిపి నడుస్తూంటే హఠాత్తుగా నా గుండె ఝల్లుమంది. అయితే ఇదేమీ నాకు కొత్తకాదు. నా చిన్నతనంనుంచీ మీ ఇంటికి అటువంటి అతిథులు ఎంతమంది వస్తూపోతూ ఉండేవారో నాకు బాగా తెలుసు. కానీ, ఇప్పుడు అదృశ్యాన్ని తిలకించగానే శారీరకంగా బాధపడ్డాను. మరో ఆడదానితో మీరు శారీరకంగా అంత సన్నిహితంగా ఉండటం చూడగానే, నాలో ఈర్ష్య, వాంఛా కూడా బయలుదేరాయి. సహజంగా యౌవనంలో ఆస్థితిలో ఎవరికైనాసరే వచ్చే అభిమానమే నాకూవచ్చి, ఆ మర్నాడు మామూలు ప్రకారం వెళ్లటం మానేశాను. తిరస్కారమూ, త్యాగంతో కూడిన ఆ సాయంకాలం ఎంత దుర్భరంగా ఉంది! ఆ మర్నాడు రోజాకన్న ముందరేవెళ్లి యథాస్థానంలో నిలబడ్డాను కుమిలిపోతూ. మీ బంధిత జీవితానికెదురుగా ఎప్పటిలాగే ఎదురు చూశాను.

ఆఖరి కెలాగైతేనేం మీరు నన్ను గుర్తించే సమయం ఆసన్నమైంది, దూరం నుంచే మీరాక గమనించాను. మిమ్మల్ని చూసి సిగ్గుతో భయంతో ముడుచుకుపోయి మీదారి నుంచి తప్పించుకుపోకుండా ఉండేందుకు నాశక్తినంతా కూడగట్టుకున్నాను. అదృష్టవశాత్తు రోడ్డుమీద కారులు, జనం ఎక్కువగా ఉండటం మూలాన్ని మీరు నేనున్నవైపుకే రావలసి వచ్చింది. నన్ను సమీపించగానే, అప్రయత్నంగానే మీ నేత్రాలు నా నిండు విగ్రహాన్ని పరిశీలించాయి. ఆ తక్షణం మీరు నా చూపుల్లోని శ్రద్ధాసక్తులను గమనించక పోయినా, ఆడవాళ్లకేసి సాధారణంగా మీరు చూస్తున్నప్పుడు

మీ ముఖంలో వ్యక్తమయేభావం ఇప్పుడు కూడా కనిపించింది. అది గుర్తుకొచ్చి నప్పుడు నా నరాల్లో విద్యుచ్ఛక్తి ప్రసరించినట్లైంది. అనురాగ భరితమైన, ఆకర్షణీయమైన ఆ రసిక వీక్షణంతోనే కొన్నేళ్లక్రితం ఓ బాలిక హృదయంలోని స్త్రీ మూర్తిని, ప్రేమమూర్తిని మేలుకొలిపారు. ఒకటి రెండు క్షణాలపాటు మీ చూపులు నా మీద నిలిచాయి. అదే సమయంలో నాచూపుల్ని మరో ప్రక్కకి మళ్ళించలేక పోయాను- ఆ తరవాత మీరు నన్ను దాటిపోయారు. నాగుండె ఎంత తీవ్రంగా కొట్టుకున్నదంటే, నేను అదివరకులా వేగంగా నడవలేకపోయాను. అణచుకోలేని ఆసక్తితో వెనక్కితిరిగి చూశాను. మీరు అక్కడే నిలబడిపోయి నన్ను గమనిస్తూండటం చూశాను. మీ చూపుల్లో ఆశ్చర్యం, ఆసక్తి చూడగానే మీరు నన్ను గుర్తించలేదని గ్రహించాను. మీరు నన్ను గుర్తించనేలేదు- అప్పుడుగాని, ఆ తరవాతగాని. నా భంగపాటుని ఏవిధంగా వర్ణించగలను? నాకు కలిగిన భంగపాటుల్లో ఇది మొదటిది- నా జీవితాంతం అనుభవించవలసిన భంగపాటును ప్రప్రథమంగా చవిచూశాను- మీరు నన్ను గుర్తించకపోవటం. నేనీవిధంగానూ గుర్తింపబడకుండానే మరణిస్తాను. అయ్యో! నాకు కలిగిన నిరాశను ఏవిధంగా మీకు వచ్చచెప్పగలను? వరంగల్‌లో ఉండగా ఒక్కనాడుకూడా మీ గురించి ఆలోచించకుండా లేను. ఆనాటి మీచూపులు ఎప్పుడూ తలపుకొచ్చేవి. నా ఊహలన్నీ నా మానసిక స్థితినిబట్టి మారుతూ ఉండేవి. ఒక్కొక్కప్పుడు ఎంతో ఆనందమయంగా జీవితాన్ని ఊహల్లో చిత్రించుకునేదాన్ని; మరొకప్పుడు విషాద భరితంగా ఊహించుకునేదాన్ని. విచారంగా ఉన్న సమయాల్లో, మీరు నన్ను తిరస్కరిస్తారనీ, నన్ను అవమానిస్తారనీ, మీకు నిమిత్తం లేకపోయినా మీకు నా మనస్సును సమర్పించి మిమ్మల్ని పీడిస్తున్నానని భావిస్తారనే ఊహించు కునేదాన్ని- భావిజీవితాన్ని ఎన్నివిధాల కష్టభరితంగా ఊహించుకోవాలో అన్నివిధాల ఊహించుకున్నాను. కాని, ఎంత విషాద పరిస్థితిలోకూడా, నా అల్పత్వాన్ని అర్థం చేసుకున్నప్పుడుకూడా యింత ఘోరమైన అవకాశం ఉంటుందని కలలోనైనా ఊహించు కోలేదు. మీరు నా వ్యక్తిత్వాన్ని ఎప్పుడూ గుర్తించనేలేదు. ఏ ఆడపిల్లకాని, యే స్త్రీ ముఖం అయినా పురుషుని కంటికి చంచలంగా, అస్థిరంగా కనిపిస్తుందని నాకిప్పుడర్థమైంది (అని మీరు నేర్పారు!). అద్దంలో ప్రతిబింబించి మరుక్షణంలో మాయమయ్యే మనిషి భావాల్లా ఉంటాయి స్త్రీల ముఖాలు. వయస్సునుబట్టీ, ధరించిన దుస్తులనుబట్టీ అనేక కారణాలవల్ల శారీరకంగా ఆడవారిలో మార్పులు

సులభంగా వస్తాయి. అందుచేతనే పురుషుడు ఆడదాన్ని అంత సులభంగా మరిచిపోగలుగుతాడు. స్త్రీకి విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ వైరాగ్యం వస్తుంది. కాని, నేనింకా అప్పటికి చిన్నదాన్నే అవటం మూలాన్ని మీరు నన్ను మరిచిపోవటంలో గల అంతరార్థాన్ని గ్రహించుకోలేకపోయాను. మిమ్మల్ని మొట్టమొదట చూసిన నాటినుంచీ నా మనస్సంతా మీమీదే. మీరు కూడా నా గురించి ఆలోచిస్తూ ఉంటారనీ, నాకోసం నిరీక్షిస్తూ ఉంటారనీ భావించాను. మీ మనస్సులో నాకు స్థానం లేదనీ, మీకు నాతో ఎంతమాత్రం నిమిత్తంలేదనీ గ్రహించిఉంటే నేను బ్రతకగలిగే దాన్నేనా? ఆనాటి సాయంకాలం మీరు చూసిన చూపు, మీ జీవితాన్ని నా జీవితంతో కలిపేందుకు ఒక్క నూలుపోగైనా లేదన్న సత్యాన్ని వెల్లడించింది. మొట్టమొదటిసారిగా వాస్తవికతను ఢీకొన్నాను. ఆ వీక్షణం నా విధిని ప్రప్రథమంగా సూచించింది.

మీరు నన్ను గుర్తించనేలేదు. రెండురోజులు పోయాక, తిరిగి మనం ఎదురు పడినప్పుడు చనువుగా నాకేసి చూశారు మీరు. కాని ఆ చూపులోని ఆంతర్యం మీరు స్త్రీత్వాన్ని మేల్కొల్పిన బాలికను- మిమ్మల్ని ప్రేమించిన బాలికను గుర్తించారని కాదు. ఊరికే, రెండురోజుల క్రితం అదేస్థలంలో ఆ అందమైన పద్దెనిమిదేళ్ల అమ్మాయిని చూసినట్లు గుర్తుకొచ్చింది- అంతే. స్నేహపూర్వకంగా సంభ్రమాన్ని వ్యక్తపరచింది మీ చూపు. చిన్న చిరునవ్వు చిందులు త్రొక్కింది మీ అధరాలపైన. ఇది వరకులాగే మీరు నన్ను దాటిపోయారు. ఇది వరకులాగే నడకలో చురుకు తగ్గించారు. నా ఆపాదమస్తకం ఆనందంతో కంపించిపోయింది. మీరు నన్ను పలుకరించాలని నా హృదయం తహతహలాడింది. ప్రప్రథమంగా మీ మనస్సులో ప్రవేశించానన్న భావం కలిగింది నాలో. నేను కూడా నెమ్మదిగా నడకసాగించాను. మిమ్మల్ని తప్పుకోవటానికి ప్రయత్నించలేదు. హఠాత్తుగా మీ అడుగుల సవ్వడి నా వెనకనుంచి వినిపించింది. వెనక్కి తిరిగి చూడకుండానే, మరుక్షణంలో మీ మృదు మధుర కంఠం నన్ను ఆప్యాయంగా సంబోధిస్తుందని గ్రహించాను. ఆ తలపురాగానే నా ఒంట్లోని రక్తమంతా గడ్డకట్టుకు పోయినట్లయింది. నా గుండె తీవ్రంగా కొట్టుకుంది. పడవటం అసాధ్యమనిపించింది. అంతలోకే మీరు నాప్రక్క నిలిచారు. స్నేహ పూర్వకంగా, చిరకాలపరిచితునికి మల్లే నన్ను పలుకరించారు- నిజానికి నేనెవరో మీకు తెలియకపోయినా, నా జీవితం గురించి కించిత్తుకూడా తెలుసుకోకపోయినా, మీ ప్రవర్తన ఎంత సరళంగా ముచ్చటగా ఉన్నదంటే, మీరడిగినదానికి సంకోచం

లేకుండా సమాధానం చెప్పగలిగాను. ఆ వీధమ్మట కొంతదూరం నడిచాం. దారిలో మీరు ఆ రాత్రికి మీతో భోజనం చెయ్యటానికి నాకు వీలుంటుందా అని అడిగారు. నేను సమ్మతించాను. మీరు కోరితే నేను దేన్ని కాదనగలను?

ఏదో చిన్న హోటలులో ఆరాత్రి భోంచేశాం. అదెక్కడున్నదో మీకు జ్ఞాపకం ఉండదు. మీకైతే లక్షవాటిల్లో అదొకటి. నామాట మాత్రం ఏమిటి? వందలమందిలో నేనొకర్తెను... ఇదొక అనుభవం... అనంతహారంలో ఇదొక చిన్న గొలుసు. మీరు జ్ఞాపకం పెట్టుకోవటానికి ఆ రాత్రి ఏంజరిగింది? నేను అట్టే మాట్లాడలేదు. మీరు నా దగ్గరుండి, నాతో సంభాషిస్తుంటే-నాకెంత హాయిగా ఉందప్పుడు? అనవసర ప్రశ్నలు వేసిగాని, వెర్రిగా మాట్లాడిగాని ఒక్కక్షణం కూడా వృథా పోనివ్వదలుచుకోలేదు నేను. నా ఆరాధనకి తగినట్లుగా ప్రవర్తిస్తూ మీరు ఆ గంటసేపూ నాతో గడిపినందుకు మీకు ఆజన్మాంతం కృతజ్ఞురాలిని. మీ సరళస్వభావాన్ని నేనెన్నటికీ మరిచిపోలేను. అనవసరంగా ఆత్రుత ప్రకటించకుండా, కంగారుపడి చొరవతీసుకోకుండా మీరు నన్ను లాలించారు. అంతక్రితం ఏనాడూ మీకు నా సర్వస్వాన్నీ సమర్పించకపోయినప్పటికీ, ఆ క్షణంలోనైనా నన్ను మీదాన్ని చేసుకోగలిగినంత విశ్వసనీయంగా వాత్సల్యాన్ని ప్రకటించారు ఆరంభంనుంచీ. నా అయిదు సంవత్సరాల దీర్ఘనిరీక్షణ పరిపూర్ణంగా సఫలమైందంటే నాకప్పుడెలా ఉందో ఏమని చెప్పను?

గంటసేపయాక ఆలస్యమైపోతుందని బయటికి వచ్చేశాం. వీధిగుమ్మం దగ్గర ఆగి, నేనేమన్నా పనిహడావిడిలో ఉన్నానా, లేక ఇంకా కొంతసేపు మీతో గడపటానికి అభ్యంతరం ఏమన్నా ఉందా అని అడిగారు. నేను మీదాన్నేనన్న సత్యాన్ని మీకు తెలియకుండా ఎలా దాచగలను? నాకేమీ పనిలేదన్నాను. ఓక్షణం సంకోచించి, ఓసారి మా ఇంటికి రాకూడదా, మాట్లాడుకోవచ్చునన్నారు. "ఓ, తప్పకుండా" అన్నాను సంభ్రమంతో నా మనస్సులోని భావాలను స్పష్టంగా వ్యక్తపరుస్తూ. నేను అంత వెంటనే మీరడిగినదానికి ఒప్పుకునేసరికి మీరు ఆశ్చర్యపోవడం నేను గమనించకపోలేదు. అందుకు మీరు విసుక్కున్నారో లేక సంతోషించారో నాకు సరిగ్గా తెలియదుకాని, మీరు ఆశ్చర్యపోయారన్నదిమాత్రం వాస్తవం. మీ ఆశ్చర్యానికి కారణం ఊహించు నాకు తెలుసు. సాధారణంగా ఆడది మనస్సులో పురుష సంపర్కాన్ని ఎంతతీవ్రంగా వాంఛిస్తున్నా, పైకిమాత్రం విముఖంగా ఉండి, మొదట కొన్నాళ్ళు బెట్టు చూపించి, తిరస్కరించి, ఎదుటివాడి ఆసక్తిని మరింత అధికం

చెయ్యటం సహజం. ఎన్నోవిధాల బ్రతిమాలి, అబద్ధాలాడి, ఆశలురేపి, ప్రమాణాలుచేసి, నానాతంటాలుపడి ఆమెను ఒప్పించవలసి వస్తుంది. సాధారణంగా వేశ్యావృత్తి నవలంబించినవాళ్లే అంత సులభంగా స్పష్టంగా ఒప్పుకుంటారు. అది వేశ్యలకూ; తెలిసీ-తెలియని పిల్లలకూ మాత్రమే సాధ్యమవుతుంది. కాని, నా విషయంలో ఆ విస్పష్టసమ్మతి ప్రబలవాంఛా ప్రేరితమనీ, వెయ్యిదినాల దీర్ఘపరితాప ప్రభావమనీ మీరెలా తెలుసుకోగలరు?

ఏదెలా ఉన్నా, నా ప్రవర్తన మిమ్మల్ని ఆకర్షించింది. మీ దృష్టిలో నేను తమాషాగా కనిపించాను. మనిద్దరం కలిసి నడుస్తూ పోతూండగా మన సంభాషణలో మధ్యమధ్య నా తత్వం ఎలాంటిదో తెలుసుకోవటానికి ఒకటి రెండుసార్లు కదిపిచూశారు. మానవతత్వాన్ని గురించి మీకు తెలిసినదాన్నిబట్టి చూస్తే నేను మీకంటికి అసామాన్యంగా కనిపించాను- ఈ చక్కనిచుక్క మనస్సులో ఏదో రహస్యం దాచుకుంటోం దనుకున్నారు. మీలో కుతూహలం రేగింది. మీ యుక్తిప్రశ్నలు చూస్తే నా రహస్యాన్ని బయటకి లాగటానికి ప్రయత్నిస్తున్నారని తెలిసిపోయింది. అందుకు తగినట్లుగా నేను కూడా తప్పించుకుంటూ చమత్కారంగా సమాధానాలిచ్చాను. అవిధంగా మూర్ఖత్వాన్నైనా ప్రదర్శించానుగాని నా రహస్యాన్నిమాత్రం మీకు చెప్పలేదు.

మీ ఇంటికి చేరుకున్నాం. ఆమేడమెట్లు మీతో కలిసి ఎక్కడమంటే నాకెలా ఉంటుందో చెప్పినా మీకర్థంకాదండీ... అలా అంటున్నందుకు క్షమించండి- పిచ్చెత్తిపోయి, వెర్రి సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయాను. ఇప్పటికికూడా ఆ విషయాన్ని తలుచుకుంటే కళ్లమ్మట నీరు రాకమానదు- కాని నా కళ్లలో నీరు నిండుకుంది. ఆ ఇంట్లో ప్రతీదీ నాకు ప్రేమాస్పదమే. అక్కడున్న ప్రతీదీ నా బాల్యావస్థకూ, అప్పటి వాంఛలకూ చిహ్నం. అక్కడున్న తలుపువెనక నుంచుని ఎన్నివేలసార్లు మీరాకకోసం ఎదురుచూశాను; మేడ మెట్లమీద మీ పదధ్వని వినేదాన్ని... అక్కడే మిమ్మల్ని మొట్టమొదట చూశాను... మీ రాకపోకలనూ, మీచర్యలనూ కనిపెట్టిచూస్తూ ఉండేదాన్ని ఆ తలుపుకుండే దొంగకన్నం లోంచి... అక్కడున్న కాళ్లుతుడుచుకునే కొబ్బరిపీచు మీద ఒకసారి మోకరిల్లాను... తలుపుతాళం తీస్తున్న ధ్వని నాకు బాగా అలవాటే- అదే మీ రాకకు సూచిస్తుంది... ఈ కొద్దిగజాల స్థలంలోనే నా చిన్నతనం, అప్పటి ఆశలూ గూడుకట్టుకున్నాయి... నా జీవితమంతా ఇక్కడే ఉండేది. మహాప్రళయంలా నాలో ఉద్రేకం చెలరేగింది. నా ఆశలన్నీ

ఫలించబోతున్నాయి. నేను మీతో కలిసి మీ-మన ఇంటికి వెడుతున్నాం. మీ గదితలుపు వరకూ (నేను ప్రయోగిస్తున్నమాటలు నిస్సారంగా తోచవచ్చు మీకు- కాని నాకంతకంటె మంచిమాటలు దొరకటంలేదు) వాస్తవిక ప్రపంచం - నా గతజీవితంలో నేను నివసించిన నిస్సార దైనందినలోకం ఇది... ఈ తలుపు కవతల అంతా మాయాలోకం - నేను చిన్నతనంలో సృష్టించుకున్న ఊహాలోకం- అలాడీన్ ఆవరణ! ఎన్నివేలసార్లు ఆ తలుపుకేసి కళ్లు అప్పగించి చూశానో, ఆ తలుపు తెరుచుకొని లోపలికి ప్రవేశిస్తుంటే- ఆ క్షణంలో నాకెలా ఉంటుందో ఒక్కసారి ఊహించండి.

ఆ రాత్రంతా మీతోనే గడిపాను. మీకంటె ముందుగా మరే పురుషుడూ నన్నూ నా శరీరాన్నీ స్పృశించలేదనీ, అధమం చూడనైనాలేదనీ మీరు కలలోనైనా ఊహించుకొని ఉండరు. అయినా మీరెలా ఊహించుకుంటారు? నేను సిగ్గు, బిడియం పూర్తిగా వదిలేసి, ఎక్కడ నా ప్రేమరహస్యం వెల్లడైపోతుందోనని భయపడి మీకు కించిత్తు అభ్యంతరం చెప్పకుండా లొంగిపోయినప్పుడు? అలా జరిగితే మీరెంత కంగారుపడిపోయి ఉండేవారు- మీరెప్పుడూ ఆషామాషీగా జరిగిపోయే వాటితోనే, తేలిగ్గా తేల్చిపారేసే విషయాలతోనే వ్యవహరిస్తారు. ఇతరుల జీవితాల్లో జోక్యం కలిగించుకోవటం మీకు తగని భయం. ఇష్టంవచ్చినట్లు మిమ్మల్ని మీరు లోకానికి ధారపోసుకుంటారు. కాని, దేన్నీ త్యాగం చెయ్యలేరు. ఇప్పుడు నేను నా కన్యాత్వాన్ని మీకు ధారపోశానంటే మీరు అపార్థం చేసుకోకండి. మీమీద నేనేమీ నిందమోపటం లేదు. మీరు నన్నేమీ మభ్యపెట్టలేదు, మోసగించలేదు, నా మానం చెడగొట్టలేదు. నేనే మీ ఒడిలో వాలిపోయాను... నా విధికి నేనే ఎదురు వెళ్లాను. ఆ రాత్రి సౌఖ్యానికి మీపై కృతజ్ఞతాభావం తప్ప మరొకటి లేదు. ఆరాత్రి చీకటిలో కళ్లు తెరిచినప్పుడు మీరు నా పక్కనే పడుకొని నిద్రపోతున్నారు. అప్పుడు నాకు స్వర్గంలో ఉన్నట్లనిపించింది - నక్షత్రాలు నా చుట్టూ మెరవకపోయినా. ఆరాత్రి మీకు నా సర్వస్వాన్నీ సమర్పించినందుకు నేనెప్పుడూ చింతించలేదు. మీరు నాపక్కలో పడుకొని నిద్రపోతుంటే, మీరు ఊపిరిపీలుస్తుంటే వింటూ, మీదేహాన్ని స్పృశించాను... మీ సామీప్యత సిద్ధించినందుకు ఆనందం పట్టలేకపోయాను. నా కళ్లల్లో ఆనందబాష్పాలు!

తెల్లవారుతూండగానే లేచి వెళ్ళిపోయాను. ఆఫీసుకి వెళ్ళాలి. అదికాకుండా మెలకువవచ్చేలోగానే వెళ్ళిపోవాలని-నా ఉద్దేశం. నేను వెళ్ళటానికి సిద్ధమవుతూంటే మీరు మీ చేత్తో నన్ను దగ్గరగా లాక్కుని నా కళ్లవైపు చాలాసేపు చూశారు. ఎప్పటిదో

ఏదైనా సంగతి గుర్తుకొస్తున్నదా, లేక, నేననుభవించిన ఉజ్జ్వల సౌఖ్యం నాలోని అందాన్ని విరజిమ్ముతున్నదా? నా అధరాలను ముద్దుపెట్టుకున్నారు. నేను వెళ్లటానికి సిద్ధమయాను.

"నీతో కాసిని పువ్వులేమైనా పట్టుకెళ్లవూ?" అని అడిగారు. అక్కడున్న రాతబల్లమీద గాజు కూజాలో నాలుగు తెల్ల గులాబీపువ్వులున్నాయి. (ఆరోజున వాటివైపే దొంగచూపు చూశాను) వాటిని నా చేతికిచ్చారు. వాటిమీద ఎన్ని ముద్దులు కురిపించానో.

ఆ మర్నాడు సాయంకాలం కలుసుకోవటానికి ఏర్పాటు చేసుకున్నాం. అప్పుడు కూడా మన సమాగమం సంభ్రమాశ్చర్యాలతో కూడినదే. మూడవ రాత్రికికూడా అవకాశం ఇచ్చారు. అప్పుడే చెప్పారు- మీరు కొన్నాళ్లపాటు ఈ ఊళ్ళో ఉండటం లేదని. అబ్బ! మీ ప్రయాణాలంటే నాకు పరమ అసహ్యం! రాగానే నాకు ఉత్తరం ద్వారా కబురుచేస్తానని ఒట్టువేశారు. నా పోస్టాఫీసు ఎడ్రసు మాత్రమే ఇచ్చాను మీకు. నా అసలుపేరు కూడా చెప్పలేదు. నా రహస్యాన్ని భద్రంగా దాచుకున్నాను. వెళ్ళిపోయేటప్పుడు మళ్ళీ పువ్వులిచ్చారు- వెళ్ళిపోయేటప్పుడే.

రోజు రోజూ రెండు నెల్లపాటు నన్ను నేనే ప్రశ్నించుకునేదాన్ని... ఉహూ, నా విరహవేదనను వర్ణించను... ఫిర్యాదుచెయ్యను... మీరు ఉద్రిక్త స్వభావులైనా, మంద మతులైనా విశ్వాసఘాతకులైనా, దయామయులైనా మిమ్మల్ని నేను ప్రేమిస్తాను. మీరు ఉన్న స్థితిలోనే మిమ్మల్ని ప్రేమిస్తాను. రెండునెలలు అయాక తిరిగివచ్చారు. అదైనా మీ కిటికీ దగ్గర దీపంచూసి గ్రహించుకున్నాను. నాకోసం కబురు పెట్టలేదు. ఒక ఉత్తరం ముక్కయినా- ఒక్క ముక్కయినా రాయలేదు...

నిన్న చనిపోయిన నా కొడుకు కూడా మీవాడే. వాడు మీకొడుకు- ఆ మూడు రాత్రులలో ఒకరాత్రి ఫలితం. నేను మీదాన్ని- వాడు పుట్టేనాటి వరకూ మీ ఒక్కరిదాన్నే. మీ స్పర్శవల్ల నాదేహం పునీతమైనట్లు భావించాను. ఇక మరే మగవాడి సరసాలకు వశం కావటం సాధ్యంకాని పని. వాడు మన కొడుకండీ... నా మనః పూర్వకప్రేమ, మీ రసికానురాగమూ మిళితమై వాడి జన్మకు కారణభూత మయాయి. మనబిడ్డ, మనకొడుకు, మన ఏకైక పుత్రుడు. మన కుర్రవాడి గురించి నేను మీకెందుకు చెప్పలేదన్ని ఆశ్చర్యపోతారేమో. ఇన్ని సంవత్సరాలు మౌనం

వహించి, వాడి గురించి ఇప్పుడు వాడు దీర్ఘనిద్రలో మునిగి నన్నిక శాశ్వతంగా వదిలి వెళ్ళిపోయే సమయంలో మీకు వాణ్ణి గురించి చెబుతున్నాను. ఇంతకుముందు మీకెలా చెప్పగలిగి ఉండేదాన్ని? నేనొక అపరిచితను - ఆ మూడురాత్రులూ మీతో గడపాలని తహతహ లాడిపోయిన ఒక కన్యను. ఏదో యధాలాపంగా వచ్చిన అవకాశంలో అనుభవించిన ఆడది మిమ్మల్ని విశ్వసించిందని - అవిశ్వసనీయులైన మిమ్మల్ని విశ్వసించిందని చెబితే మీరుభస్తే నమ్మేవారు కాదు. నానా హంగామా చేసిన మీదటగాని వాణ్ని మీ కొడుకేనని ఒప్పుకునేవారుకాదు. ఏదో పైకి ఒకవేళ నామాట నమ్మినట్లు కనిపించినా, అవకాశం దొరికిందికదా అని, మీరు భాగ్యవంతులుకదా అని, మరో ప్రియుడికి పుట్టిన బిడ్డను మీకు అంటగట్టానేమోనన్న అనుమానం లోపల మిమ్మల్ని అనునిత్యం వేధిస్తూనే ఉండేది. మీరు తప్పక అనుమానించేవారు. మీకూ నాకూ మధ్య నిత్యం ఏవో అపోహచ్ఛాయలు మెదులుతూనే ఉండేవి. బహుశా మీ గురించి మీకన్న నాకే ఎక్కువగా తెలుసునేమో. మీకెప్పుడూ జల్సాగా, ఖులాసాగా బాదరాబందీ లేకుండా ఉండటం ఇష్టం. అదే ప్రేమ అనుకుంటారు. హఠాత్తుగా పితృభారం మీపైన పడేనరికి మీతత్వానికెంతో విరుద్ధంగా తోచిఉండేది. అకస్మాత్తుగా ఒక పసికందు జీవితానికి బాధ్యత వహించటం మాటలుకాదు. స్వేచ్ఛావాయువులే మీ జీవనాధారం. తప్పకుండా నన్నొక బంధనగా భావించి ఉండేవారు. అంతరంగంలో, మనస్ఫూర్తిగా కాకపోయినా, నెత్తిమీద వచ్చిపడిందని నన్ను అసహ్యించుకునేవారు. బహుశా, ఇప్పుడే... మళ్ళీ మరో గంటదాకానో, మరో క్షణకాలమో నేను భారంగా తోచవచ్చు... మీరు నన్ను అసహ్యించుకుని ఉండొచ్చు, కాని నా జీవితాంతం వరకూ మీకు కష్టం కలిగించటంకాని, భారమనిపించటంకాని చెయ్యలేదనే నా గర్వం. ఆ భారమంతా నామీదనే పెట్టుకుంటానుకాని, మీకు మాత్రం నేను బాధ్యత అప్పచెప్పను. మీరు చనువుగా చేరదీసి లాలించి అనుభవించిన ఆడవారిలో నేనొకర్తెగా ఉండటమే నా కోరిక. వారిపట్ల కృతజ్ఞతాభావంతోనైనా వారిని తలుచుకుంటారేమో, నిజానికి నా గురించి మాత్రం మీరెప్పుడూ ఆలోచించనేలేదు. మీరు నన్ను విస్మరించారు.

మిమ్మల్ని నిందించటం లేదు. నన్ను నమ్మండి, నేను మీగురించి ఫిర్యాదు చెయ్యటం లేదు. బాధలో మునిగిపోయి నా కలం ఏదైనా రాస్తే ఈసారికి నన్ను క్షమించండి. మీరు నన్ను క్షమించాలి- నా పిల్లవాడు- మన పిల్లవాడు మిణుకుమిణుకు మంటున్న నూనెదీపం వెలుతురులో చచ్చిపడిఉన్నాడు. ఈ బాధంతా నేనొక్కర్తెనే

అనుభవించాల్సి వచ్చినందుకు క్రోధం పట్టలేక పళ్లు పటపటలాడిస్తూ గుప్పిళ్లు బిగించి "హంతకుడా" అని తిట్టాను ఆ భగవంతుణ్ని. ఫిర్యాదు చేస్తున్నందుకు క్షమించండి. నాకు తెలుసు మీరు దయామయులనీ; సహాయం అర్థిస్తే తప్పక చేస్తారనీ తెలుసును. ఏ మనిషి అయినా మీనుంచి కోరినదంతా రెండుచేతులా తీసుకోవచ్చు, అయితే ఒక్కవిషయం మాత్రం ఒప్పుకోవాలి- మీ సానుభూతికి సంస్కారం లేదు. మిమ్మల్ని అడగాలి. సహాయాన్ని అపేక్షించినవారికే సహాయం చేస్తారు. కష్టాల్లో బాధల్లో ఉన్నవాళ్లు మీకు ప్రేమాస్పదులు కాదు, సుఖంగా ఉన్నవాళ్లుతప్ప. మీవంటివాళ్లు ఎంత దయామయులైనా, మీనుంచి ఏదైనా అపేక్షించటం కష్టం-చాలా కష్టం. నా చిన్నతనంలో ఒకసారి నేను మా తలుపు కన్నంలోంచి చూస్తూండగా తలుపుతట్టి పిలిచిన ఒక ముష్టివాడికి ఏదో యిచ్చి పంపించారు. వాడు ఏదైనా నోరువిప్పి అడిగే లోపలే మీరు గబగబా వాడిచేతిలో పడేసి వాణ్ణి వదిలించుకున్నారు. మీ కంగారూ, గాభరాచూస్తే ఆ పీడ ఎంత త్వరగా వదిలిపోతే అంత మంచిదన్నట్లు ప్రవర్తిస్తున్నారని తోస్తుంది. వాడిముఖాన్ని చూడటమే మీకు విపరీతమైన భయమనుకుంటాను. మీరంత విసుగుతో బిడియంతో సహాయం చెయ్యటం నేనెప్పటికీ మరిచిపోలేను. కృతజ్ఞతా పూర్వకంగా చెప్పే పలుకులు వినటానికికూడా మీకు విసుగే. అందువల్లనే ఎన్ని చిక్కుల్లోవున్నా నేను మీ దగ్గరికి రాలేదు. నేను కోరిన సహాయం తప్పక చేసేవారనీ, నా కొడుకు మీకూ కొడుకేననుకోవటానికి సందేహించినా నాకు తగిన సహాయం చేసేవారని నాకు బాగా తెలుసును. నాకు బోలెడు డబ్బుఇచ్చి, అన్ని సదుపాయాలూ సమకూర్చి ఉండేవారు- మీ అసహనాన్ని కప్పిపుచ్చుతూ, మనస్సులో రహస్యంగా, ఈ గొడవ ఎలా వదుల్చుకోవడమా అని బాధపడుతూ ఉండేవారు. పుట్టబోయే పసికందుని ఏవిధంగానైనా వదుల్చుకోమని సలహా ఇచ్చేవారని కూడా నాకు గట్టినమ్మకం. అన్నిటికన్నా నేను భయపడినదిందుకోసమే. మీరు కోరినవన్నీ నేను చేస్తానని నాకు తెలుసుగా - అందుకని. నాబిడ్డ నా సర్వస్వమూను. మీబిడ్డ - మీరే పునర్జన్మించారు - కాని ఖులాసాగా జల్సాగా తిరిగే మీరుకాదు - అలా అయితే నా దగ్గరే ఉంచుకోవాలనే ఆశ పెట్టుకునేదాన్నే కాదు- మీరు నా స్వంతానికి, నా రక్తమాంసాలన్నీ, నా జీవితంలో అంతర్లీనమయ్యేదాన్ని నాకు ప్రసాదించారు. ఆఖరికెల్లాగో మిమ్మల్ని బంధించాను. మీ సజీవరక్తం నా నరనరాల్లోనూ ప్రసరించటం నేను స్పష్టంగా గ్రహించాను. మిమ్మల్ని పోషించి, లాలించి ముద్దులాపెట్టుకోవచ్చు

తనివితీరా. మీవల్ల నేను గర్భందాల్చానని తెలుసుకోగానే, అందుకే అందుకే అంత సంతోషించాను. అందుకే మీకా రహస్యాన్ని వెల్లడించలేదు. ఇకముందు మీరు నన్ను తప్పించుకోవటానికి వీల్లేదు- మీరు నా సొంతం.

మొదటిరెండు మూడు మాసాలూ గడిచినంత సునాయాసంగా తక్కిన నెలలన్నీ గడిచాయనుకోకండి. ఎన్ని కష్టాలతో ఎన్ని బాధలతో గడిచాయో; ఈ తుచ్ఛ మానవజాతిపైన రోత పుట్టింది. మా పినతండ్రి బంధువులు నా పరిస్థితి గమనించి, వెంటనే మా వాళ్లకు కబురుపెట్టి ఉంటారు. డబ్బు పంపమని మా అమ్మకి కూడా రాయలేదు. ఎలాగో ఆ సమయంవరకూ ఒంటినున్న నగలన్నీ అమ్మేసి కాలక్షేపం చేశాను. నా పురిటికి వారంరోజుల ముందర నా పది పదిహేను రూపాయలూ ఎవరో ఎత్తుకుపోయారు. ధర్మాసుపత్రికి వెళ్ళవలసి వచ్చింది. పిల్లాడు- మీకొడుకు అక్కడ ఆసుపత్రిలో, ఆ నరకంలో, దారిద్ర్యంలో దిక్కులేకుండా లోకచ్యుతుడుగా జన్మించాడు. అది భయంకరమైన ప్రదేశం. అక్కడ ప్రతీదీ అపరిచితంగా, అనురాగ రహితంగా కనిపించింది. ఒకరికీ మరొకరికీ మధ్య అనురాగం లేదు. ఒకరిపైన మరొకరికి అసహ్యం. మా మధ్య ఒక్కటే బాంధవ్యం - మా అందరినీ దరికి చేర్చినది దారిద్ర్యమూ, వ్యధ. ఆ ప్రదేశమంతా జనంతో క్రిక్కిరిసిపోయి, మత్తుమందు వాసనతో, రక్తగంధంతో, ఏడుపులతో మూలుగులతో నిండి దుర్భరంగా ఉంది. ఈ స్థలంలో వడ్డరోగి వ్యక్తిత్వాన్ని కోల్పోతుంది- ఆ వ్యక్తి పేరు మాత్రం ఆసుపత్రి చిట్టా పుస్తకంలో ఉండిపోతుంది. ఆ పక్కమీద ఉన్నది కంపించిపోయే మాంస ముద్ద- పరిశోధించ వలసిన పదార్థం...

ఇటువంటి విషయాలన్నీ మీతో చెబుతున్నందుకు క్షమించమని వేడుకుంటున్నాను. ఇంకెప్పుడూ ఇటువంటివి మీతో చెప్పను. పదకొండు సంవత్సరాలు మౌనం వహించాను- ఇక త్వరలోనే శాశ్వతంగా మూగదాన్నైపోతాను. ఒక్కసారైనా తనివితీరా గట్టిగా ఏడవనివ్వండి... ఎంత కష్టపడి ఇంత విలువైన బిడ్డను పొందానో- నన్నొకప్పుడు ఆనందసాగరంలో ముంచివేసి ఇప్పుడిక్కడ చచ్చిపడిఉన్న నా కొడుకు గురించి మీతో చెప్పనివ్వండి. ఆ భయంకర దినాలను వాడి బోసినవ్వులూ, వాడి మధుర కంఠ స్వరం మరిపించేవి. వాడివల్ల పొందిన ఆనందంలో గత దుఃఖమయ జీవితాన్ని మరిచిపోగలిగాను. ఇప్పుడు, వాడు చనిపోగానే ఆవేదన తిరిగి ఆరంభమైంది. దాన్ని యీ విధంగా వ్యక్తపరుస్తున్నాను. కాని మిమ్మల్ని నిందించను. ఆ

భగవంతుణ్నే- ఇలా నిష్కారణంగా వ్యథ కలుగజేసిన ఆ దేవుణ్నే నిందిస్తాను. మీమీద నాకెన్నడూ క్రోధభావం కలుగనేలేదు. పిల్లవాణ్ని కనేసమయంలో ఆ అంతులేని బాధలోకూడా మీ మీద విసుక్కోలేధు. మీ అనురాగాన్ని పొందిన ఆ మూడు రాత్రుల గురించీ నేనెప్పుడూ చింతించలేదు. మిమ్మల్ని ప్రేమించటం మానలేదు. నా జీవితంలో మీరు ప్రవేశించిన గడియను తలుచుకుని ఆనందించటం మానలేదు. ఆ గడియ మళ్ళీ నాకు సంప్రాప్తిస్తుందంటే, నరకానికి వెళ్లమన్నా వెడతాను- ఒకసారి కాదు- వెయ్యిసార్లయినాసరే.

మనకొడుకు నిన్ననే పోయాడు- పాపం, మీరు వాణ్ని చూడనేలేదెన్నడూ. వాడి ముద్దొచ్చే ముచ్చటైన విగ్రహాన్ని ఒక్కసారికూడా మీరు స్పృశించనేలేదు; వాడిమీద మీ చూపులెన్నడూ నిలువనేలేదు. మనకొడుకు పుట్టిన తర్వాత చాలాకాలంవరకూ మీ కంటపడకుండా తిరిగాను. మీ గురించి తపించటంలో తీవ్రత కొంచెం తగ్గింది. నిజానికి, ఇదివరకుటంత గాఢంగా మిమ్మల్ని ప్రేమించటం లేదనుకుంటాను. ఇప్పుడు నాకు కొడుకు ఉన్నాడు కాబట్టి మీపై ప్రేమ అంతగా బాధించలేదు. మీకూ వాడికీ మధ్య నన్ను విభజించుకోవటం నాకు నచ్చలేదు. అందుకే నేనింక మీవశం కాలేదు. ఎలాగైనా మీరు స్వతంత్రంగా హాయిగా ఉన్నారు. కాని కుర్రవాడికి నేను అవసరం- వాణ్ని పెంచాలి- వాణ్ని ముద్దుపెట్టుకోవాలి, లాలించాలి. మీ గురించి నేను పొందే విరహవ్యథ కొంత మానిపోయింది. మీ ప్రతిరూపం నా కడుపున పుట్టి, నిజంగా నా సొంతం కాగానే నామీద భారం కొంత తగ్గినట్లనిపించింది. ఇప్పుడింక తరచుగా మీ గురించి ఆలోచనలు రావటంలేదు. కాని ఒక్కసంగతే- మీ పుట్టినరోజునాడు మాత్రం ప్రతి సంవత్సరం తెల్లగులాబీ పువ్వుల్ని పంపించేదాన్ని- సరిగ్గా ఆ మొదటిరాత్రి గడిచాక నాకు మీరిచ్చిన గులాబీల్లాంటివే. వాటిని ఎవరు పంపించారని ఈ పది పదకొండు సంవత్సరాల్లోనూ ఎప్పుడైనా ఆలోచించారా? ఒక ఆడపిల్లకి అటువంటి పువ్వులు మీరిచ్చినట్లు ఎప్పుడైనా గుర్తుకి తెచ్చుకున్నారా? ఏమో నాకు తెలియదు- నాకింకెప్పటికీ తెలియదు. అనామకంగా అంధకారంలోంచి మీకు వాటిని పంపటమే నావని. ఏడాది కొకసారి ఆ గడియను తిరిగి జ్ఞప్తికి తెచ్చుకునేదాన్ని.

మన కొడుకు గురించి మీకేమీ తెలియదు. వాణ్ని మీ కంటపడకుండా చేసినందుకు ఉన్నాడు నన్ను నేనే నిందించుకుంటున్నాను. చూస్తే వాణ్ని మీరెంతో

ప్రేమించేవారు. వాడు నిద్రపోయి లేచేటప్పుడు తన కళ్ళు తెరిచి- ఆ నల్లటి కళ్ళు- మీవే అవి- లోకాన్నీ నన్నూ సంతోషంతో చూసే ఆ కళ్ళు తెరిచి చిరునవ్వు నవ్వుతూండగా మీరెప్పుడూ చూడనేలేదు. వాడెంత తెలివైనవాడు, ఎంత ముద్దొచ్చేవాడు! మీ చురుకుతనం, మీ మనశ్చాంచల్యం, అన్నీ వాడికబ్బాయి- ఆ లక్షణాలు పసితనంలో మరింత ఉద్ధృతంగా కనిపిస్తాయి. మీరు జీవితంలో ఆటలాడినట్లుగా వాడు బొమ్మలాటలాడుతూ మైమరచిపోయేవాడు. ఆ వెంటనే మళ్ళీ ముభావంగా అయిపోయి ఓమూల కూర్చుని కథల పుస్తకాలు చాలాసేపు చదువుతూ ఉండేవాడు. వాడు మీరే- అది మీ పునర్జన్మ. ఆకతాయతనం, గాంభీర్యం- మీకుండే రెండు సహజలక్షణాలూ వాడిలో సుస్పష్టమవుతూండేవి. పాఠాలు శ్రద్ధగా చదువుకునేవాడు. - ఇంగ్లీషులో వసపోసినపిట్టలా వాగుతూ ఉండేవాడు. వాడి తరగతిలోకల్లా వాడి పుస్తకాలే పరిశుభ్రంగా ఉండేవి. ఎంత చక్కగా, ఎంత దర్జాగా ఉండేవాడు చిన్న పురుషుడులాగ! వాణ్ని తీసుకొని ఏదైనా పార్కుకి వెడితే, ఆడవాళ్ళంతా వాడిచుట్టూచేరి జుట్టునీ, వాడిగడ్డాన్నీ ముద్దుపెట్టుకుంటూ వాణ్ని వదిలేవారు కాదు. మొగవాళ్ళు కూడా వాణ్ని చూసి విస్తుబోయేవారు. వాడు అంత అందంగా, అంత సరళంగా అంత ఆకర్షణీయంగా ఉండేవాడు. ఓసారి స్కూల్లో ఆటలపోటీలు చూట్టానికి వెళ్ళినప్పుడు, సిలుగునిసూటు, నల్లనిబూట్లు, చిన్నదొరలటోపీ, నెక్టై... టిప్‌టాప్‌గా వెళ్ళాడు- ఇప్పుడీ కుక్కిమంచంలో ఈ నికృష్టస్థితిలో- పాలిపోయిన పెదవులతో, చేతులు కట్టుకొని...

వాడికన్ని విలువైన వస్తువులు కొనిపెట్టి వాణ్ని అంతదర్జాగా పెంచి వాడికి ధనవంతుల ప్రపంచంలో ప్రవేశార్హత ఏవిధంగా కల్పించానని మీరు ఆశ్చర్యపోతారు. నేను అంధకారంలోంచి మాట్లాడుతున్నానని మీకు చెప్పాను కదండీ. సిగ్గు లేకుండా చెబుతున్నాను మీకు. చెవులు మూసుకొని ముఖం చిట్లించుకోకండి. నన్ను నేనే విక్రయించుకున్నాను- అంటే వేశ్యావృత్తిని అవలంబించానని కాదు- నన్ను విక్రయించుకున్నానంతే. నా స్నేహితులు చాలా డబ్బున్నవాళ్ళు. మొదట్లో నేనే వాళ్ళని ఆశ్రయించాను. ఆ తర్వాత వాళ్ళే నన్ను వెతుక్కుంటూ రావటం ప్రారంభించారు- ఎంచేతనంటే (మీరెప్పుడైనా గమనించారో లేదో!) నేను అందమైనదాన్ని. నన్ను అనుభవించిన ప్రతివాళ్ళూ నన్ను ఆరాధించేవారు, వాళ్ళందరి కృతజ్ఞతనూ, ప్రశంసనూ పొందేదాన్ని. వాళ్ళందరూ నన్ను ప్రేమతో చూశారు- మీరొక్కరుతప్ప- నాకు

ప్రేమాస్పదులైన మీరొక్కరు తప్ప.

నేను చేసినపని చెప్పిన తర్వాత నన్నిప్పుడు నీచంగా పరిగణిస్తారా? అలా చెయ్యరనే నా నమ్మకం. మీరంతా అర్థంచేసుకుంటారని నాకు తెలుసును- నేచేసిన దంతా మీకోసమే- మీ ప్రతిరూపం కోసం - మీ కొడుకుకోసమేనని మీరు గ్రహిస్తారు. ఆ ఆసుపత్రిలో పడివుండగా దారిద్ర్యం పెట్టే ఘోర యమయాతన అంతా అనుభవించాను. దరిద్రలోకంలో అధఃపాతాళంలో అణగిపోయినవాళ్లే ఎప్పుడూ పాపాలకు గురి అవుతూంటారు. మీ కొడుకు- అంతముద్దొచ్చే కుర్రాడు అటువంటి నరకంలో, వీధుల్లో నానా పాపిష్టిపనులు చేస్తూ, పూరిగుడిసెల్లో విషవాయువులు పీలుస్తూ జీవించటం- ఊహలో కూడా భరించలేకపోయాను. వాడి సున్నితమైన అధరాలు బూతులు మాట్లాడటం నేర్చుకోకూడదు. వెన్నపూసలాంటి వాడి ఒంటిమీద బట్టయినా లేకుండా ఎండకీ వానకీ బలికావటం నేను సహించలేను. మీ కొడుక్కి ప్రపంచంలోకల్లా మంచివన్నీ కావాలి; ధనం, సౌఖ్యం అన్నీ అనుభవించాలి బాదరా బందీ లేకుండా. జీవితంలో వాడు మీ అడుగుజాడల్ని అనుసరించాలి. మీరు విహరించిన వాతావరణంలోనే వాడుకూడా విహరించాలి.

అందుకోసమే నన్ను నేను విక్రయించుకున్నాను. నేనేమీ త్యాగం చేశానని చెప్పటం లేదు. సంఘం శాస్త్రయుక్తంగా పలికే "నీతి" "అవినీతి" అన్నపదాలు నాకు అర్థశూన్యంగా కనిపిస్తాయి. నా దేహం మీ ఒక్కరికే చెందుతుంది. మీరు నన్ను ప్రేమించనప్పుడు నా దేహాన్ని నేనేంచేస్తే ఏమవుతుంది కనక? నా స్నేహితుల సరసాలుగాని, వారి గాఢానురాగం కాని నా హృదయతంత్రుల్ని మీటలేకపోయాయి. వారిలో కొంతమందిని గౌరవించకుండా ఉండలేక పోయేదాన్ని. నా విధిని తలుచు కున్నప్పుడు వారి వ్యర్థానురాగాలను చూసి వారిపైన జాలి కలిగేది. వీళ్లంతా నన్ను ప్రేమతోనే చూసేవారు. నన్నెంతో అల్లారుముద్దుగా గారాబంగా చూసుకునేవారు. అందరూ ఎంతో ధనవ్యయం చేసేవారు. వారిలో ఒక భార్యా వియోగి, బాగా వయస్సు మీరినవాడు, పేరు ప్రతిష్ఠలున్నవాడు, తన పరపతినంతా వినియోగించి మీ కొడుక్కి పబ్లిక్ స్కూల్లో సీటు సంపాదించిపెట్టాడు. ఈయన నన్ను కన్నకూతురి కన్నమిన్నగా చూసుకునేవాడు. నాలుగైదుసార్లు తనని పెళ్లి చేసుకోమనికూడా బలవంత పెట్టాడు. అలాగే అయితే నేనీపాటికి ఒక లక్షాధికారిణినై బంజారాహిల్స్‌లో పెద్ద భవంతిలో ఉండేదాన్ని. కుర్రవాడి గురించి ఏ బెంగా లేకుండా ఉండేదాన్ని. వాడికి

కూడా ప్రేమించే తండ్రి, నాకు మంచి దయామయుడైన భర్త లభించేవాడు. ఆయనకి బాధ కలుగుతుందని తెలిసినా, వివాహానికి మొండిగా ఒప్పుకోలేదు. బహుశా నాది మూర్ఖత్వమే కావచ్చు- లేకుంటే నేను లొంగిపోయినట్లయితే ఈపాటికి ఎక్కడో ప్రశాంతమైన గృహజీవితాన్ని గడుపుతూ ఉండేదాన్ని- నా బిడ్డకి ఈగతి పట్టకపోయేది. నేనంత మొండికెత్తడానికి కారణం మీ దగ్గరెందుకు దాచటం? నిర్బంధంలో ఉండటం నా కిష్టంలేదు. స్వేచ్ఛగా ఉండాలనుకున్నాను- మీ కోసమే. నా అంతరాంతరాల్లో నాకు తెలియకుండానే, చిన్నతనంలో నేను కన్నకలలనే ఇంకా కలగంటూ ఉండేదాన్ని. ఏనాడో ఒకనాడు మీరు నన్ను చేరదీస్తారేమో- ఒక గంటసేపటికోసమైనా సరే. ఈ ఒకగంట అవకాశం కోసం, మీ పిలుపువిని బదులు పలికేందుకు స్వేచ్ఛగా ఉండాలనే అన్నిటినీ త్రోసిపుచ్చాను. నాలో స్త్రీత్వం మేలుకొన్నప్పటినుంచీ నా జీవితంలో నిరీక్షణ తప్ప, మీ పిలుపుకోసం నిరీక్షించటం తప్ప నేను చేసినదేముంది?

ఆఖరికి నేను ఆశించిన సమయం ఆసన్నమైంది, అయినా దాని రాక మీకింకా తెలియదు! అది వచ్చినప్పుడు మీరు నన్ను గుర్తించలేదు. మీరు నన్నెప్పటికీ గుర్తించనేలేదు- ఎప్పటికీ... ఎప్పటికీ. సినిమాల్లోనూ, సభల్లోనూ, పార్కుల్లోనూ ఇక్కడా అక్కడా చాలాసార్లే మిమ్మల్ని కలుసుకున్నాను. ప్రతిసారీ నా హృదయం గంతులువేసేది, కాని మీరు నన్ను లక్ష్యం చెయ్యకుండానే నా పక్కనుంచే వెళ్ళిపోయేవారు. బాహ్య రూపానికి నేను మరో మనిషినై పోయాననే చెప్పాలి. సిగ్గుతో ముడుచుకుపోయే అప్పటి కన్య - నేడు యువతి. అందకత్తె అని చెప్పు కుంటారు. చక్కని దుస్తులు ధరించి బాగా ముస్తాబై చుట్టూ స్నేహితులతో ఉన్న నన్ను చూసి, ఆనాడు మీ పడకగదిలో మసకదీపం వెలుగులో సిగ్గుతో మెలగిన ఆ అమ్మాయేనని ఎలా గుర్తుపట్టగలరు? ఒక్కొక్కప్పుడు నా కూడా వున్న స్నేహితుడు మిమ్మల్ని పలుకరిస్తే అతన్ని తిరిగి చిరునవ్వుతో పలుకరిస్తూ నావైపు వీక్షించేవారు. కాని ఆ చూపు- ఒక అపరిచితుడు మర్యాదగా చూసేచూపు, విరుద్ధమైన చూపు- అంతేకాని, దూరంలో, అనంతదూరంలో ఉన్నదాన్ని గుర్తుపట్టిన చూపు కాదది. ఒకసారి నాకు బాగా జ్ఞాపకం- మామూలు ప్రకారం మీరు నన్ను గుర్తుపట్టకపోయేసరికి యమయాతన అనుభవించాను. ఒక స్నేహితుడితో కలిసి సినిమాకి వెళ్ళాను. ఇద్దరం బాక్సులో కూర్చున్నాము. ఇంతలోకే మీరు వచ్చి ఆ పక్కభాక్సులోనే కూర్చున్నారు. సినిమా ప్రారంభం కాగానే దీపాలన్నీ ఆరిపోయాయి. మీ ముఖాన్ని

చూడటం ఇంక సాధ్యంకాలేదు. కాని నాకెంతో దగ్గరగా ఉండటం మూలాన్ని మీరు ఊపిరి పీల్చడం నేను బాగా గ్రహించాను- అచ్చు ఆనాడు నేను మీగదిలో ఉన్నప్పుడు పీల్చినట్టుగానే. సోఫా చేతిమీద మీసుకుమార హస్తాన్ని ఆన్చి కూర్చున్నారు. మనిద్దరి మధ్య ముఖమల్ తెర వ్రేలాడుతోంది. ముందుకి వంగి మీ హస్తాన్ని- ఒకసారి ఇంతకుముందు దాని సజీవ స్పర్శ నెరిగిన కారణంగా, దాన్ని చుంబించాలనే వాంఛ తీవ్రమవుతోంది. సంగీతం స్థాయి హెచ్చుతున్న కొద్దీ నావాంఛ అత్యధిక మవుతోంది. నా అధరాలు మీ హస్తాన్ని సమీపించకుండా బలవంతాన ఉద్రేకాన్ని అణుచుకున్నాను. ఆట యింకా సగమైనా కాకుండానే నా స్నేహితునితో నాకు వెళ్ళిపోవాలని ఉందన్నాను. ఆ విధంగా అంధకారంలో మిమ్మల్ని అంత సమీపంలో పెట్టుకుని అంత అపరిచితంగా కూర్చోవటం దుర్భరమనిపించింది.

కాని ఆ ఘడియ మరోసారి వచ్చింది- మరొక్కసారి మాత్రమే. అంతా చేసి ఒక ఏడాది అవుతుందేమో ఇప్పటికి- సరిగ్గా మీ పుట్టినరోజైన మర్నాడు. మీ గురించి ఆలోచనలు మామూలుగాకన్న అధికంగా నా మెదడును చుట్టుముట్టాయి. మీ జన్మదినాన్ని నేను మహోత్సవంగా పరిగణించేదాన్ని. ఆరోజు ఉదయాన్నే లేచి స్వయంగా బజారుకి వెళ్ళి తెల్లని గులాబీ పూలగుత్తుల్ని కొని, మీరేనాడో మరిచిపోయిన ఆ ఘడియ జ్ఞాపకార్థం వాటిని మీకు పంపించాను. మధ్యాహ్నం నా కొడుకుని తీసుకొని హోటలుకి వెళ్ళి వాడికి కావలసిన ఫలహారాలన్నీ తినిపించాను. సాయంకాలం వాణ్ని సినిమాకి తీసికెళ్లాను. జీవితాంతంవరకూ ఈ రోజునెంతో పవిత్రంగా ఎంచుకోమని వాడితో చెప్పాను. కారణం వాడు తెలుసుకోలేక పోయాడు. ఆ మర్నాడు, ఆ రోజుల్లో నాతో ఎంతో చనువుగా మెలుగుతున్న ఒక స్నేహితునితో కలిసి కాలక్షేపం చేశాను. అతను యువకుడు- ఒక పెద్ద ఫ్యాక్టరీ యజమానికొడుకు. నేనంటే పిచ్చెత్తిపోయేవాడు. అతను కూడా నన్ను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. నేను నిరాకరించాను- ఎందుచేతనో అతను అర్థం చేసుకోలేకపోయాడు. అయినా నాకూ నా కొడుక్కీ బోలెడు బహుమతులూ, అవీ ఇవీ ఇస్తూండేవాడు. అంత వెర్రిగా దాసుడులా ఆరాధిస్తూంటే, పాపం, చూస్తే జాలేసేది. ఒక సంగీత సభకి వెళ్లాం ఇద్దరం కలిసి. అక్కడ కొంతమంది భలే సరదాగా ఉండేవాళ్లు కలిశారు. అందరం కలిసి మళ్ళీ ఆరాత్రి ఒక పెద్ద హోటలులో భోజనం చేద్దామని వెళ్లాం. అందరం సరదాగా నవ్వుతూ హాయిగా కబుర్లు చెప్పుకుంటున్నాం. సాధారణంగా అంత గందరగోళంగా

ఉండి నానారకాలవాళ్లూ వచ్చి కళ్ళు పెద్దవిచేసుకొని ఆడవాళ్లకేసి చూసేరకం మనుషులున్న చోటికి నాకు వెళ్లబుద్ధి పుట్టదు. కాని ఈ రోజున ఎందుకో సరదాగా నలుగురితో కలిసి కాలక్షేపం చెయ్యాలనిపించింది. ఏదో అసాధారణమైన అనుభవం నాకు కలుగబోతోందన్నట్లుగా ఏదో అదృశ్య శక్తి నాలో ఉద్రేకాన్ని కలిగించింది. ఉత్సాహంతో ఏవేవో మాట్లాడుతూ అందరినీ కడుపు చెక్కలయేట్టు నవ్విస్తున్నాను. ఇంతలో హఠాత్తుగా నా హృదయంలో హిమవర్షం కురిసినట్లో, అగ్నిజ్వాలలు రేగినట్లో అయింది- అంతా ఒక్కక్షణంలో. మాకెదురుగా మరో బల్లముందు స్నేహితులతో కలిసి మీరు కూర్చున్నారు. ఆసక్తి, ప్రసంసలతో కూడిన చూపుతో నన్ను దీక్షగా గమనిస్తున్నారు- ఆ చూపే నన్ను అనునిత్యం ఎంత సమ్మోహ పరుస్తుందో- అది వర్ణనాతీతం. పది దీర్ఘ సంవత్సరాల అనంతరం మళ్ళీ మీరు స్వభావసిద్ధమైన ఆంతరంగిక వాంఛాప్రేరితంగా నావైపు చూస్తున్నారు. నేను కంపించిపోయాను. నా చేతులు విపరీతంగా వణికిపోయాయి. అదృష్టవశాత్తూ నా స్నేహితులు నా పరిస్థితిని గమనించలేదు. వాళ్ల కబుర్లు, నవ్వుల గందరగోళంలో మరో విషయాన్ని వాళ్లు పట్టించుకోవటం లేదు. అంతకంతకు మీ వీక్షణం తీక్షణమై నా శరీరాన్ని నా స్వాధీనంలో లేకుండా చేసింది. ఆఖరికి ఇప్పటికైనా మీరు నన్ను గుర్తించారో లేదో గ్రహించలేకపోయాను. ఆ చూపు మీరు నన్ను గుర్తించిన ఫలితమో, లేక ఒక అపరిచిత రగుల్కొల్పిన కామవాంఛా ప్రేరితమో అర్థం కాలేదు. నా చెక్కిళ్లు ఎరుపెక్కాయి. ఒక్కవరసని అర్థంబర్థం లేకుండా వాగటం మొదలుపెట్టాను. మీచూపు నాపైన ఎట్టి ప్రభావాన్ని కలిగించిందో మీరు గమనించకుండా ఉండలేక పోయారు. ఆ పక్క గదిలోకి రమ్మన్నట్లుగా తమాషాగా ఎవరికీ తెలియకుండా మీ తల ఆడించారు. మీ స్నేహితులకో నమస్కారం పెట్టేసి, వెళ్ళిపోతూ వొకసారి మళ్ళీ నావైపు చూసి అక్కడ గదిలో వేచివుంటాను, రమ్మన్నట్లు సంజ్ఞ చేశారు. చలిజ్వరం కుదిపినట్లుగా నాతల ఊపేశాను. వాళ్లేదో అడుగుతూంటే నేను సమాధానం చెప్పలేకపోయాను. నా నరాల్లోని ఉద్రిక్తతను ఇంకెంతమాత్రం అణచుకోలేకపోయాను. ఇంతలో తెల్లని గజ్జెల గుర్రాల్లాటి ఇద్దరు స్త్రీలు ఇద్దరు మగవాళ్లను వెంటబెట్టుకొని అక్కడికొచ్చారు పకపకలిస్తూ. అందరూ మెడలు వెనక్కి తిప్పి ఆ స్త్రీలవైపు దృష్టి సారించారు. ఆ అవకాశాన్ని అందుకొని నేను వెంటనే లేచి, నా స్నేహితురాలితో, ఇప్పుడే రెండు నిముషాల్లో వచ్చేస్తానని చెప్పి మిమ్మల్ని అనుసరించాను.

మీరు వరండాలో నాకోసం చూస్తూ నిల్చున్నారు. నన్ను చూడగానే మీ ముఖం వికసించింది. పెదవులపైన చిరునవ్వు ప్రదర్శిస్తూ నన్ను సమీపించారు ఆత్రుతగా. ఆనాటి చిన్నపిల్లగాని, సిగ్గుపడుతూ మీగదికి వచ్చిన కన్నెపిల్లగాని, మీకు జ్ఞప్తికి రానేలేదు. మళ్ళీ నేను మీకు నూతన పరిచితనే.

"ఓ గంటసేపు నాతో గడపటానికి వీలుంటుందా?" అని అడిగారు విశ్వాస పూరిత కంఠంతో. ఒకరాత్రికి ఎవరికైనా సరే అమ్ముడుపోయే బాపతుగా నా గురించి మీరు భావించారని స్పష్టంగా తెలుస్తోంది. "ఓ, తప్పకుండా" అన్నాను నేను. నా చిన్నతనంలో పదేళ్ల క్రితం ఆ చీకటి సందులో మీరు విన్నట్లుగానే ఇప్పుడు కూడా 'ఓ...' అని వెంటనే అన్నాను. "అయితే ఎప్పుడు కలుసుకుందామో చెప్పు" అన్నారు మీరు. "మీ ఇష్టం వచ్చినప్పుడు" అని సమాధానమిచ్చాను. మీకు సంబంధించిన వ్యవహారంలో సిగ్గుపడవలసిన అగత్యం నాకు కనిపించలేదు. ఆశ్చర్యంగా చూశారు నాకేసి- ఇదివరకులాగే అనుమానమూ, ఆసక్తితో కూడిన ఆశ్చర్యమది. ఓ క్షణం సంకోచించి, "అయితే ఇప్పుడు వస్తావా?" అని అడిగారు. "ఊ" అన్నాను. "సరే, పద," అంటూ దారితీశారు మీరు.

నాకప్పుడు గుర్తుకొచ్చింది- నా శాలువ నేను కూర్చున్న చోటులో విడిచి వచ్చేశానన్న సంగతి. ఇప్పుడు వెళ్లి దాన్ని తెచ్చుకోవాలంటే ఆ స్నేహితుడు ఎక్కడికి వెడుతున్నావని అడుగుతాడు. ఏమని చెప్పటం? ఏం చెయ్యటం? అక్కడికి తిరిగి వెళ్ళి అతనితోచెప్పి శాలువ తెచ్చుకురావటం అసంభవం. అయితే, మీతో ఓ గంటసేపు గడిపే అవకాశం కోసం ఇన్నేళ్లు ఎదురుచూసి, చివరికి దాన్ని జారవిడుచుకోవటం అంతకన్న అసాధ్యం. తక్షణం ఒక నిర్ణయానికొచ్చాను.

చేతిలోని ముఖమల్ సంచీని ఊపుకుంటూ ఆ నిశీధిలో మీ వెంట నడిచాను. నా కాశ్మీర్ శాలువ గురించి గాని, రెండేళ్ల నుంచి నన్ను చేరదీసి ఆదరిస్తున్న ఆ దయామయుడి గురించిగాని, ఒక అపరిచితుని కనుసైగకు లొంగిపోయి ఆ మనిషిని నలుగురు స్నేహితులలోనూ నవ్వులపాలు చేస్తున్నాననిగాని కించిత్తు లెక్కచెయ్యలేదు. అంతమంచి స్నేహితునిపట్ల ఎంత కృతఘ్నతతో, ఎంత నీచంగా ప్రవర్తిస్తున్నానో నా మనస్సుకి బాగా తెలుసు. నేను చేస్తున్న ఘోరమయిన అపరాధం అతన్నీ నన్నూ ఇక శాశ్వతంగా వేరుచేస్తుందనీ, నా బ్రతుకుతో నేనే పరిహాసమాడుతున్నాననీ నాకు

తెలును. మన తాత్కాలిక సంయోగంముందర, అతని స్నేహమెంత, నాజీవితమెంత! మీ అధరామృతాన్ని ఆస్వాదించి, మీ కంఠస్వరాన్ని ఆలకించే అదృష్టం నాకు మళ్ళీ కలిగింది. ఇప్పుడదంతా అయిపోయింది కాబట్టి, నేను మిమ్మల్ని ఎంత ప్రేమించానో ఇప్పుడు చెప్పగలను. నేను నా మరణశయ్యమీద ఉండగా మీ పిలుపు వినిపించినా, మీకు బదులు పలకటానికి ఎలాగో ఓపిక తెచ్చుకుంటాననే నా నమ్మకం.

వీధిలో అద్దెకారు సిద్ధంగా ఉంది. అందులో కూర్చుని మీ ఇంటికి బయలు దేరాం. మీ కంఠస్వరాన్ని మళ్ళీ ఆలకించగలిగాను; మీ సామీప్యత వల్ల కలిగే సంభ్రమాన్ని మళ్ళీ పొందగలిగాను; ఏనాటి క్రితమో ఉన్నట్లుగానే సంతోషంతో ఉబ్బితబ్బిబ్బై నా శరీరం మత్తెక్కినట్లనిపించింది. ఆ మేడమెట్లమీంచి మీతో కలిసి ఎక్కుతూంటే పదేళ్లక్రితం పొందిన ఆనందాన్నే తిరిగి సరికొత్తగా ఎలా పొందగలిగానో, గతంలోనూ ప్రస్తుతంలోనూ ఒకేసారి నేనెలా జీవించానో, నా సర్వస్వమూ మీలోఎలా ఐక్యమైపోయిందో నేనేమని వర్ణించను? మీగదుల్లో అట్టేమార్పులు రాలేదు. గోడలమీద మరికొన్ని చిత్రాలుచేరాయి. బీరువాల్లో పుస్తకాలు కిక్కిరిసిపోయాయి. సామానుకూడా కొంత పెరిగింది- కాని, మొత్తంమీద ఆ ప్రదేశమంతా చిరపరిచితంగా, చనువుగా కనిపించింది. ఆ రాతబల్ల మీద నీలం గాజుకూజా- అందులో గులాబీలు- మీకేనాడూ జ్ఞప్తికి రాని... మీ కత్యంత సమీపంలో, మీ బాహుబంధంలో, మీ అధర స్పర్శననుభవిస్తున్నప్పటికీ జ్ఞప్తికిరాని ఒక ఆడది పంపిన పువ్వులవి. ఏమయినప్పటికీ, నా పువ్వులు అక్కడ ఉండటం నాకు సంతృప్తికరంగా ఉంది. నాప్రేమ చిహ్నం, నాకు చెందినదేదో ఒకటి మీ ఆదరణను పొందగలిగినందుకు సంతోషించాను.

మీరు నన్ను మీ బాహువులతో బంధించారు. అద్భుతమైన ఆ రాత్రంతా మీ వద్దనే ఉండిపోయాను. అప్పటికికూడా నన్ను మీరు గుర్తించనేలేదు. ఒక వేశ్యపైనా, ప్రియురాలిపైనా మీరు చూపే అనురక్తిలో భేదమేమీ ఉండదని స్పష్టంగా తెలిసింది నాకు- అనురాగభరితమైన మీ చేష్టలకు పరవశత్వం పొందుతున్నప్పుడు. మీ దృష్టికి నేను అపరిచితనైనప్పటికీ, ఏదో యథాలాపంగా ఓ హోటల్లో కనిపించి వెంటపడినప్పటికీ, నాతో మీరెంతో ఆప్యాయంగా, మర్యాదగా ప్రవర్తించారు. నన్ను చులకనగా ఎంతమాత్రం చూడలేదు. వినూత్న ఉత్సాహంతో పరవశత్వం పొందినట్లు కనిపించారు. గత సుఖాలమైకంలో మీ ద్వంద్వముఖ స్వభావం గుర్తుకొచ్చింది...

విజ్ఞాన దీప్తి, కామాంధకారం- ఈ రెండు విరుద్ధశక్తుల విచిత్ర సమ్మేళనమే నా శైశవంలో నన్ను మీ బానిసగా చేసింది. క్షణికానందం కోసం మరే పురుషునికీ ఈవిధంగా నా సర్వస్వాన్నీ ధారపోయలేదు. తాత్కాలిక సౌఖ్యంలో ఇంకే పురుషుడూ మీకు మల్లే మనస్ఫూర్తిగా తన్నుతాను సమర్పించేసుకోడు. కాని విచిత్రం- ఆ ఘడియకాగానే అనంత, అమానుష విస్మృతిలో మునిగిపోతారు! అయితే, ఆ సమయంలో నేనూ నా సర్వాన్నీ మరిచిపోయాను. అంధకారంలో మీ పక్కనే పవళించిన నేనెవరిని? మీ కొడుకుని కన్న తల్లినా? ఒక అపరిచితనా? అద్భుతమైన ఆరాత్రి, ప్రతీదీ చిరపరిచితంగానూ, వినూత్నంగానూ గోచరించింది. ఈ ఆనందం అనంతంగా ఉండిపోవాలని ప్రార్థించాను.

కాని తెల్లవారింది. మనం లేచేటప్పటికి బాగా ప్రొద్దుపోయింది- కాఫీ అదీ తీసుకున్నాక వెళ్లొచ్చులెమ్మన్నారు నాతో. కాఫీ వగైరాలను ఏదో అదృశ్యహస్తం ప్రత్యేకంగా పక్కగదిలో సిద్ధంచేసి పెట్టింది. నెమ్మదిగా మాట్లాడుకున్నాం. ఇదివరకు లాగే మీరు మర్యాదగా మనస్సువిప్పి మాట్లాడారు... ఇదివరకులాగ చమత్కారంగా ప్రశ్నించలేదు. నా గురించి కుతూహలం చూపలేదు. నాపేరుగాని ఊరుగాని ఏమిటని అడగలేదు. మీకు నేనుమట్టుకు మామూలుగా ఒక అనామక స్త్రీని- ఇదొక అనుకోని పరిచయం- ఆనందదాయకమైన అనుభవం- అదికాగానే, మీ మనస్సులో దాని జాడలేమీ మిగలవు. అప్పుడే చెప్పారు మీరు- ఆనాడు మీ ప్రయాణం ఉందనీ, ఉత్తరహిందూస్థానం వెళ్లవలసి ఉందనీ అన్నారు. ఆ సుఖ సమయంలో మీ మాటలు ఆభిక మంత్రాల్లా వినిపించాయి నాకు. "అయిపోయింది, అయిపోయింది... అంతా గతించిపోయింది"... మీ పాదాలపైన పడిపోయి "నన్నూ మీతో తీసుకుపోండి... ఇప్పటికైనా స్వీకరించండి" అని హృదయవారా ఏడవాలని అనిపించింది. కాని సిగ్గు, పిరికితనం, బానిసత్వం, నీరసం నన్ను ఆవహించాయి. "అయ్యో!" అని మాత్రం అనగలిగాను చప్పుగా. మీరు చిరునవ్వుతో నాకేసి చూస్తూ "ఏం నిజంగా అంత బాధగా ఉందా?" అని అడిగారు.

ఒక క్షణంపాటు కొయ్యబారి పోయినట్టయ్యాను. నిశ్చలంగా నిలబడి మీకేసి సూటిగా చూశాను. "నేను ప్రేమించిన మనిషి ఎప్పుడూ ప్రయాణం చేస్తూనే ఉంటాడు." అన్నాను, మీ కళ్లల్లోకి సూటిగా చూస్తూ. "ఇంక... ఇప్పుడు... మీరు నన్ను అనవాలు

పట్టేస్తారు!" అనుకున్నాను ఉత్సాహంగా. మీరు ఓ చిరునవ్వు నవ్వారంతే. నన్ను ఓదార్చడానికి "వెళ్ళిన వాడెప్పటికైనా తిరిగివస్తాడు" అన్నారు. "అవును, తిరిగివస్తారు... కాని ఆ వచ్చేలోపునే గతాన్నంతా మరిచిపోతారు."

ఎంతో బాధతో ఆ మాటలనివుంటాను- నా కంఠం గద్గదమవటం మీరు గమనించారు. కుర్చీలోంచి లేచారు మీరుకూడా. నా వైపు ఆశ్చర్యంగా, జాలిగా చూశారు. నా భుజాలమీద మీ చేతులాన్చి, "మంచి వాటినెప్పుడూ మరిచిపోరు... నిన్ను మరిచిపోను" అన్నారు. నా రూపాన్ని మీ మనస్సులో చిత్రించుకోవటాని కన్నట్లుగా మీ కళ్ళు నన్ను దీక్షగా పరిశీలించాయి. నా ఆపాదమస్తకమూ పరిశీలించే మీ తీక్షణ వీక్షణాన్ని చూసి, ఈ నాటికైనా చివరికి మీ కళ్లముందున్న చీకటితెర చీలిపోతుందని భ్రమించాను. "నన్ను గుర్తుపడతారు! నన్ను గుర్తుపడతారు"! ఆశతో నా అంతరాత్మ తహతహ లాడింది.

కాని మీరు నన్ను గుర్తుపట్టనేలేదు... లేదు... మీరు గుర్తుపట్టలేదు. ఆ క్షణంలో మీకంటికి నేనుకనిపించినంత అపరిచితంగా అంతకు ముందెప్పుడూ కనిపించ లేదనే చెప్పాలి- లేకపోతే, కొద్దిక్షణాల తర్వాత మీ ప్రవర్తన అవిధంగా ఉండేది కాదు- మీరు నన్ను మళ్ళీ ముద్దు పెట్టుకున్నారు- గట్టిగా ముద్దుపెట్టుకున్నారు. నా జుట్టంతా రేగిపోయింది- మళ్ళీ దువ్వుకోవలసి వచ్చింది. అద్దం ఎదుటనిలబడి అందులో చూసుకున్నాను- చూస్తుండగా ఘోరమైన అవమానంతో క్రుంగిపోయాను- మీరు రహస్యంగా బల్లమీద ఉన్న నా చేతినంచీ తీసుకుని అందులో రూపాయినోట్లు కుక్కేస్తున్నారు. ఎంతోకష్టంమీద వస్తున్న ఏడుపును ఆపుకున్నాను; ఎంతో కష్టం మీద మీ చెంప పగలకొట్టాలన్న ఉద్రేకాన్ని అణచుకున్నాను. చిన్నతనంనుంచీ మిమ్మల్ని ప్రేమిస్తూ, మీ కొడుకుని కన్నతల్లినైన నేను, మీతో గడిపిన రాత్రికి నాకు మీరు డబ్బు ముట్టచెబుతున్నారు. ఏదో హోటల్లో తటస్థపడిన ఓ వేశ్యననే మీ ఉద్దేశం. మీరు నన్ను మరిచిపోవటంచాలక నాకు డబ్బు చెల్లిస్తూ నన్ను అవమానిస్తున్నారు.

వీలైనంత త్వరగా అక్కణ్నించి తప్పించుకోవాలని గబగబా జడ అల్లేసుకుని జోళ్లు తొడిగేసుకున్నాను. ఆ బాధ దుర్భరంగా ఉంది. హేండ్ బేగ్ కోసం చూశాను. అది మీ రాతబల్లమీదనే ఉంది- ఆ గులాబీ పువ్వులున్న పూలకూజా ప్రక్కని.

ఆఖరు సారిగా మరొక్కసారి మీ జ్ఞాపకాన్ని మేల్కొల్పాలనే కోరికను అణచుకోలేక, "మీ తెల్ల గులాబీపువ్వుల్లో ఒకటి నాకిస్తారా?" అని అడిగాను. "నిరభ్యంతరంగా!" అన్నారు ఆ కూజాలో ఉన్న పువ్వులన్నింటినీ తీస్తూ.

"బహుశా వాటిని ఏ స్త్రీ అయినా... మిమ్మల్ని ప్రేమిస్తున్న ఏ స్త్రీ అయినా మీకోసం పంపిందేమో?" "కావచ్చు... నాకు తెలియదు" అని జవాబిచ్చారు మీరు. కాస్సేపాగి, "అవి బహుమానంగానే వచ్చాయి... కాని వాటిని పంపించినవారెవరో నాకు తెలియదు... అందుకే అవంటే నాకెంతో యిష్టం" అన్నారు. మీవైపు భావ గర్భితంగా చూస్తూ "బహుశా వాటిని పంపిన స్త్రీని మీరు మరిచిపోయారేమో!" అన్నాను.

మీరు ఆశ్చర్యపోయారు. మరింత శ్రద్ధగా చూశాను మీకేసి. "గుర్తించండి... నేటికైనా నన్ను గుర్తించండి... చాలు" అని నా కళ్లు మొరపెట్టుకుంటున్నాయి. మీ చిరునవ్వులో జిజ్ఞాసేగాని జ్ఞాపకం లేదు. మళ్ళీ ముద్దుపెట్టుకున్నారు నన్ను, కాని నేను జ్ఞాపకం రాలేదు.

నేను హడావిడిగా బయలుదేరాను. నా కళ్లనిండా నీళ్లు నిండాయి- మీరు గమనించటం నాకిష్టంలేదు. గుమ్మంలో అడుగుపెడుతూండగా మీ నౌకరు, రంగన్న ఎదురుపడ్డాడు. సంకోచిస్తూ, వినయంగా నా దారిలోంచి తప్పుకుని పక్కగా నిలబడ్డాడు. ఆ పలాయన సమయంలోనే కన్నీటితో అతని ముఖాన్ని చూశాను. ఆ ముసలివాడి ముఖంలో యేదో మెరుపు చటుక్కున మెరిసింది. ఈ పలాయన సమయంలోనే, అతను నన్ను గుర్తుపట్టాడు. నా చిన్నతనంలో నేనాయింట్లో ఉండే రోజుల్లో చూశాడంతే- ఇప్పటివరకూ మళ్ళీ చూడలేదు. అయినా అతను గుర్తుపట్టాడు. నా హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది... వంగి అతని పాదాలముందు ప్రణమిల్లా లనిపించింది. మీరు నా సంచీలో పెట్టి నన్ను బాధించిన మీ రూపాయల్ని పైకి తీసి అతని చేతుల్లో కుక్కేశాను. తెల్లబోయి చూశాడు నాకేసి. ఆ ఒక్కక్షణంలో అతను నన్ను అర్థం చేసుకున్నంతగా మీరు మీ జీవితమంతటిలో నన్ను అర్థం చేసుకోలేకపోయారు. ప్రతివాళ్లూ నన్ను ఆదరించటానికి ఆత్రుత పడ్డారు. కావలసినంత అభిమానాన్ని చూపించారు. కాని మీరే, మీ ఒక్కరే నన్ను విస్మరించారు. మీరే, మీ ఒక్కరే నన్ను గుర్తించలేదు.

నా కొడుకు, మన కొడుకు చనిపోయాడు. నా ప్రేమపాత్రులెవ్వరూ లేరింక... మీరు మినహా నాకీ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. అయితే, మీ వల్ల ఒరిగేదేమిటి? ఇంతవరకు మీరు నన్ను గుర్తించనేలేదు. ఓ పిల్లకాలువని దాటుకొని వెళ్ళిపోయినట్లు, దారిలో అడ్డొచ్చిన రాయిని తప్పించుకుపోయినట్లు నన్ను లెక్క చెయ్యకుండా మీదారిని మీరు వెళ్ళిపోయారు- నేను మాత్రం మీ కొరకు అనంతంగా నిరీక్షించాలి! ఒకప్పుడు అనుకున్నాను మిమ్మల్ని నా స్వాధీనం చేసుకోగలనని. మీరు తప్పించుకుపోయినా, మీ ప్రతిరూపాన్ని- పసిపాపని స్వాధీనం చేసుకున్నాననుకున్నాను. కాని వాడు మీకొడుకే! అర్ధరాత్రి, దయాదాక్షిణ్యాలు లేకుండా దారిలో నన్నొంటరిగా వదిలేసి తను చల్లగా జారుకున్నాడు. వాడు నన్ను మరిచిపోయాడు- వాడింక తిరిగి రాడు. మళ్ళీ ఒంటరిదాన్నైపోయాను- మరీ ఒంటరిదాన్నైపోయాను. నాకేమీ లేదు, మీవల్ల నాకేమీ రాదు. ఒక బిడ్డగాని, ఒక మాటగాని, ఒక ఉత్తరం ముక్కగాని... చివరికి మీ జ్ఞాపకానికి కూడా నోచుకోలేదు. ఎవరైనా నా గురించి మీ ఎదుట సంభాషిస్తే, ఒక అపరిచిత గురించేననుకుంటారు మీరు. మీదృష్టిలో నేను గతించిపోయినప్పుడు, నేను చనిపోవడానికి సంతోషించనూ? మీరు నానుంచి దూరంగా తొలగిపోయినప్పుడు, నేను తొలగిపోవడానికి సంతోషించనూ?

మిమ్మల్ని నేను నిందించటం లేదండీ. మీ సుఖజీవితంలోకి నా కష్టాలను ప్రవేశపెట్టడం నాకిష్టంలేదు. ఇకముందెప్పుడైనా మిమ్మల్ని బాధపెడతానని భయపడకండి. ఈ ఒక్కసారైనా, నా ఒక్కగాని ఒక్క బిడ్డ చనిపోయిన ఈ ఘోర సమయంలోనైనా హృదయవారా మీ ఎదుట ఏడవాలనే వాంఛను తీర్చుకోనివ్వండి. ఈ ఒక్కసారే మీతో చెప్పుకుంటాను. ఆ తరవాత అంధకారంలోకి వెళ్లిపోయి, వెనకటిలాగే మూగదాన్నైపోతాను. నేను బ్రతికున్నంతకాలం నా రోదనం మీకు వినిపించదు. నేను చనిపోయిన తరువాత - మిమ్మల్ని ఇంకెవ్వరూ ప్రేమించనంత గాఢంగా ప్రేమించి, మీరు గుర్తించకపోయినా, మీ పిలుపుకోసం జీవితాంతం నిరీక్షించి, చివరికి తీరని కోరికతోనే చనిపోయిన వ్యక్తివల్ల మీరు పొందే ఆస్తి ఇదే, బహుశా... బహుశా... దీన్ని అందుకొన్న తరువాత నాకోసం కబురు పంపుతారేమో. అయితే, అప్పుడు మొట్టమొదటిసారిగా మీకు ద్రోహం చేస్తాను- ఎంచేతనంటే, మృత్యు నిద్రలో మీ పిలుపు వినలేనుకదా. నా చిత్రాన్నిగాని, మరే చిహ్నాన్నిగాని మీకోసం వదిలివెళ్లను. మీరు నాకోసం ఏమిటి వదిలిపెట్టారు? మీరు నన్నేనాడూ గుర్తించనేలేదు. నా

జీవితంలో నా విధి అలా ఉంది. మరణంలోకూడా నా విధి అలాగే ఉంది. నా ఆఖరుఘడియల్లో మీకోసం కబురుపెట్టను. నాపేరుగాని, రూపురేఖలుగాని మీకు తెలియజేయకుండానే నా దారిని నేను పోతాను. దూరంగా ఉండి మీరు బాధపడటం లేదు కాబట్టి నాకు మరణించటం సులభసాధ్యమవుతుంది. నా మరణం మీకు బాధ కలిగించే పక్షంలో నేనెలా మరణించగలను?

నేనింకేమీ రాయలేను. నా తల బరువెక్కిపోతోంది. చేతులూ కాళ్ళూ సలుపుతున్నాయి. జ్వరం వచ్చినట్లుగా ఉంది. బహుశః త్వరలోనే అంతా అయిపోవచ్చు. బహుశా ఈ ఒక్కసారీ విధి నా కనుకూలంగా ఉంటుందనుకుంటాను. నా కొడుకుని వాళ్ళొచ్చి తీసుకుపోతుంటే చూడనక్కర్లేకుండానే... నేనింకేమీ రాయలేను... సెలవు... ఇంక సెలవు తీసుకుంటాను... మీకు నా ధన్యవాదాలు... ఏదెలాఉన్నా అంతా బాగానే జరిగిపోయింది... నా అంతిమక్షణాల్లో కూడా మీకు కృతజ్ఞురాలినై ఉంటాను. మీకు అంతా చెప్పగలిగినందుకు సంతోషంగా ఉంది... ఇప్పటికైనా, మీరు నన్ను పరిపూర్ణంగా అర్థం చేసుకోలేక పోయినా, నేను మిమ్మల్ని ఎంత ప్రేమించానో మీరు తెలుసుకోగలుగుతారు. నా ప్రేమ మీకెప్పుడూ భారం కాదు. మిమ్మల్ని ఏవిధంగానూ ఆటంకపరచలేదనే నా తృప్తి. ఇక ముందుకూడా దివ్యమైన మీ సుఖజీవితంలో ఏవిధమైన మార్పూరాదు. నా మరణం మీకు హాని కలిగించదు. అదే నా సంతృప్తి.

కాని, ఇంకెవరు. అయ్యో, ఇంకెవరు పంపిస్తారు మీకు మీ పుట్టిన రోజు నాడు ఆ తెల్లగులాబీ పువ్వుల్ని? ఆ గాజుకూజా ఖాళీగానే ఉండిపోతుంది. ఇక నా జీవిత పరిమళం ఏడాదికొకసారైనా మీ వసతిలో ప్రసరించదు. నాదొక్కటే మనవి- తుది, మొదలు అదే. నాకోసం చెయ్యండి... మీ ప్రతి "పుట్టినరోజు" నాడూ- ఎవరి గుర్రించి వారే ఆలోచించుకునే రోజున- క్వానిని గులాబీ పువ్వుల్ని తెచ్చి ఆ గాజుకూజాలో పెట్టండి- ఏడాదికొక్కసారి మరణించిన బంధువుల జ్ఞాపకార్థం ఆబ్దికం జరిపినట్లు, చేయండి. నాకు దేవుడిలో నమ్మకం ఏనాడోపోయింది. అంచేత నా ఆబ్దికం జరపమని అనటం లేదు. నాకు మీ పట్ల విశ్వాసం. మిమ్మల్ని తప్ప మరొకర్ని ప్రేమించను. ఏడాదికొకసారి మాత్రం మీలో మౌనంగా, హాయిగా- ఇంతకు ముందు మీ సమీపంలో నిత్యం జీవించినట్లు- జీవించాలనే నాకాంక్ష... ఆ పనిమాత్రం చెయ్యండి... దయచేసి చెయ్యండి... నా మొదటి కోరికా, తుది కోరికా అదే... సెలవు,

సెలవు... ప్రేమతో... ప్రేమతో... సెలవు...

కొయ్యబారి పోయిన అతని చేతుల్లోంచి ఆ లేఖ జారి క్రిందపడిపోయింది. దీర్ఘంగా, తీవ్రంగా ఆలోచించాడు. అవును, ఆ ఎదురింటివాళ్ల పిల్ల, ఆ అమ్మాయి, హోటల్లో కనిపించిన ఆ యువతి- అంతా మసకగా, అయోమయంగా, వడిగా ప్రవహిస్తున్న సెలయేరులో కొట్టుకుపోయే వస్తువులా మిణుకు మిణుకు మంటూ అస్పష్టంగా ఉంది.. వివిధ ఛాయలు అతని మనస్సులో ఒకదాన్ని మరొకటి తరుముకొన్తున్నాయి- కాని అవన్నీ ఐక్యమై స్పష్టమైన చిత్రం కావటం లేదు. అవన్నీ మనస్సులో మేల్కొన్న అనేక జ్ఞాపకాలు- కానీ జ్ఞాపకం రావటం లేదు. ఈ బొమ్మలన్నిటి గురించీ తను కలగన్నట్టుగా ఉందతనికి... తరచుగా స్పష్టంగా వచ్చే కలలు- అన్నీ కలలో ఊహాచిత్రాలే. అతని కళ్లు ఆ గదిలోఉన్న తన రాతబల్లమీది గాజుకూజా వైపుకి తిరిగాయి. అది ఖాళీగానే ఉంది. కొన్నేళ్లపాటు తన పుట్టినరోజునాడు అది ఖాళీగా లేదు. అతను జలదరించాడు. ఏదో అదృశ్యకవాటం హఠాత్తుగా తెరుచుకున్నట్లు, పరలోకం నుంచి వచ్చిన శీతలవాయువొకటి ఆ కవాటంగుండా తన సురక్షితమైన గదిలోకి వీచినట్లు, తోచిందతనికి. మృత్యుసందేశమూ, అమర ప్రేమ సందేశమూ అతనికి చేరాయి. అగోచరమూ, ఆకర్షణీయమూ అయిన ఏదో సుదూర సంగీతరవంలా ఆ మృతస్త్రీ భావన అతని మనస్సును కలచివేసింది.

# అశ్విని

ఇరవైతొమ్మిది సంవత్సరాలు నిండిన 'మన్ని' హైదరాబాదు నగరానికి దగ్గరలోనే ఉన్న బంజారాకొండల వెనక ఓ పల్లెల్లో చిన్నపూరి గుడిసెలో పుట్టింది. 'నా' అన్న వాళ్లెవ్వరూ లేరామెకు. పెద్దదయ్యాక పనిమనిషిగా పనిచెయ్యడం మొదలు పెట్టింది. కళ్లు లోతుకి పీక్కుపోయి, ఎముకలు పైకి పొడుచుకొచ్చే బక్కగుర్రంలా, దళసరి పెదవులూ, సంస్కారం లేక నిగనిగ లాడని నల్లని దేహం, కాంతిలేని లోతుకళ్లు, అన్నిటికన్నా ముఖ్యంగా నుదుటిమీదికి దువ్విన ఆ గరుకు జుట్టూ- ఆమె అవయవాలన్నింటిలోనూ ఏవో అశ్వచ్ఛాయలు గోచరిస్తూ ఉంటాయి. ఆమె వైఖరి కూడా అంతే- నిటారుగా, ఠీవిగా ఉంటుంది. ఎండనక, వాననక, ఇసుకపుంతల్లో, రాళ్ళ గుట్టల్లో బరువైన సామాను వీపున మోసుకుపోయే అడగుర్రంలా శ్రమిస్తుంది. కాస్త తీరిక దొరకగానే మోటుగా ఒళ్లు విరుచుకుని, ఎముకల్లాంటి వేళ్లు ముడుచుకుని ఓమూల కూర్చుని కునికిపాట్లు పడుతుంది. రోజంతా శ్రమించి పశువులశాలలో ఓపిగ్గా నిలబడి విశ్రాంతి తీసుకునే గుర్రాల్కి మించిన విజ్ఞాని కాదామె. మోటుగా, కఠినంగా, బలిష్ఠంగా ఉంటుంది. ఆమె ఆలోచనలు మందంగా ఉంటాయి. ఏదైనా నూతనభావం ఆమెలో ప్రవేశించాలంటే సప్త సముద్రాలనూ దాటినంత అవస్థ పడవలసి ఉంటుంది. ఇక ఆ బుర్రలో ఏదన్నా ప్రవేశించిందా అంటే, దాన్ని జలగలా పట్టుకుంటుంది. ఆమె చదువుకోలేదు. ప్రపంచంలోని ప్రతి స్వల్ప విషయం మీదా అనేక ఉద్గ్రంథాలున్నాయనే సంగతి ఆమెకు తెలియదు. రాయటం అనలే తెలియదు. నేర్చుకోవాలనే ధ్యాసకూడా లేదు. ఆమెలో స్త్రీ సహజమైన మృదుత్వం లవలేశమైనా కనిపించదు. ఆమె ఎముకలు, నుదురు, పిరుదులు, మోచేతులూ - అన్నిటికీ మల్లేనే ఆమె కంఠంకూడా కర్కశంగా ఉంటుంది. లంబాడీ భాష శ్రావ్యమైనదే అయినప్పటికీ ఆమె మాట్లాడుతుంటే మాత్రం తుప్పు పట్టిన ఇనుపతలుపులు కిర్రుమన్నట్లు ఉంటుంది. అయితే ఆ కిర్రు శబ్దం శ్రోతలనాట్టే బాధించదు. ఆమె

అనవసరంగా ఒక్కముక్క మాట్లాడదు. ఆమె నవ్వుతూండగా ఎవరూ చూడలేదు. ఈవిషయంలో ఆమె చతుష్పాదులతో సమానమే. మనసులోని ఉద్రేకాన్ని హాయిగా ఖులాసాగా వ్యక్తం చెయ్యగల నవ్వుకే నోచుకోని ఆమె, మాటామంతీ లేని ఆ మూగ మృగాలకన్నా నికృష్టం! దిక్కులేనిదవటంవల్ల చిన్నతనంలో నలుగురి పంచల్లోనూ ముష్టెత్తుకుని బతికింది. పది పన్నెండేళ్ళు రాగానే అక్కడున్న భవనాల్లో ఒక దాంట్లో పనిమనిషిగా కుదిరింది. భవనమంతా రోజూ ఊడవటం, సామానుమీద దుమ్ము దులపటం, తోటలో మొక్కలకు నీళ్ళు పోయటం, అంట్లు తోమటం, అందరికీ నీళ్లుకాచి తోడివ్వటం, బట్టలుతకటం, ఆరవెయ్యటం- ఇలా రాత్రి పొద్దుపోయేవరకూ ఏదో పని ఒళ్లొంచి గొడ్డులా చాకిరీ చేస్తూనే ఉండేది. ఏనాడూ విశ్రాంతి కోరలేదు. ఏనాడూ వీధి ముఖం చూడలేదు.

మగవాళ్ల వల్ల ఆమెకే బాధాలేదు. దీనికి కారణం, పది పన్నేండేళ్ళపాటు గొడ్డులా బతికి ప్రకృతి సిద్ధమైన స్త్రీత్వాన్ని రూపురేఖలు లేకుండా చేసినందువల్ల కావచ్చు... ఆమె భయంకరస్వరూపాన్ని చూసి ఆమెతో చనువు తీసుకోవటానికెవ్వరూ సాహసించలేదు. డబ్బు కూడబెట్టటం ఒక్కటే ఆమెకిష్టం. వృద్ధాప్యం వచ్చాక మళ్ళీ నలుగురి దగ్గరా ముష్టెత్తుకుని బతకాల్సి వస్తుందేమోనని ఆమె భయం. "దేహి" అనాలంటే నాలుక తెగ్గోసుకోవాలనిపిస్తుందామెకు.

ఇంకా యింకా పోగు చెయ్యాలనే ఆకాంక్షే ఆమెను పుట్టి పెరిగిన ఆ బంజారా కొండల నుంచి దూరం చేసింది. ఆ ఇంటికి ఒకసారి చుట్టపుచూపుగా వచ్చిన ఒక బంధువు, విపరీతమైన శ్రద్ధతో ఒళ్లొంచి పని చేసే మన్నిని చూసి, ఆ పనికి నగరంలోనే అయితే అంతకు రెట్టింపు డబ్బు దొరుకుతుందని చెప్పింది మాటవరసకి.

బస్సులో ప్రయాణం చేస్తున్నంతసేపూ మన్ని మామూలు ప్రకారం ముభావంగానే ఉంది. ఆమెకున్న ఆస్తినంతా దాచుకున్న ఆ పేముబుట్టని ఒళ్లోపెట్టుకునే కూర్చుంది - దాని బరువుకి కాళ్లు నెప్పులు పెడుతున్నానరే. ఆ బస్సులో కూర్చున్న వాళ్ళలో కొందరు సుహృద్భావంతో, ఆ బుట్టని సీటుకింద పెట్టుకోమని సలహా చెప్పారు. కాని ఆ మోటు మనిషి ససేమిరా వల్లకాదంది. తను వెడుతూన్న మహాపట్నంలో దొంగతనం, మోసం తప్ప మరొకటుండదని ఆ అడవి మనిషి నమ్మకం.

హైదరాబాదు చేరుకున్నాక చాలా రోజులికి గాని ఒక్కర్తీ బజారుకీ దానికీ వెళ్లటానికి సాహసించలేదు. వీధుల్లో అంతమంది వచ్చేపోయే జనాన్నీ, బళ్ళనూ, కార్లనూ, ఆ రద్దీనీ చూసేసరికి హడలిపోయేది పాపం. క్రమంగా, ఆ నాలుగురోడ్లు కలిసేచోటూ, తన మార్కెట్టు వీధీ జ్ఞాపకం పెట్టుకుని ఒంటరిగా స్వతంత్రంగా వెళ్ళటం, వచ్చేటప్పుడు కూరలూ అవీ కొనుక్కుని బుట్ట భుజానికి తగిలించుకు రావటం నేర్చుకుంది. ఇదివరకు లాగే ఈ కొత్త ఇంట్లో కూడా ఇల్లు ఊడవటం, అంట్లు తోమటం, నిప్పుచేసి నీళ్ళు కాచటం మొదలైన పనులన్నీ చేస్తోంది. బంజారా అలవాటు ప్రకారం రాత్రి పదిగంటలు కాగానే ఓమూల చాపవేసుకుని నోరు తెరుచుకుని గొడ్డులా పడుకునేది తెల్లవారే వరకూ. ఈ నూతన పరిసరాలూ పరిస్థితులూ ఆమెకు నచ్చాయో లేదో ఎవరూ చెప్పలేరు. బహుశా ఆమెకే తెలిసి ఉండదు. ఏదైనా పని చెబితే 'సరే' అని ఒక్కముక్కలో సమాధానం చెప్పేది. ఎప్పుడైనా కాస్త తీరిక ఉన్నప్పుడు బుర్రకూడా ఊపేది. తన తోటీ పనిమనుషుల్ని లెక్కచేసేదికాదు. తన్ను వేళాకోళం చేసినా, ఏడిపించటానికి చూసినా కించిత్తు చలించేది కాదు. ఒక్కసారే కాబోలు- పట్నవాసపు తర్ఫీదు పొందిన చలాకీ పనిపిల్ల ఒకర్తె ఆ లంబాడీ భాషను అస్తమానూ అనుకరించటం, ఆక్షేపించటం మొదలెట్టింది. మన్ని చూసింది, చూసింది. ఇక సహించలేక, వెర్రి కోపంతో పొయ్యిలో మండుతూన్న కొరకంచు తీసి ఆ భీకర ఆయుధాన్ని చేతపట్టుకుని, తన్ను పీడిస్తున్న ఆ పిశాచిపైకి లంఘించింది. ఆపని పిల్ల కెవ్వున కేక పెట్టి ఒకటే పరుగు. అప్పటినుంచీ ఇంకెవ్వరూ మన్ని జోలికి పోలేదు.

ప్రతి శనివారం పొద్దున్నే, అరచేతులంతంత అద్దాలు కుట్టిన రంగురంగుల చారల ముతక పరికిణీ కట్టుకుని, శిరోజాలకు ఆభరణాలు తగిలించుకుని, చేతినిండా గాజులు తొడుక్కుని, అద్దాలు కుట్టిన మరో బట్ట నెత్తిమీద కప్పుకుని దేవుడి గుడికి వెళ్లేది.

ఒక్కరోజునేలావుంది. సెలవు దొరికేసరికి హైదరాబాదు నగరంలో సంచారం ప్రారంభించింది. బస్సులో ఎక్కలేదు. దారీ తెన్నూ తెలియకుండా నడిచి నడిచి చివరికి హుస్సేన్‌సాగర్ ఒడ్డుకు చేరుకుంది. చిరకాల మిత్రుణ్ణి చూసినట్లు ఆ స్రవంతి కేసి కాస్సేపు గుడ్లప్పగించి చూసింది. ఇక నడక ముందుకి సాగలేదు.

వచ్చిన దోవనే ప్రత్యేకంగా మెయిన్‌రోడ్లను తప్పించుకుంటూ సందుల వెంబడి వడి వడిగా నడిచి వెళ్ళిపోయింది. ఈ ప్రథమ ప్రయాణం ఆమెకేమీ నచ్చిఉండదు. ఎందుకంటే, ఈవిధంగా మళ్ళీ ఎప్పుడూ ప్రయత్నించలేదు. శనివారాల్లో వీధుల్లో తిరగడంకన్నా ఏదో కుట్టుకోవడమో, లేకుంటే కిటికీలో కూర్చుని కాలక్షేపం చెయ్యటమో ఆమెకి మెరుగనిపించేది. ఈ మహాపట్టణాని కొచ్చినంత మాత్రాన ఆమె యాంత్రిక జీవనంలో వచ్చిన మార్పేమీలేదు. ప్రతీ నెలాఖరున మాత్రం, శుష్కించి పోయిన ఆమె మొరటు చేతుల్లో ఒకటి బదులు మూడు పదిరూపాయల నోట్లు మెదిలేవి. ఎవరూ చూడకుండా రహస్యంగా సరిచూసుకునేది వాటిని. ఒక్కొక్క నోటునీ విడివిడిగా మడతపెట్టి సాపుచేసి మిగిలిన పాతనోట్లతో కలిపి, తన ఊరి నుంచి తెచ్చుకున్న తన చిన్న దేవదారు చెక్కపెట్టెలో దాచుకునేది. ఆ కోశాగారంలోనే ఆమె తన జీవితంలోని అంతరాంతర లక్ష్యాన్ని భద్రపరచుకుంది. రాత్రిళ్లు తాళంచెవి తలకింద పెట్టుకు పడుకుంటుంది. పగలంతా దాన్నెక్కడ పెడుతుందో ఇంట్లో ఎవ్వరికీ తెలియదు.

ఇటువంటి విపరీత లక్షణాలు కల ఆ మనిషి ('మనిషి' అనే అనాలికదా మరి, మానవ లక్షణాలు ఆమెలో శూన్యమైనప్పటికికీ) మామూలు స్త్రీయే అయినట్లయితే, ఆ యువతి, గౌరీనాథ్ ఇంట్లో పనిమనిషిగా అట్టేకాలం నిలవలేకపోయేది. ఆ ఇంట్లో ప్రతినిత్యం గొడవలే. ఒక్క పనిమనిషికూడా పట్టుమని పదిరోజులపాటు నిలవలేదా వాతావరణంలో. ఆ ఇంటి యజమానురాలి చివాట్లూ, తిట్లూ వాళ్ళు భరించలేరు. ఆ ఇల్లాలు ఓ లక్షాధికారి ఏకైక పుత్రిక. అందుకే గౌరీనాథ్ ఆమెను చేపట్టాడు! అతనికున్న ఆస్తి అంతా అందమే. మనిషి ఆజానుబాహు. చక్కని ముక్కుతీరు, చురుకుగా చాలాకీగా ఉంటాడు. పీకెదాకా అప్పుల్లో మునిగిపోయినా అతనికి చీమకుట్టినట్లయినా అనిపించదు. డబ్బు ధారాళంగా ఖర్చు పెట్టేరకం. మొదటి నుంచీ ఆమె తల్లితండ్రులకి అతని వ్యవహారం ఏమీ నచ్చలేదు. తమతో సరితూగగల సంబంధాన్ని తెస్తామన్నారు. కాని ఆమె ఒప్పుకోలేదు, అతని అందచందాలకు దాసోహమంది. వివాహానంతరంకూడా అతను తన ఖర్చులను అదుపులో పెట్టుకోలేదు. ఆ ఖర్చు పెట్టటంలో ఒకరు సలహా చెబితే వినేరకం కాదతను. ఎంత డబ్బున్నా తన పుట్టింటిలోకి మల్లే సంస్కారపక్షంగా ఓ ఇల్లూ వాకిలీ అంటూ చూసుకోవటం ఆమె కిష్టం. 'ఈ సంస్కారపక్షం' అనేమాట వింటే అతనికి తలకాయనొప్పి. అతని దంతా జమీందారీ పద్ధతి. అతన్ని అదుపులో పెట్టాలని ఆమె ఇనప్పెట్టె తాళాలు

మొల్లో దోపుకునేది. ఆమె ఇంటిపెత్తనం, ఆమె కంచు కంఠం భరించలేకపోయాడతను. ఆమె "పిసినికొట్టు తనాని"కి ప్రాయశ్చిత్తంగా, ఆమెను భార్యగా పరిగణించటమే మానేశాడు. అతని ప్రవర్తన ఆమెకు దుర్భరమైన ఆశాభంగాన్ని కలిగించింది. ఆమె ఏదన్నా చెబుతూంటే మనస్ఫూర్తిగా మర్యాదగా వినేవాడు. ఆ 'తద్దినం' పూర్తి కాగానే సిగరెట్టు పొగవొదిలేసినట్లు ఆమె చెప్పిన ముక్కల్ని గాలి కొదిలేసి, యథాప్రకారం తన పనులు ప్రారంభించేవాడు. ముఖాముఖీ కలహించే దానికన్న యీ ముఖప్రీతి కబుర్లే మరింత దుర్భరం. పైకి కనిపించే అతని సత్ప్రవర్తన ఆమెను నిరాధారంగా చెయ్యటంతో, ఆమెలో అణగిఉన్న క్రోథమంతా ఇతర మార్గాల్లో పైకి పొంగుకొచ్చేది. అందుకే ఆ నౌకర్లమీద కారణం ఉన్నా, లేకపోయినా విరుచుకు పడటం! ఈ గడచిన రెండేళ్లలోనూ నౌకర్లు అథమం పదిసారులైనా మారిఉంటారు. ఓసారి విపరీతమైన కోపంలో ఒళ్లు తెలియక చెయ్యి చేసుకునేనరికి గల్లంతు జరగబోయింది. కొంత డబ్బు ముట్టచెప్పి సర్దేనుకోబట్టి సరిపోయింది, అప్రతిష్ఠ రాకుండా.

తుఫానులా వచ్చే ఆవిడ కోపతాపాలకు తట్టుకోగలిగిన పని మనిషి 'మన్ని' ఒకత్తే. ఆవిడ ఉగ్రస్వరూపందాల్చి విజృంభిస్తూంటే జట్కాబండికి కట్టిన గుర్రంలా ఆ తుఫానులో నిశ్చలంగా నిలవగలిగింది. కలహాలు చెలరేగినప్పుడు ఎవరి పక్షమూ వహించేది కాదు. నౌకర్లు అంత తరుచుగా మారుతున్నా పట్టించుకునేది కాదు. నౌకర్ల పేర్లూ రూపాలూ మారిన సంగతి కూడా గుర్తించేది కాదు. తోటి నౌకర్లతో పాటు ఎప్పుడైనా కులాసాగా కాలక్షేపం చేస్తేగదా, మార్పులు గమనించటానికి! ధన్నుమని తలుపులు బద్దలు కొట్టడం, యజమానురాలు వెర్రికోపంతో వేసే పొలికేకలూ, అరుపులూ - వేటినీ ఆమె లెక్క చెయ్యలేదు. తన వంటపని, తన కూరలు తెచ్చుకోవటం, తన బట్టలుతకటం- తన పనులేవో తను చేసుకోవటం మినహా మరో వ్యాపకమే లేదామెకు. తన చుట్టుపక్కల ఏం జరుగుతోందో ఏమీ పట్టించుకోదు. బండలాగ మొద్దుబారిపోయి మొండిగా రోజులు గడిపేది. రెండు సంవత్సరాలపాటు మహాపట్నంలో జీవించినప్పటికీ, ఆమె మనస్తత్వంలో రవ్వంత మార్పుకూడా రాలేదు. ఆమెకు సంబంధించిన భౌతిక విషయాల్లో ఒక్కటే మార్పు- శ్రీ దేవదారు చెక్కపెట్టెలో పదిరూపాయల నోట్లు ఒక అంగుళం ఎత్తువరకి పెరిగాయి. రెండవ సంవత్సరం పూర్తి కాగానే వాటన్నిటినీ మళ్లీ లెక్కపెట్టుకుంది. ఆమె వాంఛిస్తున్న గమ్యానికి చేరువలోనే ఉన్నట్లు గ్రహించింది... ఆమె కళ్లముందు ఆ విచిత్రసంఖ్య- "వెయ్యి

రూపాయలు" మెరిసింది.

కాని అదృష్టం అంతటా ఒక్కలా ఉండదు. అప్పుడప్పుడు విధి వక్రగతిలో, కఠినశిల ప్రకృతినికూడా విచిత్రంగా మారుస్తూ ఉంటుంది. మన్నిలో వచ్చిన మార్పుకి కారణం, ఆమె స్వభావానికి మల్లేనే అపురూపమైనది!

ప్రభుత్వం కొత్త జనాభా లెక్కల్ని చూడటం ప్రారంభించింది. ప్రతి ఇంట్లో ప్రతి మనిషి పూర్తి వివరాలనూ సేకరిస్తున్నారు. గౌరినాథ్‌కి తెలుసు తన ఇంట్లో ఉన్న నౌకర్లందరికీ చదవటం రాయటం రాదన్న సంగతి. వారి వివరాలన్నీ రాసే బాధ్యత అతనే వహించాడు. నౌకర్లందరినీ ఒక్కొక్కరి చొప్పునా పిలిచి అన్నీ కనుక్కున్నాడు. చివరకి 'మన్ని'ని కూడా గదిలోకి పిలిపించాడు. ఆమె పూర్తి పేరు, వయస్సు, జన్మస్థలం అడిగాడు. వాటిలో మొదటిది, ఆఖరుది వినేసరికి అతనిలో అనుకోకుండా కుతూహలం కలిగింది. అతను కాలేజీలో చదువుకుంటున్న రోజుల్లో అతని స్నేహితుని ఆహ్వానం పైన ఒకసారి బంజారా కొండల వెనకనున్న పల్లెకి వెళ్ళాడు. ఆ స్నేహితుని ఇంట్లోనే మన్ని ఆరోజుల్లో పనిచేస్తూ ఉండేది. అప్పటికింకా మన్ని చిన్నదే. అయినా పనులన్నీ శ్రద్ధగా చక్కగా చేస్తుందని ఆ ఇంట్లో వాళ్లంతా మెచ్చుకోవటం విన్నాడు గౌరినాథ్. అది గుర్తుకొచ్చిన మీదటే యజమానికీ పనిమనిషికీ మధ్య సంభాషణ సాగింది. మరోసంగతి కూడా గుర్తుకొచ్చిందతనికి. వాళ్లింట్లో దుప్పి మాంసంతో వండిన కూర, భోజనంలో వడ్డించారు. దానిరుచి అమోఘంగా ఉంది. మళ్లీ ఎప్పుడూ అటువంటి పదార్థాన్ని రుచి చూడనే లేదు. ఆ సంగతి గౌరినాథ్ మన్నితో చెప్పాడు. నిజానికి అది అత్యల్ప విషయమైనప్పటికీ, అటువంటివే అప్పుడప్పుడు అమోఘమైన ఫలితాలకు దారితీస్తాయి. ముఖ్యంగా మన్నికి-హైదరాబాదు వచ్చేసిన తరవాత, తను పుట్టి పెరిగిన ఊరు విశేషాలు తెలిసిన మనిషి మొదటిసారిగా కనిపించేసరికి సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోయింది. పైగా గౌరినాథ్ లంబాడీభాషలో మాట్లాడుతూ, మన్నిని వేళాకోళం చేస్తూ, లంబాడీ డ్యాన్సు చెయ్యటం నీకొచ్చునా అని నవ్వుతూ అడిగేసరికి మన్నికి మొట్టమొదటిసారి సిగ్గంటే ఏమిటో తెలిపింది. యజమాని ఆమె సిగ్గుపడుతోందని గ్రహించి, చనువుగా ఆమె మోటువీపు మీద తట్టుతూ "ఇంక నువ్వెళ్ళి పనిచేసుకో, మన్నీ... ఇదుగో... ఆ ఊరి నుంచి వచ్చినందుకు ఈ రెండు రూపాయలూ నీకు ఈనాం, తీసుకో" అన్నాడు.

యజమాని ఏమంత అప్యాయత కనపరచాడని ఆ మోటు మనిషి మనస్సుల చలనం కలిగేందుకు- అనుకోవచ్చు ఎవరైనా కాని, ఆ కొద్దిక్షణాల సంభాషణ ఫలితంగా, నిర్మలమైన నీటిలో రాయి విసిరితే విపరీతంగా శబ్దంచేస్తూ అలలు లేచినట్లు అయింది అచంచలమైన ఆమె మనస్సులో. 'నా' అన్నవాళ్లు లేకుండా అప్యాయత అంటే ఏమిటో అనుభవం లేకుండా ముప్పయి సంవత్సరాలకు పైగా కాలం గడిపిన మీదట, ఇన్నాళ్లకీ ప్రపంచంలో కోట్ల జనాభాలో ఒక్కమనిషి- అందులోనూ ఆమె పుట్టి పెరిగిన ప్రదేశాన్ని ఎరిగిన మనిషి, ఆమె స్వయంగా వండిన మాంసాన్ని ఇష్టంతో తిన్న మనిషి- అప్యాయంగా ఆమెను పలుకరించే సరికి, ఆ అడివి మనిషిలో కలిగిన అనుభూతి వర్ణనాతీతం. దానికి తోడు యజమాని చనువుగా ఆమె వీపుమీద చరిచిన చరుపు, ఆమె అడవి మనస్సులోని స్త్రీమూర్తికి పిలుపులా తోచింది. అందమైన దుస్తుల్లో ఆకర్షణీయంగా ఉన్న ఆ పెద్దమనిషి ఆమె కఠిన దేహాన్ని అపాదమస్తకం అవలోకించాడేమో నన్నంత దూరం మన్ని ఆలోచించకపోయినప్పటికీ, అతను తీసుకున్న చనువు, నిద్రాణమైఉన్న ఆమె శక్తులలో సంచలనం కలిగించినమాట మాత్రం వాస్తవం.

మంచికైనా, చెడుకైనా, జరిగిన సంఘటన ఫలితంగా 'మన్ని' స్వభావంలో ఏదో అవ్యక్తమైన మార్పు రావటం ఆరంభమైంది. ఆరంభంలో అవ్యక్తంగా ఉన్నా, క్రమక్రమంగా ఆ మార్పు స్పష్టమవుతూ, ఒక నూతన పరిణామానికి దారితీసింది. లోకంలో ఒక మనిషికీ, తక్కిన మనుషులకీ గల తారతమ్యాన్ని హఠాత్తుగా గ్రహించిన శునకంలాగ, మన్ని గౌరీనాథ్‌ని తన యజమానిగా, తన దైవంగా పరిగణించటం ప్రారంభించింది. ఆవిధంగా గుర్తించిన శునకం యజమాని అడుగుజాడల్ని అనుసరిస్తుంది. కాసేపు యజమాని ఎక్కడికైనా పోయి వచ్చేసరికి సంతోషంతో ఒగురుస్తూ, స్నేహపూర్వకంగా తోక ఆడిస్తూ అతని పాదాలపైబడి తన మూఢవిశ్వాసాన్ని మూగగా వెల్లడిస్తుంది. ఇంత వరకూ, డబ్బు, వంటపొయ్యి, పడక, దేముడు- లాంటివేవో అరడజను విషయాలకు నిలయమైన మన్ని సంకుచిత మానవ సౌధంలో హఠాత్తుగా ఒక నూతన భావం చోటు కోరింది. అంతేకాకుండా, అంతకు ముందునుంచీ కాపురముంటున్న వాటిని మోటుగా మోచేత్తో అవతలికి నెట్టేసింది. ఇంకా ఇంకా పోగుచెయ్యాలనే ఆకాంక్ష, దేన్నైనా పట్టుకుంటే ఇక విడిచిపెట్టని స్వభావం కల

మన్ని- నిద్రాణశక్తులతో కూడిన తన అయోమయ ప్రపంచంలోకి అత్యంత శ్రద్ధతో ఒక నూతన భావాన్ని ప్రవేశపెట్టింది. అయితే, ఆమె అలవాట్లలో మార్పు సుస్పష్టం కావడానికి కొంత వ్యవధి తీసుకుంది. క్రమంగా, అయ్యగారి పాదరక్షలు శుభ్రపరచటం, దుస్తులు సిద్ధపరచటం ప్రారంభించింది. అమ్మగారికి పరిచర్యలు చేసే బాధ్యత వేరే పనిమనిషికి వదిలేసింది. వీధి తలుపు చప్పుడు కాగానే అయ్యగారొచ్చారేమోనని గాభరాగా సావిట్లోకి పరుగెడుతూంటుంది. వంటింట్లో ఇదివరకు కన్న శ్రద్ధగా కష్టపడి పనిచేస్తోంది. ఒక్కొక్కప్పుడు పెద్దబజారుదాకా ఎండలో నడిచి వెళ్లేది, అయ్యగారికి ఇష్టమైన భోజనపదార్థాలు కొనుక్కురావటానికి. తన దుస్తులను శుభ్రపరచుకోవటం కూడా అలవరచుకుంది.

ఈ నూతన భావాలు మొలకలెత్తటానికి ఒకటి .రెండు వారాలు పట్టింది. భూమిలోంచి రెండోమొలక తలెత్తి, రూపొందటానికింకా కొన్ని వారాలు గడవాల్సి వచ్చింది. ఈ రెండోది మొదటిదాని సహజపరిణామమే. అది- అమ్మగారంటే అసహ్యం- ఎందుకంటే, ఆవిడ అయ్యగారికి అర్ధాంగి కావటం, అనునిత్యం ఆయనతో సంభాషించటం- చనువుగా ప్రవర్తించటం- ఇన్ని చేస్తూ చివరికి ఆయన్ని తనకుమల్లే ఆరాధించకుండా అగౌరవపరచటం, మన్నికి నచ్చలేదు. దీనికి కారణం బహుశా (చుట్టుపక్కల ఏంజరుగుతున్నదో గ్రహించటం నేర్చుకున్నాక) ఒకసారి అమ్మగారు వెర్రికోపంలో ఒళ్ళు తెలియకుండా యజమానిని తిట్టడం విని, మన్ని నిర్ఘాంతపోయింది. అది కాకుండా, యజమాని శాంతస్వభావం, యజమానురాలి పొగరుమోతుతనం ఇరువురికీ ఎంత వ్యత్యాసం ఉందో మన్ని గుర్తించగలిగింది. ఏకారణంవల్ల నైతేనేం, యజమానురాలిపట్ల విముఖత ప్రదర్శించటం ప్రారంభించింది. యజమానురాలు అధమం రెండుసార్లు అరుస్తేనేగాని మన్ని పలకటం లేదు. దానికి తోడు నిర్లక్ష్యంగా, నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తుంది. మన్ని విసుగ్గా భుజాలు ఎత్తినప్పుడు, ఓ మొండి పొగరుబోతు గుర్రం విసురుగా చెవులు వెనక్కి విరుచుకున్నట్లుగా తోస్తుంది. యజమానురాలు ఏదైనాపని చెయ్యమన్నప్పుడు మొద్దులా చలనం లేకుండా నిలబడేది. దాంతో చెప్పినపని అర్థమైందో లేదో, చేస్తుందో లేదో తెలిసేది కాదు. కర్మంచాలక యజమానురాలు ఒకసారి చెప్పినదాన్ని రెట్టించిందా అంటే, మన్ని విసురుగా బుర్రఊపేది. లేకుంటే "వినిపించింది" అనేది కఠినంగా. యజమానురాలికి వచ్చిన ఉత్తరాలను ఆవిడకి వెంటనే అందించేది

కాదు. అందుకు ఆవిడ తిడుతూంటే "మరిచిపోయాను" అని కసిరినట్టు సమాధానం చెప్పేది. తన మనసులోని ద్వేషం ఎక్కడ బయట పడుతుందోనని భయపడుతున్నట్లు యజమానురాలి ముఖంలోకి సూటిగా ఎప్పుడూ చూసేదికాదు.

ఈలోగా ఈ పనిమనుషుల గొడవల మూలాన్ని భార్యాభర్తల మధ్య కలహాలు మరింత ఉధృతమయాయి. ఈ పనిమనిషి మానసికస్థితి, మర్యాదలేకుండా ప్రవర్తించడం, యజమానురాలికి వెర్రికోపం తెప్పిస్తోంది. ఆవిడ ఆగ్రహానికీ, అహంకారానికీ అవధి లేకుండా పోతోంది. అంతకాలం కన్యాత్వం అనుభవించిన మీదట ఆవిడ నరాలబాధ విపరీతమైపోయింది. దానికితోడు భర్త ఆమెను నిర్లక్ష్యం చెయ్యటం, ఆ క్రోధాన్ని అధమం నౌకర్ల మీదనైనా చూపలేకపోవటం, దాంతో అంత కంతకు ఆవిడ పరిస్థితి విషమిస్తూ వచ్చింది. పీడకలలూ, పలవరింతలూ లేకుండా హాయిగా నిద్రపట్టటానికి పుచ్చుకుంటున్న నిద్రమాత్రలతో వ్యవహారం అనలుకే చెడింది. ఈ విషమ మానసిక స్థితిలో ఆమెను చూసి సానుభూతి చూపే వారొక్కరూ లేరు. ఆమెకు కాస్త మనస్తిమితం కలుగజేసి, తన్నుతాను సంభాళించుకోగలిగేటట్లు ఆమెకు సాయపడేవాళ్ళెవరూ లేరు. విదేశాలు వెళ్ళివచ్చిన ఒక డాక్టరు ఆవిణ్ణి పరీక్షించి ఓ రెండునెల్లపాటు ఏదైనా శానిటోరియమ్‌లో ఉన్నట్లయితే మనస్సు కుదుట పడుతుందని సలహా ఇచ్చాడు. ఆ సలహాను గౌరీనాథ్ హృదయపూర్వకంగా బలపరచాడు. అతని ఉత్సాహాన్ని చూసేసరికి ఆవిడకి అనుమానం వేసిససేమిరా వెళ్ళను పొమ్మంది. డాక్టరు శతవిధాల నచ్చచెప్పగా ఆఖరికెలాగో ఒప్పుకుంది. ఆమెతో కూడా ఆమె నౌకరును తీసికెళ్ళటానికీ, గౌరీనాథ్ పరిచర్యలకు మన్నిని ఇంట్లో అట్టిపెట్టటానికీ నిశ్చయమైంది.

తన ఇష్టదైవానికి సేవలుచేసే బాధ్యత పూర్తిగా తన చేతుల్లోకే వచ్చిందన్న వార్త వినగానే మన్ని శరీరమంతటా విద్యుత్ ప్రసరించినట్లయింది. ఏదో విచిత్రశక్తి ఆమెలోని నిద్రాణవాంఛల్ని మేల్కొలిపి, ఆమె ప్రవర్తనలో పరివర్తన తెచ్చినట్లయింది. మన్ని అవయవాలు మునుపటికి మల్లే మొటుగా నీటారుగా లేవు. ఇప్పుడు సులభంగా, తేలిగ్గా, చురుగ్గా పనిచేస్తున్నాయి.

యజమానురాలి ప్రయాణం రోజున మన్ని హడావిడి ఇంతా అంతా కాదు. ఈ గదిలోంచి ఆ గదిలోకీ, ఆ గదిలోంచి యీ గదిలోకీ పరుగెత్తటం, ఎవరూ

చెప్పకుండానే సామానంతా సర్ది వాటిని రైల్వేకూలీలా మోసుకుని క్రిందికి తీసుకొచ్చి కారులో పెట్టటం- మొత్తంమీద తెగ హుషారుగా పని చేసింది.

గౌరీనాథ్ భార్యను రైలెక్కించి, రాత్రి బాగా పొద్దుపోయాక ఇంటి కొచ్చేవరకూ మన్ని కిటికీలో కూర్చుంది ఎదురుచూస్తూ. గౌరీనాథ్ గ్లాసుడు మంచినీళ్ళు గడగడా తాగి, "హమ్మయ్య! ఆవిడగారిని సాగనంపేశాను" అన్నాడు. అప్పుడొక విచిత్ర సంఘటన జరిగింది. మన్నికీ మృగాలకూ తేడా లేదనడం ముఖ్యంగా ఒక విషయంలో - ఎప్పుడూ నవ్వకపోవడం. కాని, ఇప్పుడు హఠాత్తుగా మన్ని అధరాల్లో ప్రకృతివిరుద్ధమైన విచిత్ర సంచలనం కలిగింది. మన్ని నోరు విశాలంగా వికృతంగా తెరుచుకుంది. ఆ పనిమనిషి ముఖంలోని వికృతభావం చూడగానే గౌరీనాథ్ ముఖం వివర్ణమైపోయింది. అటువంటి 'నీచజాతి'కి చెందిన మనిషి దగ్గర అంత చనువుగా ప్రవర్తించినందుకు అవమానంతో కుంచించుకుపోయాడు. మారు మాట్లాడకుండా, తలవంచుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఈ ఆందోళనైనా ఒకటి రెండు క్షణాలపాటే నిలిచింది. ఆ తరవాత రెండుమూడు రోజులపాటు యజమానీ నౌకరూ- ఇద్దరూ కలిసి ఆ అపురూప ప్రశాంత వాతావరణంలో కులాసాగా గడిపారు. భార్య ఇంట్లో లేకపోయేసరికి వాతావరణంలో ఎక్కడలేని ప్రశాంతతా ఆవరించింది. గౌరీనాథ్ ఇప్పుడు బాధ్యతనుండి విముక్తి చెందిన స్వేచ్ఛావిహంగం. తను చేసిన పనులన్నిటికీ సమాధానం చెప్పుకోవలసిన ఆగత్యం లేదిప్పుడు. మర్నాడు రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చాడింటికి. ప్రతివిషయంలో జోక్యం కలుగజేసుకునే తన వదరుబోతు భార్యకు విరుద్ధంగా మన్ని మౌన ఆరాధన గౌరీనాథ్ దృష్టిని ఆకర్షించకపోలేదు. అత్యంత ఆసక్తితో మన్ని తన పనులను శ్రద్ధగా నిర్వహిస్తోంది. మామూలు కన్న పెందరాళే లేవటం, ఇంట్లోని సామానంతా మొహం కనిపించేటంత శుభ్రంగా అద్దంలా ఉండేటట్లు తుడవటం, కంచాలూ, గ్లాసులూ అవీ ఎంత మెరిసేలా తోమినా సంతృప్తి కలగక పోవటం, ఎంతో రుచికరంగా వంటచేయటం- అన్నిటికన్నా ముఖ్యం- గొప్పగొప్ప వాళ్ళని విందుకి పిలిచినప్పుడు ఉపయోగించే ప్లేట్లనూ వాటినీ రోజూ యజమానికోసం ఉపయోగిస్తూంటే గౌరీనాథ్ ఆశ్చర్యపోయాడు. సాధారణంగా అతను అటువంటి విషయాలను పట్టించుకునే రకం కాకపోయినా, ఈ వింతపనిమనిషి చేసే మున్నితమైన విచిత్ర చేష్టలను గమనించకుండా ఉండలేకపోయాడు. నిజానికి మంచి మనస్సు

కలవాడు కాబట్టి తన సంతోషాన్ని వ్యక్తపరచాడు. పాకశాస్త్రంలోనూ, గృహనిర్వహణలోనూ మన్నికి గల ప్రావీణ్యాన్ని అభినందించాడు. రెండుమూడు రోజులు పోయాక, పండగనాడు బాదంహల్వాచేసి ప్లేటులోపెట్టి, దానిమీద నన్నని కొబ్బరికోరు, కుంకుమపువ్వుతో అందంగా ముగ్గులు పెట్టింది. దాన్నిచూసి చిరునవ్వు నవ్వుతూ గౌరీనాథ్, "నన్ను పాడుచేసేస్తున్నావు మన్నీ! మళ్ళీ అమ్మగారు ఇంటికి రాగానే నా గతేంకాను?" అన్నాడు.

ఈవిధంగా శ్రీమంతులు నౌకర్లతో చనువుగా సంభాషించటం అనభ్యంగా అనిపించినా, ఆ చనువులో విలువేమీ ఉండదు. నౌకర్లకు చనువిచ్చినంత మాత్రాన వారిని గౌరవిస్తున్నారని భావం కాదు. యజమాని యజమానే, నౌకరు నౌకరే- వారి అంతస్తులెప్పుడూ ఏకంకావు. నౌకర్లను ఎంతదూరంలో ఉంచాలో యజమానికి తెలుస్తుంది. తన భార్య గురించి ఇంట్లోని పనిమనిషితో చాడీలు చెప్పి తను లోకువయే ఉద్దేశం గౌరీనాథ్ కెప్పుడూ లేదు. అయితే, అనాలోచితంగా అతనన్న మాటలు ఆమె అమాయక హృదయంలో ఎటువంటి ప్రభావాన్ని కలుగజేశాయో అతను గ్రహించలేకపోయాడు.

అయినప్పటికీ, కొన్నాళ్లపాటు నోటికి తాళం వేసుకుని, తన ప్రవర్తనలో తగు జాగ్రత్త వహించాడు. ఆపైన, ఆమెనిక నమ్మవచ్చునన్న ధీమా కలిగిన తరవాత, రాబోయే ప్రమాదకరమైన ఫలితాలను లెక్కచెయ్యకుండా తన బ్రహ్మచారి అలవాట్లను తిరిగి అమలులోకి తెచ్చుకున్నాడు. ఇది తన స్వగృహం. భార్య ఇంట్లో లేదు. ఇహ తను ఇష్టం వచ్చినట్లు ఆనందించవచ్చు. ఓరోజున మన్నిని పిల్చి, తను చెప్పేది ఏమంత ముఖ్యమైన విషయం కాదన్నట్లు, ఏదో యధాలాపంగా చెబుతున్నట్లు, సాయంకాలం మరోమనిషికి కూడా వంటచెయ్యాలనీ, తనకోసం నిరీక్షించకుండా త్వరగా నిద్రపోవచ్చుననీ, వచ్చాక తనే వడ్డించుకు తిని పడుకుంటాననీ చెప్పాడు.

"మంచిది". అంది మన్ని, మొహంలో ఏవిధమైన భావాన్నిగాని, అతని మాటల్లోని అంతర్యాన్ని తెలుసుకున్నట్లుగాని వ్యక్తం చెయ్యకుండా. అయితే, అర్ధరాత్రి వేళ గౌరీనాథ్ ఒక వేశ్యను వెంటబెట్టుకుని వచ్చినప్పుడు, భోజనాల బల్లమీద ఘుమ ఘుమలాడే పువ్వులతో నిండిన గాజుకూజాన్నీ, తన పడక గదిలో అమర్చిన రెండవ మంచాన్నీ చూడగానే, మన్ని చాలా గడుసుదనీ, పైకి కనిపించినంత మూర్ఖురాలు

కాదనీ గ్రహించి నవ్వుకున్నాడు. వైవాహిక సూత్రాలను తేలిగ్గా తోసిపారేసే గౌరీనాథ్, తనకు సేవచేయటంలో మన్ని ఎంతకైనా సాహసించగలదని తెలుసుకుని మనసారా ఆనందించాడు. అప్పటినుంచీ మన్నిపై అతనికి సంపూర్ణ విశ్వాసం కలిగింది. మర్నాడు పొద్దున్నే, తను తెచ్చిన సుకుమారికి సేవచేసేందుకు మన్నిని పిలవటానికి సంకోచించలేదు.

ఈ సందర్భంలోనే మన్నికి మళ్లీ నామకరణం జరిగింది.

ఆ వన్నెలాడి మరోసారి వచ్చినప్పుడు, గదిలో కూర్చుని గౌరీనాథ్‌తో "ఏదీ, మీ "అశ్విని"ని ఓమాటిలా పిలవండి" అంది నవ్వుతూ.

ఆపేరు అతనికి తమాషాగా తోచింది. అయితే అంత మంచి శ్రావ్యమైన పేరు ఈ లంబాడీ మోటుమనిషికి బొత్తిగా నప్పలేదని అనిపించిందతనికి. అయినా అప్పటినుంచీ మన్నిని "అశ్విని" అనే పిలవటం ప్రారంభించాడు. ఈ కొత్త పిలుపు విని మొదట్లో మన్ని నిర్ఘాంతపోయింది. అయినా అది తన యజమాని పెట్టిన పేరు కాబట్టి బహుమానంగా స్వీకరించింది. "అశ్విని" అని పిలవటంలో గల ఆంతర్యం ఏమిటో ఆమెకు అర్థం కాకపోయినా, తన యజమాని తనకో ముద్దుపేరు పెట్టుకున్నాడనుకుని మురిసిపోయింది. యజమాని అనాలోచితంగా "అశ్వినీ!" అని పిలిచినప్పుడల్లా ఆమె దళసరి పెదవులు విడివడి మధ్యనుంచి ఆమె గుర్రపుపళ్ళు కనిపించేవి. ఆ తక్షణం అతను ఆదేశించిన కార్యాన్ని నిర్వహించటానికి త్వరపడేది. ఆపేరు వేళాకోళానికి పెట్టినదే. అందుకే అది ఆమెకు తగినది కాకపోయినా అంత పట్టించుకోనక్కర్లేదు. అయినా, అందులో కూడా ఒక ఉద్దేశం లేకపోలేదు. అసలు "అశ్విని" మిలమిల మెరిసే స్వచ్ఛమైన నక్షత్రం పేరు. అయినా, ఇక్కడ మన్ని లక్షణాలన్నీ అశ్వలక్షణాలు కాబట్టి వెంటనే ఆమెను "అశ్విని" అనాలనిపించింది.

అనురాగం అంటే ఏమిటో అనుభవంలేని ఆ పనిమనిషి, యౌవనంలో ఉన్న తన యజమాని చేసే సాహస కృత్యాలకి గర్వించింది. బహుశా ఆ సంతోషమంతా, ఏమీ ఎరగని తన యజమానురాలి పర్యంకాన్ని ప్రతి రాత్రీ ఒక పతిత అపవిత్రం చేస్తున్నందువల్ల కావచ్చును. ఏళ్ల తరబడి గొడ్డులా చాకిరీ చేసిన మీదట శుష్కించిపోయిన ఆమె శరీరంలో స్త్రీత్వం రూపురేఖల్లేకుండా పోయినా తన యజమానురాలి పరోక్షంలో ఆమె పర్యంకం మూడు రాత్రులు 'అపవిత్రం' కావటం చూడగానే ఆమె

అవయవాల్లో విపరీతమైన సంచలనం కలిగింది. పైగా, యజమానికి తనపై కలిగిన అభిమానం, కల్పించిన వినూత్న వాతావరణం ఆ "అశ్వని"లోని నిద్రాణశక్తుల్ని రెచ్చగొట్టాయి. ఎప్పుడూ అలవాటులేని లక్షణాలన్నీ బయట పడుతున్నాయి. లేనిపోని దుర్బుద్ధులు పుట్టుకొస్తున్నాయి. రహస్యంగా చూడటం, పొంచివినటం, తలుపు దగ్గర వంగి తాళంచెవి పెట్టే రంధ్రంలోంచి తొంగి చూడటం, ఇటూ అటూ వెర్రిగా, కంగారుగా పరుగులెత్తటం, ముని వేళ్ళమీద నడవటం- ఆమె ఆసక్తికి అంతు లేకుండా పోయింది. ఒక మట్టిబొమ్మకి ప్రాణం పోసినంత మార్పు వచ్చింది మన్నిలో. ఎప్పుడూ లేనిది మన్ని నలుగురితో కలిసి మెలిసి మాట్లాడటం మొదలు పెట్టే సరికి చుట్టుపక్కల వాళ్లంతా ఆశ్చర్యపోయారు. పక్కింటి నౌకర్లతో రహస్యాలు చెప్పటం, పోస్టుమేన్‌తో వేళాకోళమాడటం, బజారులో కొట్టువాళ్ళతో అనేక విషయాలు మాట్లాడటం ప్రారంభించింది. ఓరోజు సాయంకాలం వంటింట్లోంచి ఏదో కూనిరాగం వినిపించి చుట్టుపక్కల వాళ్లంతా తెల్లబోయారు. ఎప్పుడూ అటువైపు ఎంతో నిశ్శబ్దంగా ఉంటుంది. బద్ధకంగా, బొంగురు గొంతుతో ఏదో లంబాడీ పాట కూనిరాగం తీసింది మన్ని. అలవాటులేని పెదవులతో, కఠోరమైన కంఠంతో వినేవాళ్లకు వినుగు పుట్టేలా గొణిగింది. చిన్నపిల్లలు ఆకతాయితనంగా హార్మోనియం వాయించినట్లుగా ఉంది మన్ని ఆలాపన. ఏనాడో చిన్నతనంలో పాటలు పాడేది ముస్తైత్తుకుంటూ. అంధకార బంధురమైన గతంలోంచి ఏదో, వెలుగు కోసం బయటపడాలని పరితపిస్తున్నట్లుగా ఉంది.

ఈ అసాధారణమైన మార్పును దానికి నిజంగా కారకుడైన వ్యక్తి గమనించక పోవడం సహజమే - తన నీడనే చూసుకోవటానికెవరు తాపత్రయపడతారు? అయితే, అది శునకంలా మన అడుగు జాడల్లో ఎలా మసులుతుందో, ఒక్కొక్కప్పుడు (మనకి స్పష్టంగా తెలియని) ఆశలాగ మనకంటే ముందుకి పరుగెట్టటం యథాలాపంగా చూస్తూనే వుంటాం. కాని ఆ నీడలో మన ప్రతిరూపాన్నీ, పరిహాసపూరితమైన మన స్వరూపాన్నీ పరిశీలించటానికెవరూ ప్రయత్నించరు. గౌరీనాథ్ గ్రహించినదల్లా- మన్ని ఉత్సాహంతో, శ్రద్ధగా, మౌనంగా, త్యాగబుద్ధితో తనకు సేవ చేస్తోందన్న విషయం ఒక్కటే. ఆమె మౌన ఆరాధన అతనికి నచ్చింది. అప్పుడప్పుడు పెంపుడు కుక్కని ఆప్యాయంగా తట్టినట్లు, ఒకటో రెండు మాటలు చమత్కారంగా అనేవాడు. ఒక్కోసారి ఆమె చెప్పినదానికి నవ్వేవాడు. మెచ్చుకుని రూపాయో అర్ధో బహూకరిస్తూండేవాడు.

ఎప్పుడైనా సినిమా పాస్ ఇస్తే, దాని విలువ అమూల్యంగా తోచేది మన్నికి. జ్ఞాపకార్థం తన బుల్లి పెట్టెలోనే దాచుకునేది వాటిని. క్రమంగా, ఆమె ఎదుట పైకి ఆలోచించటం అలవాటైపోయిందతనికి. పెద్దపెద్ద వ్యవహారాలకు కూడా మన్నినే నియోగించేవాడు. ఆమెలో అతనికి విశ్వాసం పెరుగుతున్నకొద్దీ, మన్ని మరింత భక్తి శ్రద్ధలతో అతనికి సేవ చేస్తోంది. అతనికి కావలసిన వాటిని ముందే ఊహించుకోవటం, అతని వ్యక్తిత్వంలో లీనమై అతని ఇష్టానికి అనుగుణంగా ప్రవర్తించటం, అతని ఆనందమే తన ఆనందమనుకొని, అతని విజయాలకు తను గర్వించేది. రాత్రి ఇంటికొచ్చేటప్పుడు అతనికూడా ఎవరైనా ఆడది ఉంటే ఆనందించేది. ఒంటరిగా రావటం చూసి చిన్న బుచ్చుకునేది. తక్కిన అవయవాలకు మల్లేనే మన్ని తలకాయకూడా ఇప్పుడు చురుకుగా పనిచేస్తోంది. ఆమె కళ్లల్లో ఇప్పుడేదో నూతన కాంతి! చాకిరీకి అలవాటు పడిన ఆ పశువులో ఇప్పుడు మానవత్వం ప్రవేశించింది. అయినా ముభావంగా ఉండే ఆమె స్వభావం, బిగువుగా వుండే పెదవులూ, భయంకరమైన క్రూరమృగ లక్షణాలూ మాత్రం ఇంకా పూర్తిగా మారలేదు.

ఓసారి గౌరీనాథ్ రోజూకన్న పెందరాళే ఇంటికి వచ్చేసరికి ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉండే వంటింట్లోంచి నవ్వులు వినిపించాయి. వంటింటి తలుపు ఓరవాకిలిగా తెరిచి ఉంది. మన్ని నవ్వుతూ మాట్లాడుతున్నదల్లా చటుక్కున సావిట్లో గౌరీనాథ్‌ని చూసి కంగారుపడింది.

"మీరిప్పుడే వస్తారనుకోలేదు" అంది తప్పుచేసిన దానిలా బాధపడుతూ. తలవంచుకుని కాస్సేపు ఊరుకుని "తోటమాలి కూతురు ఇక్కడే ఉంది. చాలా చక్కగా ఉంటుంది. మిమ్మల్ని కలుసుకోవాలని సరదా పడుతోంది" అంది మన్ని.

గౌరీనాథ్ మన్ని ముఖంలోకి తెల్లబోయినట్లు చూశాడు. ఈ పనిమనిషి ప్రవర్తన అంతకంతకు మితి మీరుతుంటే చివాట్లుపెట్టి బుద్ధి చెప్పాలో, లేక వచ్చిన సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలో అర్థంకాలేదు. చివరికి అతనిలోని [illegible] పైచెయ్యి అయింది.

"సరే చూద్దాం, ఆ అందకత్తె ఎవరో"! అన్నాడతను.

మన్ని అంతగా పొగిడిన ఆ అమ్మాయికి పదహారేళ్లకన్న ఎక్కువుండవు. కోలముఖం, చామనచాయ దేహం, సిగ్గుపడుతూ తిప్పుకుంటూ వయ్యారమంతా ఆ

రసికుని ముందు వలకబోస్తూ వంటింట్లోంచి సావిట్లోకొచ్చింది. ఇదివరకు ఆ పిల్లని దూరం నుంచి చాలాసార్లు చూశాడు గౌరీనాథ్. ఆ అమ్మాయి మునిమునినవ్వులు చూస్తే గౌరీనాథ్‌కి ముచ్చటేసింది. రెండు కప్పులు టీ పట్టుకు రమ్మన్నాడు తనగదిలోకి. ఏమంటుందోనని ఆ పిల్ల మన్నికేసి తిరిగింది. కాని మన్ని అక్కడ లేదు! ఆ పిల్లకి అర్థంకాని కుతూహలంతో, సంభ్రమంతో (అసలే సిగ్గుతో కంగారుతో బుగ్గలు కందిపోయాయ్) అతని ఆహ్వానాన్ని అంగీకరించటంకన్న గత్యంతరం తోచలేదు. "నా ప్రాంగణంలో ప్రవేశించవూ?'' అంది సాలీడు ఈగతో!

ప్రకృతి ఎప్పుడూ కుప్పిగంతులు వెయ్యదు. విపరీతమైన ఉద్రిక్తత ఫలితంగా ఆ అస్థిపంజరంలో ఆంతరంగికంగా సంచలనం కలిగినప్పటికీ, ఈ నూతన పరిమిత భావనాశక్తి మన్ని కి దూరదృష్టిని మాత్రం కలుగజెయ్యలేక పోయింది. సంకుచిత దృష్టితో సంచరించే సాధారణ జంతువులకు మల్లేనే మన్నికి కూడా దూరాలోచన సాధ్యం కాలేదు. శునకంలాగ అత్యంత విశ్వాసంతో, తన యజమానికి సేవచెయ్యాలనే తృష్ణతో ఆమె తక్కిన విషయాలన్నిటినీ- ముఖ్యంగా యజమానురాలున్నదన్న విషయమే విస్మరించింది. అందువల్లనే, ఓరోజు ప్రొద్దున్నే హఠాత్తుగా ముడిపడిన కనుబొమలతో, చేతిలో ఉత్తరంతో గౌరీనాథ్ వంటింట్లో కొచ్చి మన్నిని పిలిచి, యజమానురాలు ఆ మర్నాడు మధ్యాహ్నం ఊరునుంచి వస్తున్నదనీ, ఇల్లంతా శుభ్రంచేసి అన్నీ సర్ది సిద్ధంగా ఉంచమనీ చెప్పేసరికి అమాంతం ఆకాశంమీంచి పిడుగుపడ్డట్లయింది మన్నికి. ఎవరో హఠాత్తుగా వచ్చి బాకుతో గుండెల్లో పొడిచినట్లుగా నోరు తెరుచుకుని కొయ్యబారి పోయినట్లు నిలబడిపోయింది. యజమానివైపు మూగగా విస్తుబోయి చూసింది. ఆమెను కాస్త తేరుకునేటట్లు చెయ్యాలని.

"నీకు అంత సంతోషంగా ఉన్నట్లులేద్దు అశ్వనీ, అంతకన్న మనం చెయ్యగలిగిందేమీ లేదిప్పుడు" అన్నాడు.

అప్పటికి ఆమె నిర్జీవప్రతిమలో సంచలనం కలిగింది. విశ్చల సమాధిలో మునిగిన మన్నికి మెలుకువ వచ్చినట్లయింది. అంతరంగంలో ఏవో అలలు లేచినట్లయింది. వెలవెలబోయే ఆమె చెక్కిళ్లు కందిపోయాయి. గొంతు పూడిపోయి నట్లయింది. అతి కష్టంమీద గొంతు పెగలించుకుని మాటలు బయటికొచ్చాయి.

"ఎప్పటికైనా... ఎవరికైనా... ఎవరికైనా... తప్పదు..." మళ్లీ గొంతు పూడుకు

పోయింది. వాక్యం పూర్తికానేలేదు. ఆమె ముఖంలో మాత్సర్యం తాండవించింది. అమె ముఖభంగిమలో వ్యక్తమవుతున్న రాక్షసత్వం చూడగానే గౌరీనాథ్ హడలిపోయి రెండడుగులు వెనక్కివేశాడు. నగం నగం చెక్కుతీసిన అరటికాయను చాకుతో విసురుగా ఒక్కవ్రేటు వేయటంలో మన్ని చేతి వేళ్లు ఎగిరిపోతాయేమోనని భయమేసింది.

యజమానురాలి పునరాగమనంతో అంతవరకూ ఆ ఇంట్లో వెల్లివిరిసిన శాంతి సౌఖ్యాలు విచ్ఛిన్నమయిపోయాయి. తలుపులు దబదబ బాదడం, నిష్కారణంగా నౌకర్లనూ వాళ్లనూ తిట్టిపొయ్యడం, అన్నీ పునఃప్రారంభమయాయి. చుట్టుపక్కల వాళ్లంతా గౌరీనాథ్ చర్యల గురించి ఆమె చెవులో ఏమన్నా ఊదారో లేక, తన ఆగమనానికి భర్త అంతగా ఆనందించకపోవడం వల్ల అతని మానసిక స్థితి గ్రహించిందో గాని, మొత్తంమీద ఈ రెండు నెలల విశ్రాంతి ఫలితంగా ఆమెపరిస్థితి మరింత అధ్వాన్నం అయిందేగాని కొంచెమైనా నయం కాలేదు. ఏడుపులూ, పెడబొబ్బలూ, కేకలూ, అరుపులూ మరింత ఎక్కువైపోయాయి. దంపతుల మధ్య ఘర్షణ రోజురోజుకీ దుర్భరమైపోతోంది. కొన్ని వారాల దాకా ఎలాగో ఇదివరకులాగే ఇంట్లో చెలరేగే తుఫానులను లక్ష్యపెట్టకుండా, ఉద్రేకంలో తన భార్య పుట్టింటికి వెళ్ళిపోతాననీ, విడాకులిచ్చేస్తాననీ చీటికీ మాటికీ బెదిరించినా పట్టించుకోకుండానే ముభావంగా ఉంటూవచ్చాడు. ఈ నిర్లక్ష్యభావమే ఆమెలో మరింత ఉన్మాదాన్ని కలిగిస్తుంది. తన చుట్టూ రహస్యంగా శత్రువులు నిరంతరం పరివేష్టించి ఉన్నారని ఆమె దృఢ విశ్వాసం. ఆమె మానసిక దౌర్బల్యం అంతకంతకు ప్రమాదస్థితికి దారితీస్తోంది.

మన్నిమట్టుకు యథాప్రకారంగా స్వరక్షణార్థం మౌనం వహించింది. అయితే, ప్రస్తుతం మన్ని వహించిన మౌనం దురహంకార పూరితంగా, దుర్భేద్యంగా ఉంది. యజమానురాలు ఇంటికి వచ్చినప్పుడు మన్ని వంటింట్లోంచి బయటికి రానేలేదు. సామాను లోపలికి తీసుకురమ్మని కేకవేసినప్పుడు కూడా వంటింట్లోంచి ఊడిపడలేదు. వినమ్రత అనేది లేకుండా వెన్నువిరుచుకుని కొయ్యబొమ్మలా నిలబడి, పొగరుమోతుగా కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్టు సమాధానాలు చెబుతోంది. ఆ సమాధానాలు వింటూ భరించలేక యజమానురాలు చరచరా లోపలికి వెళ్లిపోతోంది. మళ్ళీ మన్ని ముఖం చూడకుండా యజమానురాలు వెనక్కి తిరిగి వెళ్ళిపోతూంటే ఆవిడ అమాయిక విగ్రహాన్ని మన్ని అసహ్యంతో ద్వేషంతో చూస్తుంది. యజమానురాలు తిరిగి వచ్చి,

తన సౌఖ్యాన్నంతా సర్వనాశనం చేసిందనీ, యజమానికి అత్యంత సన్నిహితంగా ఉండి అతనికి సేవచేసే భాగ్యాన్ని కొల్లగొట్టి మళ్ళీ ఆ చీకటికోణంలోకి తన్ను తోసి వేసిందనీ, యజమాని ఆప్యాయంగా తనకు పెట్టిన ముద్దుపేరు "అశ్విని"ని దోచుకుందనీ అనుకుంటోంది మన్ని మాత్సర్యంతో. దానికితోడు యజమాని, భార్య సమక్షంలో మన్నితో సంభాషించేటప్పుడు చనువు తీసుకోకుండానూ, సానుభూతి కనబరచకుండానూ జాగ్రత్తపడుతున్నాడు.

అప్పుడప్పుడు తన భార్యచేసే రభస భరించి భరించి విసిగిపోయి కాస్త హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు వంటింట్లోకి దూరి అక్కడుండే కుర్చీపీటమీద చతికిలబడి రెండు చేతులతో తల పట్టుకుని -

"ఇదెక్కడి కర్మరా బాబూ!" అని గొణుక్కుంటాడు.

తన ఆరాధ్యదైవం ఆవిధంగా తన శరణుజొచ్చి సానుభూతి అపేక్షించిన ఆ కొద్దిక్షణాలే మన్ని జీవితంలో అత్యంత సుఖప్రదమయినవి. ఆ సమయంలో యజమానికి సమాధానం చెప్పటంగాని, ఓదార్చడానికి ప్రయత్నించడంగాని చేసేదికాదు. మాటామంతీ లేకుండా మూగపోయి తనఏకైక దైవాన్ని చూస్తూ హృదయంలోని పరితాపాన్నంతనీ తన చూపుల్లోనే వ్యక్తపరిచేది. ఈ నిశ్శబ్ద సానుభూతే గౌరీనాథ్‌కి కొంత మనశ్శాంతిని కలుగజేసేది. ఆ వంటింట్లోంచి తీరా బయటికి వచ్చేసరికి మళ్ళీ అతని ఆవేదన ఆరంభమయేది. అతను వెళ్లి వెళ్ళగానే మన్ని వంటింట్లో ఉన్న గిన్నెల మీదా, పొయ్యిలో మండుతున్న పుల్లలమీదా మండిపడేది.

యజమానురాలి పునరాగమనంతో మబ్బులు క్రమ్మిన వాతావరణం ఓనాడు పెనుప్రళయంగా పరిణమించింది. ఆ సందర్భంలోనే గౌరీనాథ్ సహనమంతా నశించి పోయింది. ఎప్పటిలా మర్యాదగా నిర్లక్ష్యం వహించి, తిట్లుతింటున్న బడిపిల్ల వాడికి మల్లే తప్పించుకుపోవటానికి బదులు పడకగదిలోంచి విసురుగా బయటికొచ్చేస్తూ తలుపు ధన్నుమని వేసేశాడు ఇంటి కిటికీ తలుపులన్నీ అదిరిపోయేలాగ.

"ప్రాణం విసిగిపోతోంది" అని అతను అరిచిన అరుపు ఇల్లంతటా ప్రతి ధ్వనించింది. గీసిన కంధగడ్డలా అయిపోయిందతని ముఖం. దూకుడుగా వంటింట్లోకి వెళ్ళి, వణికిపోతున్న మన్నితో, "నా సామానంతా సర్దేసి కారులో పెట్టు. కొన్నాళ్ళపాటు ఎక్కడికైనాపోయి ఉంటాను- ఈ పీడకొంపలో పిశాచాలు కూడా నిలవలేవు" అని

ఒళ్లు తెలియకుండా అరిచాడు.

ఆ మాటలు వినగానే మన్ని కళ్లు ఉత్సాహంతో కలకలలాడాయి. యజమాని ఎలా అయితేనేం తన అధికారాన్ని నిలబెట్టుకున్నాడు. ఇంటియజమాని అనిపించుకున్నాడు! వికటాట్టహాసం చేసింది మన్ని.

"నిజమే అయ్యా, ఇప్పటికైనా ఇదంతా అరికట్టాలి," అంది.

వెర్రి ఉత్సాహంతో ఈ గదిలోంచి ఆ గదిలోకీ, ఆ గదిలోంచి ఈ గదిలోకీ తిరుగుతూ యజమాని ప్రయాణానికి కావల్సినవన్నీ సర్దేసింది. ఒక్కొక్కటే తీసికెళ్ళి కారులో పెట్టేసింది. గౌరీనాథ్ కారులో కూర్చుని, ఇంత స్వల్పవ్యవధిలో అంత చాకచక్యంతో అన్నీ సర్దినందుకు తన సంతోషాన్ని వెలిబుచ్చడానికి మన్నివైపు చూశాడు. ఆ క్షణంలో మన్ని ముఖంలోని వైఖరి చూసి తెల్లబోయాడు. ఆమె తుట్ట పెదవులు రెండూ తెరుచుకుని వికృతమందహాసం చేస్తున్నాయి. ఆ విషపు నవ్వే అతన్ని ఎప్పుడూ భయపెడుతూ ఉంటుంది. వేటగాడిమీదికి ఉరకబోయే క్రూరమృగం గుర్తుకొచ్చిందతనికి. అంతలోనే మన్ని మర్యాదగా వెళ్లి చనువుగా మందహాసం చేస్తూ, "అక్కడైనా కులాసాగా గడపండి. ఇక్కడ నేను చూసుకుంటాను" అంటూ మెల్లిగా చెప్పింది.

మూడురోజుల తరవాత, గౌరీనాథ్‌ను తక్షణం ఇంటికి తిరిగి రమ్మని టెలిగ్రాం వచ్చింది. ఆ టెలిగ్రాం ఇచ్చినతను గౌరీనాథ్ దగ్గర బంధువు. స్టేషనులో అతని ముఖాన్ని చూసేసరికే ఏదో ఘోరం జరిగిందని గ్రహించాడు గౌరీనాథ్. ఆ దుర్వార్తను వెల్లడించడానికి కొంతసేపు తికమకపడిన మీదట, గౌరీనాథ్ భార్య ఆకస్మిక మరణాన్ని గురించి వివరించాడు. ఈ మరణం సహజంగా వచ్చింది కాదు. ఉద్దేశ పూర్వకంగానే సంభవించింది. అక్రితం రోజు రాత్రి ఆవిడ నిద్రమాత్రలు ఓడజనుపైగా వేసుకుందిట. భోంచెయ్యగానే ఆమాత్రలసీసాని తెచ్చిపెట్టమని మన్నితో చెప్పిందిట. మాత్రలు వేసుకోవటం తను కళ్లారా చూశానని మన్ని పోలీసులతో చెప్పింది. అంచేత ఇది ఆత్మహత్యేనని పోలీసులు నిర్ణయించారు.

గౌరీనాథ్ హస్తాలు కంపించిపోయాయి. ఆ బంధువు మన్ని ఇచ్చిన సాక్ష్యం గురించి చెప్పగానే అతని ఒళ్లు ఝుల్లుమంది. ఏదో భీకర విషయం అతని మనస్సుకి హఠాత్తుగా తట్టింది. ఆ భీకర భావాన్ని లోలోనే అణచివేసుకుని మౌనంగా అతని

వెంట నడిచాడు గౌరీనాథ్. బంధువులూ స్నేహితులూ అందరూ సావిట్లో అతని కోసం కాచుకుని కూర్చున్నారు. వారు చెప్పిన సానుభూతి పలుకులు సహజంగా లేవు. అతనంటే ఏర్పడిన జుగుప్స వారి ముఖాల్లో ప్రస్ఫుటమవుతోంది. "ఈ ఘోర సత్యాన్ని దాచిపెట్టడం నీతరం కాదు" అంటున్నాయి వారి చూపులు. పొద్దున్నే ఆవిడ శవాన్ని చూడగానే మన్ని వీధి అరుగుమీదికి పరుగెత్తుకొచ్చి అమ్మగారు ప్రాణాలు తీసేసుకున్నారు, కామాలని చచ్చిపోయిందనీ పొలికేకలు వేసి ఇరుగుపొరుగు వాళ్లనందరినీ పిలుచుకొచ్చింది. శవదహనం చల్లగా గడబిడలేకుండా జరిగిపోయింది. నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకుంటూ గౌరీనాథ్‌ని నిందిస్తున్నారు. గౌరీనాథ్ అన్నీ అయోమయంగా వింటున్నాడు. అప్రయత్నంగానే తలపైకెత్తి తను కూర్చున్న సావిట్లోంచి పడకగది వైపు చూశాడు. మళ్లీ తలదించేసుకుని నేలమీదికి చూస్తూ కూర్చున్నాడు. అతన్ని వెంటాడుతున్న ఆ భీకర భావాన్ని గురించి స్పష్టంగా మనసులో తర్కించుకోవాలనుకున్నాడు. కాని ఇంటినిండా జనం- అందరూ తలొక మాటా- కాస్త నిదానంగా ఆలోచించటానికే అవకాశం లేకపోయింది. గంటసేపు అడ్డమైన కబుర్లూచెబుతూ కూర్చున్నారు బంధువులంతా. ఆ తరవాత ఒక్కొక్కరే సెలవు తీసుకుని వెళ్ళిపోవటం మొదలెట్టారు. చీకటి పడేసరికి అంతా వెళ్ళిపోయారు. గౌరీనాథ్ ఒక్కడూ ఒంటరిగా ఆ గదిలో మిగిలిపోయాడు. ఈ ఆకస్మిక సంఘటన తలుచుకుంటే పిడుగు పడ్డట్లైంది. తలపోటు, ఒళ్ళంతా నొప్పులు- నిల్చున్న చోటునుంచి కదలడానికి కూడా ఓపిక లేకపోయింది.

ఎవరో తలుపుతట్టారు. లోపలికి రమ్మన్నాడు గౌరీనాథ్. అతని వెనకాతల ఉన్న తలుపు తెరుచుకుంది. తడబడుతున్న అడుగుల సవ్వడి అతనికి వినిపించింది. ఆ పదధ్వని అతనికి ఆనవాలే. ఒక్కసారిగా హడలిపోయాడు. తన కంఠాన్ని ఎవరో పట్టుకుని నొక్కేస్తున్నట్లుగా, ఊపిరి సలపనట్లుగా బాధపడ్డాడు. ఒళ్ళంతా తేళ్లూ జెర్రులూ పాకుతున్నట్లనిపించింది. వెనక్కి తిరిగి చూడాలనుకున్నాడు. కాని అతని నరాల్లో పట్టులేకపోయింది. ఆవిధంగా గదిమధ్యలో కంపించి పోతున్న దేహంతో గుప్పిళ్ళు బిగించి నిశ్శబ్దంగా నిలబడ్డాడు. ఇలా అసందర్భంగా మౌనం వహించటం ఎంత అసభ్యంగా కనిపిస్తుందో అతనికి తెలియకకాదు. ఇంతలోకే వెనుకనుంచి మామూలుగా, నిర్లక్ష్యంగా వినిపించిందొక కంఠం.

"రాత్రి రొట్టెలు తింటారో లేదో అడుగుదామని వచ్చాను."

గౌరీనాథ్ మరింత తీవ్రంగా కంపించిపోయాడు. గుండెలు బిగపట్టేటంత శైతల్యం ఆవహించిందతన్ని. మూడుసార్లు ప్రయత్నించిన మీదట ఎలాగో చివరికి "అక్కర్లేదు" అనగలిగాడు.

ఆ తడబడుతున్న అడుగులు వెనక్కి వెళ్ళిపోయాయి, అతను ధైర్యంచేసి తిరిగిచూసే లోపునే. అప్పటికి అతనిలో కొస్త చలనం కలిగింది. గాలిలో ఆకులా అల్లలాడి పోయాడు. ఎలాగో శక్తి చేకూర్చుకుని గబగబా తలుపుమూసి లోపలగడియ పెట్టేసుకున్నాడు మళ్లీ ఆ పైశాచిక పాదాలు గదిలో ప్రవేశించకుండా ఉండాలని. వచ్చి సోఫాలో కూలబడిపోయాడు. ఆ భీకర విషయం మళ్ళీ అతని మనస్సులోకి చొరబడటానికి వ్యర్థ ప్రయత్నం చేసింది. ఆ భ్రమ అతనికి రాత్రంతా నిద్రపట్టకుండా చేసింది. ఆ రాత్రేకాదు, ఆనాటినుంచీ అతన్ని వేధిస్తూనే ఉంది. ఏక్షణాన స్టేషనులో మన్ని విషయం విన్నాడో ఆ క్షణం నుంచీ ఆమె పేరు వినటానికే హడలిపోతున్నాడు. ఆమె పద ధ్వని వినిపించేసరికి అక్కడినుంచి పారిపోవాలనిపిస్తోంది. మన్ని మాట వినేసరికి ఒళ్లు జలదరిస్తోంది. ఆమె కరోరమైన కంఠం, మట్టి కొట్టుకుపోయిన జుట్టు, ఆమె నిర్దాక్షిణ్య స్వభావం, క్రూరమృగ లక్షణాలు- ఈ పిశాచిని తన కంటపడ కుండా చేయలేకపోతున్నందుకు అతనికి ఉక్రోషం వస్తోంది. తన కంఠాన్ని పట్టుకు నొక్కేస్తున్న ఆ పైశాచిక హస్తాన్నుంచి విముక్తిచెందడానికి ఒక్కటేమార్గం - ఈ ఇంట్లోంచి విరగడైపోవడమే. రహస్యంగా తన బట్టలూ అవీ పెట్టెలో సర్దేసుకుని చడీచప్పుడు కాకుండా ఆ ఇంట్లోంచి వెళ్ళిపోయాడు.

కాని వారంరోజులు తిరక్కుండానే ఏదో అర్జంటు పనిమీద ఇంటికి రావలసి [illegible]ంది. గుమ్మంలో అడుగు పెడుతూండగానే మన్ని సావిట్లో ఎదురయింది. [illegible] ఆమె చేతికివ్వకుండా తనే మేడమీదికి పట్టుకెళ్ళాడు. ఆమె ముఖంలోకి చూసి [illegible]కరించే సాహసం లేదతనికి.

ఆ మర్నాడు పొద్దున్నే లేచి కాఫీ అయినా తాగకుండా బయటికి వెళ్ళిపోయాడు. మళ్ళీ రాత్రి పొద్దుపోయాక వచ్చి మాట్లాడకుండా వెళ్ళి తన గదిలో తలుపులు వేసుకుని పడుకున్నాడు. ఆమె వండిన పదార్థాలను తినడానికే అతనికి మనసు పుట్టడం లేదు. ఆమె ఊపిరి పీల్చినా అతను బెదిరిపోతున్నాడు.

మన్ని మట్టుకు తిండీతిప్పలు లేకుండా వంటింట్లో ఓమూల ముడుచుకు పడుకుంటోంది రాత్రింబగళ్లు. ఎవరితోనూ ఒక్కముక్క మాట్లాడటం లేదు. తప్పుచేసిన కుక్కలా బాధపడుతూ తన యజమాని పిలుపుకోసం ఎదురుచూస్తోంది. తన తప్పేమిటో తెలుసుకునే తెలివితేటలు కూడా లేవు మన్నికి. ఆమె తెలుసుకున్నదల్లా తన యజమాని- తన దైవం తనకి ముఖం చూపించకుండా తప్పించుకు తిరుగుతున్నాడు- పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు- అన్న విషయం మాత్రమే. మూడురోజుల తరవాత ఒక ముసలిమనిషి ఆ ఇంటికొచ్చాడు. ఆ ఇంట్లో నౌకరుగా ఉండటానికి గౌరీనాథ్ తన్ను రమ్మన్నాడని చెప్పగానే మన్ని ముఖం వెలవెలబోయింది. అంతలోనే తేరుకుని తలుపు ధన్నుమని వేసేసి చరచరా వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఆ ముసలినౌకరు ఆ ఇంట్లో ప్రవేశించాడు. ఇప్పుడు గౌరీనాథ్‌కి మన్నిని పిలవాల్సిన అవసరం లేదు; కొత్త నౌకరు చేతనే అన్నిపనులూ చేయించుకుంటున్నాడు. వంటింటికి అవతల ఏంజరుగుతోందో తెలుసుకోవలసిన ఆగత్యం మన్నికి లేదింక.

ఓనాడు హఠాత్తుగా ఆ నౌకరు గౌరీనాథ్ ఆఫీసుగదిలో ఉండగా వచ్చాడు.

"అయ్యా..." అన్నాడు చేతులునలుపుకుంటూ. ఏమిటన్నట్లు తల పైకెత్తాడు గౌరీనాథ్.

"అయ్యా... చెబితే నన్నో పిచ్చివాడికింద జమకడతారు గాని... ఆ మన్ని అంటే నాకు భయంగా ఉందండి... అది పిశాచం... పెద్దపులి... అదెంత ప్రమాదకరమైన మనిషో అయ్యగారికింకా తెలియదులా ఉందండి..." అన్నాడు నసుగుతూ.

"ఇంతకీ నువ్వనేదేమిటో స్పష్టంకావటం లేదు. నన్నేం చెయ్యమన్నావ్?" అన్నాడు గౌరీనాథ్ ఏంచెప్పాలో అర్థంకాక.

"నాకూ సరిగ్గా చెప్పడం తెలియదండి... కాని దాన్ని చూస్తే మట్టుకు భయంగా ఉందండి... అది వండిన అన్నం తింటానికి భయంగా ఉంది... దాని చూపులు చూస్తే నన్నెప్పుడో అప్పుడు విషంపెట్టి చంపేస్తుందేమో అనిపిస్తోంది. ఈ యింట్లో అదైనా ఉండాలి- నేనైనా ఉండాలి" అన్నాడతను.

ఆ మర్నాడు పొద్దున్నే కాఫీతాగి ఆఫీసుగదిలో బల్లముందు కూర్చున్నాడో లేదో తలుపుతట్టిన చప్పుడైంది. అనాలోచితంగానే హస్తావత్రికే బల్లమీద పెడుతూ

"ఎవరది?" అన్నాడు.

వెంటనే తలుపుతెరుచుకుని, తడబడుతున్న అడుగులతో భారంగా నడుస్తూ అవ్యక్తి- నిద్రలో కూడా అతన్ని పిశాచంలా వెంబడిస్తున్న ఆ మానవాకారం లోపలికి ప్రవేశించింది. ఆమెలో వచ్చిన మార్పుకి విస్తుపోయాడు గౌరీనాథ్. దుష్టశక్తి మూర్తీభవించినట్లు ఉండే ఆమె అస్థిపంజరం ఇప్పుడు మాసిన దుస్తులమధ్య నిర్జీవంగా కనిపిస్తోంది. ఆ నికృష్టస్త్రీ తనదగ్గరికి రావడానికి సాహసించలేక ఆ గుమ్మం దగ్గరే ఆగిపోవటం గమనించగానే అతనిలో జుగుప్సతోబాటు జాలికూడా కలిగింది. తనలోని ఉద్రిక్తతను పైకి కనబరచకుండా సాధ్యమైనంత వరకు ముభావంగానే మాట్లాడాడు.

"ఏం కావాలి మన్నీ?"

ఎంత ప్రయత్నించినా, అతను కంఠంలో కాఠిన్యం, క్రోధం తప్ప కారుణ్యం కనపరచలేక పోయాడు.

మన్ని చలించలేదు. నేలమీద పరచిన తివాసీవైపు శూన్యంగా చూస్తూ నిల్చుంది. కొంతసేపు గడిచాక ఎలాగో, సంకుచిత ద్వారంలోంచి దేన్నో బలవంతాన బయటికి నెట్టుతున్నట్లు మాట్లాడింది "కొత్త... కొత్త నౌకరు మీరు నన్ను వెళ్ళిపొమ్మన్నారని చెబుతున్నాడు."

గౌరీనాథ్ చిరాగ్గా లేచినుంచున్నాడు. పరిస్థితులు ఇంత త్వరగా విషమిస్తాయనుకోలేదు. రంగన్న, మరీదుడుకు మనిషి అంటూ నంగి నంగిగా ఏదో సర్దిచెప్పబోయాడు. ఆ ముసలి వాడిపట్ల కొంచెం మర్యాదగా ప్రవర్తించినట్లయితే ఏ గొడవా ఉండదు. ఇంట్లో ఉన్న నౌకర్లు ఒకరినొకరు ఈసడించుకుంటే ఎలా కుదురుతుంది? అని చెప్పుకు పోతున్నాడు.

ఇదేమీ పట్టించుకోనట్లుగా తివాసీవైపు సూటిగా చూస్తూ వెన్నువిరుచుకుని దృఢంగా నిశ్చలంగా నిల్చుంది మన్ని. ఏమాట కోసం ఆమె ఎదురుచూస్తోందో అది బయటకి రానేలేదు. దుర్భేద్యమైన మౌనం వహించింది.

రెండు మూడు నిముషాలపాటు అవిధంగా అర్థంలేని మౌనం వహించిన తరవాత ఆఖరికి నోరు విప్పింది.

"ఇంతకీ నన్ను వెళ్ళిపొమ్మన్నది అయ్యగారో రంగన్నో తెలుసుకుందామని

వచ్చాను" అంది. నిశ్చలంగా నిశితంగా విసిరిందా మాటలు. అది బెదిరింపా? ధిక్కారమా? అతనిలోని భీరుత్వం, సానుభూతి - రెండూ రెక్కలు కట్టుకుని ఎగిరి పోయాయి. కొన్ని వారాలనుంచి దినదినాభివృద్ధి పొందుతున్న అసహ్యం గట్లు తెంచుకుని ఉప్పొంగిపోయింది. అతనికిప్పుడు ఒక్కటే కోరిక- ఆమెనిక జన్మలో మళ్ళా చూడకపోవటం. హఠాత్తుగా కంఠస్వరం మార్చి, ఉద్యోగ నిర్వహణలో తాను కనపరచే గాంభీర్యమంతా ఉట్టిపడేటట్లు చెప్పాడు.

"అవును మన్నీ, ఆమాట నిజమే, గొడవలు లేకుండా ఉండాలని రంగన్ననే ఇంటి పనంతా చూడమన్నాను. అతను నిన్ను వెళ్ళిపొమ్మంటే నువ్వు వెళ్ళాల్సిందే- ఇంక ముందైనా నువ్వు అతనితో మర్యాదగా ప్రవర్తించటం అలవరచుకుంటేనే తప్ప. అలాచేసే మాటయితేనే, నీ పొగరుమోతు ప్రవర్తనకు మన్నించమని రంగన్నతో నేచెబుతాను. లేకపోతే నువ్వు ఈ యింట్లోంచి వెళ్ళవలసిందే. ఎంత శీఘ్రంగా దయచేస్తే అంత మంచిది."

అతన్ని బెదిరించటమే ఆమె ఉద్దేశమైతే దానికితగిన ఫలితం అనుభవిస్తుంది. ఇటువంటి వేధవ్వేషాలు అతనిదగ్గర సాగవు!

తివాసీమీంచి దృష్టి మరలించి తలపైకెత్తి యజమానివైపు మన్ని చూసిన చూపులో క్రౌర్యం కించిత్తుకూడా లేదు. తప్పించుకోవడానికి చేసిన ఆఖరు ప్రయత్నం కూడా విఫలమై వేటగాడి చేతికి చిక్కిపోయిన క్రూరమృగంలా ఉందామె ఇప్పుడు.

"మంచిదయ్యా" అంది మన్ని బొంగురు గొంతుతో. "నేను ఇప్పుడే వెళ్ళిపోతున్నాను. మీకెప్పుడూ కష్టం కలిగించను" అంటూ మెల్లిగా వెనక్కి తిరిగి ఆ గదిలోంచి నిష్క్రమించింది.

ఆ సాయంత్రం క్లబ్బునుంచి తిరిగిరాగానే గౌరీనాథ్ తన ఆఫీసుగదిలోకి వెళ్ళాడు- మధ్యాహ్నం తనకోసం ఏవైనా ఉత్తరాలు వచ్చాయేమో చూసుకునేందుకు. ఆఫీసు బల్లమీద ఏదో అపరిచితమైన వస్తువు అతనికంట బడింది. పల్లెటూరి పనితనం ప్రతిబింబించే ఒక చిన్నదేవదారు చెక్కపెట్టె. దానికి తాళం లేదు. లోపలున్న వస్తువులన్నీ ఎంతో శ్రద్ధగా సర్దినట్టున్నాయి. అవన్నీ అప్పుడప్పుడు గౌరీనాథ్ మన్నికిచ్చిన బహుమతులు. అవి కాకుండా ఒక పెద్ద రూపాయల దొంతర (ఆమె జీవిత కాలమంతా కూడబెట్టినది), ఒక చిన్న వెండి ఉంగరం, ఆమె చిన్నప్పటి

ఫోటో ఒకటి - అందులో మన్ని కళ్లు ఫ్లాష్ లైటుకి చెదిరినట్లుగా, యజమాని తన్ను పనిలోంచి తీసివేసిన విషయం ఖాయమేనని తెలుసుకున్నప్పుడు పొందిన మానసిక క్షోభా, వ్యధతో నిండినట్లుగా ఉన్నాయి:

ఒళ్లుమండిపోయి గౌరీనాథ్ ఒక్క అరుపు అరిచాడు నౌకరుని 'రమ్మని- తన ఆఫీసు బల్లమీద ఆ వెధవ చెత్తంతా ఎలా వచ్చిందో కనుక్కునేందుకు. ఆ నౌకరు తన శత్రువుని నిలదీసి అడగాలని చరచరా వంటింట్లోకి వెళ్ళాడు. కాని అక్కడలేదు మన్ని, పెరట్లో కూడా లేదు. ఆ భవనంలో మారు మూలలన్నీ వెతికినా కనిపించలేదు. ఆ మర్నాడు స్థానిక వార్తాపత్రిక చదువుతూ హుస్సేన్‌సాగర్‌లో ఓ ముప్ఫయ్యేళ్ళు దాటిన స్త్రీ శవం తేలిందన్న వార్త చూసినప్పుడుగాని మన్ని ఏమయిపోయిందో యజమానికీ, నౌకరుకీ అర్థం కాలేదు.